ఓమ్

# శ్రీమద్బ్రహ్మ

# విజ్ఞాన పరిచయము.

అను

## (చతుష్పాద్బ్రహ్మ నిరూపణము)



కర్త

అనుశ్రుత వైజ్ఞానిక

## చల్లా కృష్ణమూర్తిశాస్త్రి

 వెల **5-0-0**



# పరిచయము

అందఱు బౌరాణిక చతుశ్శీర్ష బ్రహ్మ నెఱుంగుదురు కాని - ‘‘ఏకమేవా ద్వితీయం బ్రహ్మ’’ - ‘‘సర్వం ఖల్విదం బ్రహ్మ’’ యగు నీ గ్రంథి శీర్షిక యందలి వేద ప్రతిపాదిత బ్రహ్మ నెఱుంగరు. ‘‘ఏక విజ్ఞానేన సర్వం విజ్ఞాతం భవతి’’ యని చెప్పబడిన బ్రహ్మ జ్ఞానము కంటె నుత్కృష్టజ్ఞాన మేమి కలదు? వేద ద్రష్టలగు మహర్షులే దీనిని వెలయించిరి. వేదమే ప్రకారాంతరముగ బ్రహ్మ. స్మృతీతిహాస పురాణముల యుపబృంహణమునకు బ్రహ్మ విజ్ఞానమే మూలము. బ్రహ్మతత్త్వము సర్వజ్ఞము, సర్వశక్తి, సర్వవిత్ అయియున్నది. అల్పజ్ఞము, అల్పశక్తి, అల్పవిత్ అయిన జీవాత్మ బ్రహ్మ భూమాభావమును గుర్తించి - బ్రహ్మత్వమును బొందుటయే వేద విద్యా లక్ష్యము. విశ్వబంధన విముక్తిగోరు జిజ్ఞాసువు లవస్యముగనీ బ్రహ్మవిజ్ఞానము వంకకు దిరుగవలసినదే. ‘‘నాన్యఃపంథా’’

మహాభారత కాలమునకు బూర్వము - దేవయుగము మన యున్నతికాలము. విశాల విశ్వమునకు శిల్పకళా వాణిజ్య సభ్యతా సంస్కృతి పాఠములు నేర్పి - మానవత్వ వికాసము గలిగించిన మన వేద విజ్ఞానము భారత కాలమునాటికే వినష్టమైనది. పిదప శ్రీ శంకర రామానుజీయ మాధ్వాది సామయిక మత వాదాభి నివేశములంబడి - వైదిక ధర్మమూల ప్రతిష్ఠా పరిత్యాగము జేసికొన్న సాంప్రదాయిక బృందములన్యోన్య కలహముల బెంచుకొన్నవి. కాలదోషమున నేమి - పరదేశీయుల ప్రాపకము వలననేమి - పాశ్చాత్య నాగరికతా వ్యామోహము వలననేమి - మన వైదిక బ్రహ్మవిజ్ఞానము లుప్తప్రాయమై పోవుటచే - దత్పరిచయము నేడందఱకు నవసరమే.

శ్రీ శాస్త్రి గారిచే రచింపబడిన యీ ప్రథమ పఠనీయ గ్రంథము సార్థక నామధేయము గలది. సుపరిచితుల మనుకొను నపరిచితులకెల్ల యదార్థ వేదార్థ పరిచయము గలిగించు నీ చిన్ని పొత్తము - బాలురగు పెద్దలకే శిక్ష గఱపు పెద్ద బాలశిక్షవంటి పెద్ద పొత్తమే యనుట యుత్తమము. అమాత్యాది లౌకిక వ్యక్తుల, క్షణమాత్ర ముఖపరిచయమునకు వేలాది ప్రజలు వాలాడిపోవుదురు కాని - సత్యాన్వేషణమునకు దపస్సులు ధారపోసి -

లోకహితంబుగా పలికిన సత్పురుష శాశ్వత గ్రంథ పరిచయమున కెవ్వరు శ్రద్ధ వహింపరు గదా! మహాపురుష మహావాక్యముల పరిచయము ఘనిష్ఠ సంబంధము బెంపొందించుకొని శాశ్వతానందానుభూతికి హేతువగును. ప్రస్తుత పుస్తక మీ ప్రశస్తకోటికి జెందినదే.

ఇందు సృష్టి చిత్రణము - ఆత్మ స్వరూప భేదములు - ఆత్మగతి - స్థూల సూక్ష్మ కారణ శరీరములు - పునర్జన్మము - బ్రహ్మ + కర్మలు - యజ్ఞము - వర్ణవీర్య ధర్మములు - ఋషి పితృదేవ గంధర్వాసుర మనుష్య స్వరూప విజ్ఞానములు - మున్నగు మనుజమాత్రున కెఱుంగదగు సర్వ విషయములు - "సర్వం వేదాత్ప్రసిధ్యతి" అన్నట్లు శ్రుతి ననుసరించి సంగ్రహముగా సమీక్షింపబడుటచే - దీనిని ఆంధ్ర వేదసంగ్రహముగా గ్రహింపవచ్చును. సృష్టి ఎప్పుడు - ఎట్లు - ఎందుకు - ఏల - ఏమి - అను బ్రహ్మసందేహములన్నియు నీ బ్రహ్మవిజ్ఞానముచే గతార్థము లగును. ఈ ప్రపంచ మంతయు నొకేబ్రహ్మయయ్యు ననేకముగా నెట్లు వ్యవపదేశింపబడుచున్నదో యెఱుంగు సంచరపక్షము విజ్ఞానము. అనేకముగా దోచు నిది యంతయు నొకేబ్రహ్మ యెట్లయినదో యెఱుంగు ప్రతి సంచరపక్షము జ్ఞానము. ఈ రెండు మార్గములు నిందు బ్రదర్శింపడినవి. "యదేవేహ తదముత్ర యదముత్రతదన్విహ" అను శ్రుతి వచనానుసారము - తనయందున్నదే విశ్వమందున్నది- విశ్వమందున్నదే తనయందున్నది. ఇది యంతయు నొకే చతుష్పాద్బ్రహ్మయై "సర్వేసర్వం ప్రతిష్ఠితము"గా నెట్లు సమన్వయపడుచున్నదో యిందలి నాలుగు ప్రసంగములలో బ్రకారాంతరములుగ వివేచింపబడినది.

పాశ్చాత్య భౌతికాభ్యుదయ విజ్ఞాన సీమా రేఖ పరిసమాప్తమైన పరమాణు పరిశోధన పర్యంతము - మన చతుష్పాద్బ్రహ్మ కొక వికార కూట క్షర మర్త్యపాద విభాగము మాత్రమే యన్నచో - దీనిపై గల యమృతపాదములు మూడింటిని నిర్విశేషునివరకు నిశ్శేషముగా బరిశీలించి వైచిన మన ప్రాచీన వేద వాఙ్మయ మెంత యుత్కృష్టమైనదో యోచింపుడు. ప్రపంచేతిహాసము నంతయు గర్భీభూతము గావించుకొన్న మన యార్య వాఙ్మయము కంటె జ్యేష్ఠము శ్రేష్ఠము నగు నితర సాహిత్యమేమైన యున్నదా? పరదేశీయులగు పాశ్చాత్యులెంతో వ్యయ ప్రయాసములతో ఈ వేదరాసిని మథించి నవీన వైజ్ఞానిక పరిశోధనలు గావింపు చుండ - భారతీయులమగు మనము దీనిని మృతభాషగా

సమాదరించుట యెంత దౌర్భాగ్యమో విచారింపుడు. వారి యాధ్యాత్మిక మనస్తత్త్వములు అనుమానికములే కాని - మన యార్ష సిద్ధాంతములవలె బ్రామాణికములు కావు. మన శాశ్వత విజ్ఞాన మెఱింగినచో - వారి నిస్తంత్రీ విమాన పరమాణ్వాది క్షణిక విజ్ఞాన పరిశోధనల కబ్బురపడ నక్కఱలేదు. క్షరతత్త్వ ప్రధానమగు ప్రాపంచిక వ్యవహారకాండ యందెంత నైపుణ్యము జూపినను నిష్ఫలమే. మన ప్రాచీన భారతవర్ష గురుభావదశ పునఃప్రతిష్ఠ సేసి - విశ్వకళ్యాణము గూర్చు నీ వేదవిజ్ఞాన పరిశోధనలకు ప్రజాప్రభుత్వ సంస్థల ప్రోత్సాహము నేడెంతయో యావశ్యకము. విద్యార్థులకిది పాఠ్యగ్రంథముగా నుండదగిన విషయము.

ఇందలి నిర్విశేషపరాత్పరుల రస బల తత్త్వ వివేచనచే ద్వైతాద్వైత మౌలికభావ సమన్వయము సంభావింపబడు చున్నది. అన్నమయ కోశమునకు లోగడ గల ప్రాణ మనో విజ్ఞానానందమయ కోశ సంచార పరిచయ మిందు గలిగించు కొనువారు - సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ మగు నంతర్జగద్విహారానంద మనుభవింపగలరు. ఇందలి క్షరాక్షరా వ్యయపురుషుల యుపాదాన నిమిత్తాలంబన కారణ స్వరూపములు - బ్రహ్మ విష్ణింద్రాగ్నీ షోముల క్రియాకలాపములు - వషట్కార స్తోమ విజ్ఞానములు - వేదయజ్ఞ ప్రజాలోక ధర్మ స్వరూపములు - సువిశదంబు చేసికొన్నచో బ్రహ్మాండోత్పత్తి వినాశము లెట్లు జరుగుచున్నవో బోధ పడగలదు. పరోరజావ్యయు నాశ్రయమున నుండుచున్న స్వయంభూ పరమేష్ఠి సూర్య చంద్ర పృథివీ మండలముల పుండీర విజ్ఞానముచే విశ్వ స్వరూప దిగ్దర్శన మగుచున్నది:

ఇక నాధ్యాత్మికముగా జీవునియందు ఓజో శుక్రాది ధాతువుల నభివ్యాప్తములై శాంతాత్మామహానాత్మాదు లెన్ని యున్నవో - బీజ దేవ భూత చితులచే గారణ సూక్ష్మ స్థూల శరీరము లెట్లు కలుగుచున్నవో యిందు దెలసికొన్నచో - దన స్వరూపము దా నెఱింగినట్లే యగును. అందరు మోక్షము కోరుదురు కాని దాని స్వరూప మెఱుంగరు. పూర్వాచార్యుల సర్వకర్మ విప్రమోక్ష సిద్ధాంతము బూర్వపక్షము సేసి - యాత్మ బలచితి బంధమోక్షమే మోక్ష స్వరూపముగా వీరు వైజ్ఞానిక విమర్శ గావించుట సహేతుకముగా నున్నది. సర్వ శరీరములందు గల యాత్మ సమానమే యనుకొనుచున్నారు. శరీరమందు

గల యాత్మలన్నియు నిందు వివరింపబడి, తత్కారణ భేదము లిందు సూచింపబడినవి. ఇందలి మూడు నాలుగు ప్రసంగములందలి చతుష్పాద్బ్రహ్మ నిరుక్తి యందు శ్రుతి గీతా ప్రమాణ వాక్యము లనుసంధింపబడినవి. విజ్ఞాన శాస్త్ర యుక్తమగు విద్య వికసించి ఫలించును గాని - యూహాగాన కల్పిత కల్పనావల్లులు మఖలో బుట్టి పుబ్బలో మాడిపోవును. గావున జదువరు లిందలి యుపపత్తు లెఱింగియే విశ్వాసము ధృఢపరచుకొనవచ్చును.

ఈ బ్రహ్మ విజ్ఞానమున కంతటికి నాధార భూతమగు మాండూక్యోపనిషద్విజ్ఞానము నందలి ఓంకార స్వరూప భేదము లన్నియు నైదవ ప్రసంగముగా జేర్పబడినవి. ఇందలి ఆంభృణీ సరస్వతీ వాగ్వివర్తములచే పరబ్రహ్మ శబ్దబ్రహ్మ స్వరూప విజ్ఞానము గూడ విశదీకరింపబడినది.

అవి యివి యననేల ? వేద విజ్ఞానమునందు బ్రవేశము గలిగించుట కవసరములగు విషయము లన్నియు నిందు వివరింప బడినవి. ఆధి భౌతికాది దైవికాధ్యాత్మిక బ్రహ్మ వివర్తములను వీరు ముప్పేట త్రాడువలె బేని - సూత్రప్రాయముగా నిందు బ్రదర్శించుట ప్రశంశనీయము. విషయ విజ్ఞానముతో బాటు వైదిక శబ్ద సంకేతపరిచయము గూడ గలిగించుట యీ గ్రంథ విశిష్టత. శ్రీ మద్భగవద్గీతా విజ్ఞాన సౌలభ్యమునకు - సకల శాస్త్రేతిహాస పురాణ మౌలిక రహస్య పరిజ్ఞానమునకు నీ బ్రహ్మ విజ్ఞాన పరిచయ మెంతో సహాయకారి. ఆంధ్రుల పాలిటి యదృష్టదేవత వలె శ్రుతి ననుసరించి యవతరించిన వీరి విజ్ఞాన లక్ష్మీనారాయణీయ గ్రంథ సందోహమునకు గూడ పరిచయ రూపముగా వెలువడిన యీ వైజ్ఞానిక గ్రంథమును ఆంధ్రప్రజ లెల్ల గ్రహించి కృతార్థులగుదురు గాక !

భక్త పరమాణువు.

శ్రీమత్తిరుమల వేంకట శ్రీనివాసాచార్యులు, బి.ఏ.

పెంటపాడు
జయ శ్రీరామనవమి



శ్రీరామచంద్ర

# విజ్ఞప్తి

విచక్షణులారా !

శ్రీమద్గురు మధుసూదన దివ్య కృపాపరిలబ్ధ విజ్ఞానోప దేశ భంగిమములకు జెందిన, యీ గ్రంధమందలి ప్రసంగ పంచకము, యదార్థ జిజ్ఞాసువులకు, వైదిక విజ్ఞాన పేటికాంతరస్థ పదార్థ పరిచయము సులువుగ గల్గించి, అనుభూతి యోగ్యతం గూర్చుట కనువగు కుంచిక.

"విజిజ్ఞాసితవ్యః, అన్వేష్టవ్యః" అను మహద్భూత నిశ్వాస రూప వాగ్వివృత్తి చొప్పునను,

"ఇదంతే నాతపస్కాయ - నాభక్తాయ కదాచన
నచాశుశ్రూష వేవాచ్యం - నచమాం యోஉభ్యసూయతి"

అను శ్రీమద్భగవదాదేశ ప్రకారమునను

"యదిహరి స్మరణే సరసమ్మనో,
యది విలాస కలాసు కుతూహలమ్
మధుర కోమలాకాంత పదావళీమ్
శ్రుణు తదాజయదేవ సరస్వతీమ్"

అని భక్త జయదేవుడన్నట్లును, యదార్థ జిజ్ఞాసువులే యీ గ్రంధము గైకొనదగుంగాని, ఏదో యొక సంప్రదాయము నవలంబముగా గొని, యందు ననుభూతిలేమి, గేవల మభినివిష్టచిత్తమున, 'ఖ్యాతిలాభ పూజార్థ' మన్యముం ద్వేషించు వారును, "మాకును విజ్ఞానానాను భూత్యాసక్తులుగల" వనిపించుకొనదలచు, దంభ స్వరూప వాగ్విలాసులును, దీనిం జేతబట్టి, చిత్తుకాగితములబుట్ట కెక్కించుట తగదని మొదటి మనవి.

సులువుగ బోధ పడవలయుననియే, చేతనైనంత తేలికగ వ్రాయబడిన యిందలి పరిభాషా పదంబులంగూర్చి 'గ్రంథ గ్రంథుల' ని యాక్షేపింప బూనువారికీ క్రింది శ్రీ హర్ష వచనము స్మరణీయము:-

"గ్రంథ గ్రంథి రిహక్వ చిత్క్వచి దపిన్యాసి ప్రయత్నాన్మయా
ప్రాజ్ఞమ్మన్య మనాహఠేన పఠతీ మాస్మిః ఖలః ఖేలతు
శ్రద్ధారాద్ధ గురుః శ్లథీకృత దృఢగ్రంథిః సమాసాదయ
త్వేతత్తర్కర సోర్మి మజ్జన సుఖేష్వాసంజనం సజ్జనః"

మఱి:- "ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా" యనుకోటికి జెందిన యాక్షేపకు లందరకును, నాకును గూడ నన్వయించు నీ క్రింది మీమాంసక వచన ముండనే యున్నది":-

"యధారుమాయాం లవణాకరేతు
మేరౌ యధావోజ్జ్వల రుక్మభూమౌ
యజ్ఞాయతే తన్మయ మేవ తత్స్యాత్
తథాభవేద్వేద విదాత్మతుష్టిః"

ఇక గ్రంధనామముం గూర్చి యించుక :- "సర్వంఖల్విదం బ్రహ్మ". ఇదమను సర్వనామ శబ్ద వాచ్యమయిన 'సర్వము' <u>పదార్థ</u> జాతము. పద (శబ్ద) పరిమితి వాచ్యమగు నర్థము (విషయము) గదా పదార్థము? కాగా, (1) శబ్దావచ్ఛిన్న జ్ఞానము <u>వేదము</u> (2) అర్థా (విషయా) వచ్ఛిన్నజ్ఞానము <u>బ్రహ్మ</u> (3) ఆ యీ రెంటి సంస్కారావచ్ఛిన్న జ్ఞానమును <u>విద్య</u> యన్నచో వేద - విద్యా - బ్రహ్మ శబ్దము లేకార్థ బోధకములై పర్యాయములేయగును. కనుకనే, "చత్వారోవేదాః" "త్రయీవిద్యా" "త్రయంబ్రహ్మ" యన్న వ్యవహారములు సంగతము లగుచున్నవి. అప్పుడు ఇదమను సర్వనామ శబ్దవాచ్యమగు నర్థరూప <u>బ్రహ్మ</u> <u>ద్రష్టవ్య</u>ము కాగా, (1) శబ్దావచ్ఛిన్న జ్ఞానరూప వేదముచే <u>శ్రోత</u>వ్యమును (2)

సంస్కారావచ్ఛిన్న జ్ఞానరూప విద్యచే నిదిధ్యాసితవ్యము నై "ఆత్మావారేద్రష్టవ్యశ్రోతవ్యో మంతవ్యోనిధిధ్యాసితవ్యః", "నావేదవిన్మను తేతం బృహాంతం" అన్న వైదిక పరమార్థ మనుభూత మగుచున్నది. అయినను.

బ్రహ్మశబ్దముచే, దక్కిన వేద - విద్యా శబ్దములు గతార్థములగుంగాని, వానియందు దేనిచే గాని బ్రహ్మశబ్దము గతార్థము కాదు. కనుకనే శ్రుతియు "సర్వంఖల్విదంబ్రహ్మ" యన్నదేకాని, "సర్వంఖల్విదంవేదః, సర్వఖల్విదంవిద్యా" యనలేదు. బ్రహ్మ జ్ఞానము లేని వేద విద్యావత్త్వములు గణనీయములు కావనియు, గనుచున్నాము గదా! ఇందుచే ననగా, బ్రహ్మశబ్దము తనతో దక్కిన రెంటికిని గ్రాహకమగుటచే నీ ప్రసంగ పంచకమునకు, 'బ్రహ్మ విజ్ఞానపరిచయ' మని నామకరణము సేయనయ్యెను. ఇది యెంతవరకు సార్థకమయినదో జిజ్ఞాసు జన పరిశీలనంబట్టి తేలగలదు.

ఈ గ్రంథ మించుమించుగ బదేండ్ల క్రిందటనే నాచే గ్రథితమయినను, అటనట నేదొయొక ప్రసంగ మాధారముగా నుపన్యస్తమగుచు వచ్చె గాని, ముద్రితమగు నవకాశముంగాంచదయ్యెను. గత శ్రీరామనవమికి తాడేపల్లిగూడెము దగ్గర పెంటపాడు గ్రామమందు జరుగుచున్న యొకానొక సప్తాహ సందర్భమున, నచట నా యుపస్థితి ఘటిల్లుటయు, నందు నా యుపన్యాసము లాలించి మరల బిలిపించి వేయేల? నన్నే తమ సర్వస్వముగా నేటికిం జూచుకొనుచు,

"మచ్చిత్తా, మద్గతప్రాణా, భోధయంతః పరస్పరమ్
కధయంతశ్చమాం నిత్యం - తుష్యన్తిచ, రమన్తిచ"

యను కోటికిజెందిన భక్తాగ్రేసరులగు, శ్రీమత్తిరుమల వెంకట శ్రీనివాసాచార్యులు, బి-యే వారి ప్రోత్సాహమునను, వారి పూజ్య శ్రీ పితృ పాదులును, సంస్కృతాంధ్రాంగ్ల భాషా కోవిదులు, కవిపుంగవులు, ఆయుర్వేద శాస్త్ర పారంగతులు నగు శ్రీ రాఘవాచార్యులవారి యనుగ్రహ విశేషమునను, వారి యత్త మామలగు శ్రీ కిళాంబి సీతమాంబా జగన్నాథా

చార్యుల యౌదార్యాశీర్వాద బలముననను, శ్రీ మాఃః ప్రతివాది భయంకర వెంకట నరశింహాచార్యులవారి హృదయ పూర్వక సహాయతవలనను నేటికిది జిజ్ఞాసు కరకమలయోగము గాంచగల్గినది. శ్రీమద్భగవాను డవ్యయ కృష్ణుడా యుదారుల యెడ "దదామిబుద్ధి యోగంతంయేనమా ముపయాంతితే" అన్న తన ప్రతినను జెల్లించుకొనుగాక యని యాయనం బ్రార్థించుచుందును.

దీనికి బీఠికను బైన పేర్కొనబడిన శ్రీనివాసులే రచించుట నా యదృష్ట మనుకొందును. నా పరమాప్తకోటికి జెందిన బ్రహ్మశ్రీ అమ్మనమంచి నరశింహ్వామూర్తి గారికీ గ్రంథమందలి శ్రద్ధాభక్తులు దీనికి తప్పొప్పుల పట్టికతో బని లేకుండ జేయుట నా భాగ్యము. ముచ్చటగ దీనిని ముద్రించి యిచ్చిన శ్రీ విజయప్రెస్ మేనేజరు శ్రీ సరిపల్లె రెడ్డెయ్యగారు నా చిరకాల మిత్రులని నేను గర్వించుచు, నా గర్వము నా భవిష్యదభివృద్ధి హేతువని మురియుదును; వీరందరి కాయవ్యయేశ్వరు డాయురారోగ్య జ్ఞాన సంపద లొసంగుతమని పదే పదే స్మరింతును.

ఇట్లు
గ్రంథకర్త

జయ శ్రీరామ నవమీ
ఆదివారము

ఓన్నమః పురుషోత్తమాయ

గురవే మధుసూదనాయ,

# శ్రీమద్బ్రహ్మ విజ్ఞాన పరిచయము.

## ప్రథమ ప్రసంగము

"ఏకంవా ఇదం వి బభూవ సర్వం"

"సర్వం ఖ ల్విదం బ్రహ్మ"

"ఏకమేవాద్వితీయం బ్రహ్మ"

"ఐతదాత్మ్య మిదం సర్వమ్"

అను నీ మొదలుగా గల మంత్ర బ్రాహ్మణ శ్రుతివచనములం బట్టి యీ ప్రపంచమొకే బ్రహ్మయయ్యును, అనేకముగా వ్యపదేశింప బడునని తెలియనగును. ఇందొక్కొక వ్యక్తియు "చతుష్టయంవా ఇదంసర్వం" అనుకౌషీతకీశ్రుతి చొప్పున:-

(1) పురము (2) పురుషుడు (3) పరాత్పరుడు (4) నిర్విశేషుడు అని నాలుగేసి విధములుగా విభక్తమగును. ఎట్లన :-

### (1) పురము

బాహ్యమున మనకగపడు నీయెల్ల వికార సంఘము, భూత గ్రామము, నాత్మ గ్రామము, (ప్రతి యవయవమునకును వేర్వేరు భూతములు నాత్మలు గల్గినది) అగుట వలన 'పుర' మనబడును. ఈవికార కూటము లాత్మచే విగృహీతములు (విశేషముగా గ్రహింపబడినవి) వివిధత్వముగా గ్రహింపజేయునవి యగుటచే పురము 'విగ్రహ' మనియు బిలువ బడును.

ఆయీవికార కూటములు (1) ఔపపాదికములు (2) ఔపసర్గికములు (3) ఔపజనికములు నని మూడు భాగములు.

| | | | |
|---|---|---|---|
| ఇందు :- | దిక్కు | సంఖ్య | సంయోగము |
| | దేశము | పరిణామము (మార్పు) | విభాగము |
| | కాలము | పృధక్త్వము (వేర్పాటు) | పరత్వము |
| | | అపరత్వము | |

అనునీపది ధర్మములును కేవలము భాతిసిద్ధములు, వానియంత నవే యొప్పునవి, కనుక ఔపపాదికములు భావనామయము లగుటచే నివి యుపనామములు; ఔపనామికములు ననియు నందురు.

ఇక, శుక్రశోణితములు - అన్న జలౌషధములు - పృధివీ రసములు - అంతరిక్షరసములు - సూర్యచంద్రాదిద్యురసములు పాష్టికములు (పిమ్మటివి) అగు నితర సంసర్గజములగు నెల్లధర్మములు, మరొక చోటనుండి తనయందు సంస్పృష్టములగు (కలయిక ముందుపడు) ఉపసర్గములు ఔపసర్గికము లందురు.

మఱియు, ప్రతివ్యక్తి యందు, తన యాత్మనుండియే, ఇనుమునుండి త్రుప్పు, నీటినుండి నురుగు, పాలనుండి మీగడ వలె స్వభావముగనే పుట్టునట్టి కొన్ని వికారములు ఉపజనములు - ఔపజనికములందురు.

ఇట్టీ మూడు తెరగుల వికార సంఘమును ఈశ్వరపురుషుంబట్టి విశ్వమనియు, జీవపురుషుం బట్టి శరీరమనియు నందురు. ఇది పురుషున కుపకరణము, కనుక నతనికిది బాహ్యముగ సంసక్తమగును. ఆయీ ముత్తెఱగుల వికార సంఘమును బ్రహ్మ కొకపాదము.

## (2) పురుషుడు

పురమగు శరీరము (1) ఆత్మమయము (2) దైవత మయము (3) భూతమయము నని మూడు విధములు. ఈ మూడధికరణము (ఆధారము) లందు బ్రవేశించిన

ప్రాణవిశేషము 'పురవాసి' కనుక పురుషుడందురు. అతడును, (1) క్షరుడు (అవరుడు), (2) అక్షరుడు (పరావరుడు, (3) అవ్యయుడు (పరుడు) అని మూడు విధములు. ఇందు (1) క్షరపురుషుడు సర్వ వికార సంఘములకు పాదాన (కార్యమందుండు ప్రధాన) కారణము, ప్రభవ (పుట్టుక) ప్రతిష్టా (ఉండుట = స్థితి) పరాయణము (లయస్థానము) కనుక వానికన్నిటికి నాత్మ, కుండమట్టి యందు - వస్త్రము నూలునందువలె, వికారము లెల్ల నతని నాధారముగా గొనియుండును (2) తదంతర్గతుడగు నక్షర పురుషుడు ఆ వికారములన్నిటికి జనకుడు, నిమిత్త కారణుడు, కార్యసమన్వితుడయ్యు నతడవి కుర్వాణుడు (వికార మొందని వాడు) (3) ఆ యక్షరుని లోపలి వాడవ్యయుడు ఈయనకు కార్యత్వ - కారణత్వములు లేని విశుద్ధుడు - ఆశ్రయమాత్రుడు, కాని, కంటికి సాధ్యమగు చూచుటందు సూర్యకాంతి వలె స్వరూప సత్కారణము మాత్రమగును. ఆయా త్రిపురుష భేదము గల యాత్మ గ్రామము బ్రహ్మకొక పాదము.

## (3) పరాత్పరుడు

అవినాభూతులగు నామూవురు పురుషులతో 'గూఢోత్మాప్రజాపతి' యను నొకపురుషుడొప్పును, మాయాబలో పాధిమాత్రా మితుడగు నీయవ్యయు నందక్షరుడు, నందుక్షరుడు, అన్యూనాతిరిక్తై కాయతనత్వమున (హెచ్చు తగ్గులు లేని యొకే ఆయతనమున ) నుందురు గదా!

అవిభక్తుడు - గూఢోత్మా - యగునా యీ పురుషుడొకడే ఆయా భూతములందు పరివ్యాప్తి నొంది, ఆయా భూతావచ్ఛేదము (కొల్త) చే ప్రతి వ్యక్తి యందు భిన్నునట్లు - విభక్తుని వలె తోచును ప్రతివ్యక్తి భిన్నులు - త్రిపురుషైక పురుష రూపులు - యోగ మాయోపాధి పరిచ్ఛిన్నులు - నగు ప్రజాపతులనంతులుగదా! కాగా,

ఈయనంత ప్రజాపతులు కాలానుసార ముత్పన్నులై సమవలయ మొందుటకు బుద్బుదములకు సముద్రమువలె, వీరి కంటె నన్యము - నిరుపాధికము - ప్రభవ ప్రతిష్ఠా పరాయణ భూతము అసీమమునగు నాధార మొకటి యుండవలయును. అట్టి దిగ్దేశ

కాలాద్యనవచ్ఛిన్నమగు నొక యసీమ బల సముద్రాత్మయగు బ్రహ్మ భావము పరాత్పరుడందురు.

పురుషులందు క్షరాక్షరుల నతిక్రమించు నవ్యయుడు పరుడు, ఈయనను గూడ నతిక్రమించి యుండు నసీమ బలసముద్రమగు బ్రహ్మ భావము పరాత్పరుడు. ఇతడనంత బలములుత్పత్తిల్లుట కాశ్రయభూతమగురసము, అట్టి సర్వవిధ బలవిశిష్టమగు తత్త్వమునని యెరుంగవలయును. వినశ్వర స్వభావముల గల్గి ప్రతిక్షణ వినష్టములయ్యు నీయశేష భిన్న భిన్న లక్షణ బలములొక యవినాశియగు రసమందు నిత్య సన్నిహితములై యుండును. కనుక, సర్వవిధబల విశిష్ట నిత్యైక రసమగు నీ పరాత్పర భావమును 'అభయ' మందురు ఆయీ ఏకము - నద్వితీయమునగు పరాత్పరుడు బ్రహ్మకొకపాదము.

## (4) నిర్విశేషుడు

అమృత - మృత్యు; బ్రహ్మ - కర్మ; స్థిర - చరాది రూపములగు రసబలము లయుత సిద్ధములు కనుక నొకదానిని విడిచి మరొకటి యుండనివైనను, బుద్ధిచే బలోపాధికమగు రసమాత్రము వేరుగా భావింపబడదగు, నపుడు ఆరసమును నిర్విశేషుడందురు. పరాత్పరుడు సర్వధర్మోపపన్న బ్రహ్మ భావమైనట్లీ తురీయ (నాల్గవది)ము నిర్ధర్మకమనుకొనదగును. కనుకనే నిర్లక్షణతచే విశేషించి యెఱుంగనైతి గానందున, నీనిర్విశేషముం గూర్చి అచింత్య - అపరిమేయ - అనిర్వచనీయాది పదములచే వేదమందు విందుము. సామాన్యముగ నైనచో సర్వవిధ వికారములకంటె వేరైన సత్తామాత్రమని తెలియబడును. ఈవిశుద్ధైక రసస్వరూపియగు నిర్విశేషుడు బ్రహ్మకొక పాదము. ఇది చతుష్పాద్బ్రహ్మ వ్యాఖ్యానము.

## పురుష త్రివిధత్వమందు క్షరపురుషనిరుక్తి

క్షరపరుషు నాశ్రయించిన వికార సంఘము శరీరమనుకొంటిమి గదా! క్షరాత్మక మగుటవలన నది క్షరపురుషు నందంతర్భూతము కనుక నించుకేని త్రిపురుషు నతిక్రమింపదన్నది యటుంచి పురుషత్రయమును వేర్వేరుగ జూతము.

## క్షరపురుష పాంచవిధ్యము

ఇందు, ఆత్మయందనుగమ్యమానుడగు క్షరపురుషుడు (1) కారణశరీరము, (2) సూక్ష్మ శరీరము, (3) స్థూల శరీరము, (4) ప్రజావర్గము, (5) విత్తవర్గమునని యైదు విధములు.

(1) విద్యావిద్యలు రెండో, కేవలమవిద్యయో, యగు బలవిశేషము కారణ శరీరము, (2) ఎల్లయింద్రియముల నధిష్ఠించు దేవతలు, శరీరమందు ప్రవర్తమానులగు అగ్ని - వాయు - సూర్య - భాస్వర, దిక్సోమములు సూక్ష్మశరీరము, (3) సవికారములయిన, పృధివ్యుత్పన్న పంచమహా భూతములు, స్థూల శరీరము, (4) శరీరముకంటె బహిర్భూతములు, యోని సంబంధాను గ్రహణమువలన నిత్య సంబంద్ధములునగు స్త్రీ పురుషాది చేతనములు ప్రజలందుము. కృత్రిమత్వము వలన ననిత్య సంబంధము కలవియు, ఇతరతః గ్రహింపబడిన భోగ్యజాతములను, విత్తములందుము. ఇవి గృహవస్త్రాద్యచేతనములు, పురుషులు గోవులు మొదలగు చేతనములు ననిరెండు విధములు కాగా, శరీరత్రయము, ప్రజావిత్తములు నను నైదు విధముల వాడు క్షరపురుషుడు.

## అక్షరపురుష నిరుక్తి

ఇక నీక్షరపురుష వికారములకు నియంతయై, వానియందే యనుస్యూతుడైయుండు వాడక్షర పురుషుడు. అతడును (1) బ్రహ్మ, (2) విష్ణు, (3) ఇంద్ర, (4) అగ్ని, (5) సోమ అను భేదములచే పంచలక్షణములు కలవాడు. ఇందు మొదటి మూవురు హృద్యాక్షరులనియు, చివరియిరువురు పృష్ఠ్యాక్షరులనియు నందురు. ఈపంచాక్షరుల మొత్త మొక యక్షరపురుషుడు. ఇందు :- హృద్యాక్షరులు మూవురందు (1) ప్రతిష్ఠామయుడు బ్రహ్మ, (2) యజ్ఞమయుడు విష్ణువు, (3) వీర్యమయుడింద్రుడు, (4) వికాసమయు డగ్ని, (5) సంకోచమయుడు సోముడు. (1) ప్రతిష్ఠ వలన స్థితి - ఆత్మధృతి - పశువిదృతియును. (2) యజ్ఞమువలన అర్వాగ్గతి - ఆకర్షణము - అశనాయా (ఆకలి)

యును (3) శక్తికి మించిన యుత్సాహము వీర్యము, వీర్యము వలన పరాగ్గతి - విస్రంసనము - ఉత్సాదనము - నోదనయును. (4) ప్రతిష్ఠతోడి పరాగ్గతి వికాసము (5) ప్రతిష్ఠతోడి అర్వాగ్గతి సంకోచము.

ఆయీపంచాక్షరులు ప్రతివ్యక్తి శరీరమందు నియతులుగ నుండి ఆయాప్రాణ విశేషములను ప్రయోగింతురు. ఇంద్ర ప్రయుక్తమగు యుత్ క్షేపణ ప్రాణముచే గృశించి బుభుక్షితుడగు నీప్రజాపతి (వ్యక్తి) యందు ప్రత్యుద్బుద్ధమై ప్రవర్తించు నశనాయా ప్రాణము ప్రతిక్షణమును వేర్వేరు చోటుల నుండి కొంచెకొంచెము పరకీయరసములను తనలోని కాకర్షించు చుండును. వానిని అనగా నారసములను ప్రజాపతి (వ్యక్తి) ప్రతిష్ఠాప్రాణముచే దనయందు నిల్పుకొని తనకుగల్గు లోపముంబూరించుకొను చుండును. కనుకనే యుత్ క్షేపణ ప్రాణము వలన బ్రతిక్షణమును శరీరసముత్ క్షిప్తమగుచున్నను శరీర మెప్పటియట్లు నిల్చి యుండుచున్నది. ఈయుత్క్షేపణమును, అశనాయా వల్లనగు నాకర్షణమును వినిమయముగనెచ్చోగుచుండు నది ప్రతిష్ఠా ప్రాణము. ప్రతిష్ఠాప్రాణము వలన నిల్కడ నొందియుండు శరీరమందా యాకర్షణ విక్షేపణ ప్రాణములు వాని వాని వ్యాపారములు నవి సేయగలవు.

ప్రతిష్ఠాప్రాణమున్నట్లు తోచకుండు శబ్దాదులందు గూడ స్వల్పముగానైన ప్రతిష్ఠాప్రాణముండునని యెంచితీరవలయును. కాదన్నచో శబ్దము (ధ్వని) ఎటనుండి బయలు వెడలును? మరెట్లన:- దీపార్చి (జ్వాల) నుండి రసము వెడలిపోవుచున్నను, ప్రతిక్షణమును తైలాకర్షణము వలన నది నిల్కడనుండునట్లు శబ్దమందును ప్రతిష్ఠా ప్రాణముండునని యెంచవలయును.

ఈ మూడు ప్రాణములలోని విక్షేపణాకర్షణ తారతమ్యములను బట్టి బాల్య - యౌవన - వార్ధక్యములను నవస్థావిశేషములు కల్గుచున్నవి. (1) బాల్యమందు రసాకర్షణ మధికము. ఉత్ క్షేపణమల్పము. కనుక శరీరవృద్ధి. (2) యౌవనమందు రెండును సమానము కనుక వృద్ధిక్షయములుండవు. (3) వార్ధక్యమందాకర్షణ మల్పము. ఉత్ క్షేపణ మధికము కనుక శరీర రసములు తగ్గును. ఇక, ప్రతిష్ఠాప్రాణము లేచిపోయెనా? ఆవ్యక్తి నశించును.

ఇట్లే యీ మూడు ప్రాణముల పరస్పర (i) సహయోగము వలన, (ii) ప్రత్యభిఘాతము వలన, (iii) ప్రజననము వలనను, ఈశరీరమందు (i) జరామృత్యువులు, (ii) ఆకలిదప్పికలు, (iii) శోకమోహములు నను షడూర్మిలు గల్గునట్లు తోచుచున్నది. పృధివీ సూర్యులయొక్కయు సంపూర్ణ బ్రహ్మాండము యొక్కయునుత్పత్తి స్థితి వినాశములీవిధముగనే యెరుంగవలయును. ఇంకనుంగల యెల్ల వికారములును ప్రాణప్రదులగు నీమూవురక్షరుల నుండియే సంభవించును. (1) ఆకర్షణ వలన నుత్పత్తి. (2) ప్రతిష్ఠంబట్టి స్థితి. (3) విక్షేపణానుసారము నాశము.

ఇక వీరినుండి యేర్పడిన పృష్ఠ్యాక్షరు లగ్నీషోములు. వీరి నుండియే, యితరములగు నెల్లపరివర్తన వికారములును కల్గుచున్నవి. ప్రతిష్ఠా ప్రాణమునకే ఉత్ క్షేపణ ప్రాణముతోడను, ఆకర్షణప్రాణము తోడను సమాయోగము కాగా, నందువలన వెలయువారాయగ్నీషోములు ఉత్ క్షిప్త ప్రతిష్ఠితమగు నక్షర విశేష మగ్నియనియు, ఆకృష్ట ప్రతిష్ఠితమగు నక్షర విశేషము సోముడనియు జెప్పుదురు. ఇట్లీ పంచాక్షరులును అఖిల జగన్నియంతలు - విశ్వేశ్వరులు నని తెలియనగును. మఱి:-

అగ్నిషోములన్నది ప్రతిష్ఠాప్రాణము యొక్క అవస్థా విశేష రూపములే కనుక ముఖ్య ప్రాణములు మూడే సిద్ధించు చున్నవి. ఇందు (1) ప్రతిష్ఠా ప్రాణమును బ్రహ్మ (2) ఆకర్షణ ప్రాణమును విష్ణువు (3) ఉత్ క్షేపణప్రాణము నింద్రుడునందురు. అగ్నీ షోములను వీడియుండని యీ యింద్రునే త్ర్యక్షర భక్తులు పౌరాణికులు శివుడందురు. ఇంద్ర - శివులకు భేదమున్నను ఇరువురకును, "రోదసీదైవతము" లన్న వృత్తి సామ్యమున్నందున నంతగా భేదము బాటింప బనిలేదు. వేదమందంతటను ఇంద్ర ప్రాణమునకే ఉత్ క్షేపణ కర్తృత్వము బ్రహ్మ విష్ణు సహచారిత్వము కన్పట్టును. వేదసిద్ధాంతమందొకే యీశ్వరునకు త్రైవిద్యోపపత్తి మున్ముందరయుదము. ఇట్లు "యదక్షరం పంచవిధంసమేతి" అనుశ్రుతి ననుసరించిన పంచాక్షర సంస్థాక్రమమని యెరుంగదగును. కానిండు.

బ్రహ్మ -విష్ణు - ఇంద్రులను మూవురక్షరులు + అగ్ని - సోముడునను నిర్వురక్షరులు నని మొత్తమైదుగురు దేవతలే సిద్ధించిరనియు, వీరినుండియే యీ జగమంతయు నాయావిధముగ నుత్పన్నమగుచు స్థితి నొందుచు నుపసంహరింపబడుచు పలు తెరంగుల వికారములనొందుచు విస్తరిల్లుచున్నదని యెరుంగవలయును.

ఈ పంచాక్షరులందు బ్రహ్మ ముఖ్యుడు. తదనుగతులింద్ర విష్ణులు. వారి సహకారమువలన బ్రహ్మకు సిద్ధించు రూపాంతరమే అగ్నిషోములన్నది. విక్షేపధర్మము (స్వభావము) గల యింద్రునిచే విక్షేపింపబడు శుద్ధబ్రహ్మ గాని, విష్ణువోతోడి బ్రహ్మగాని అగ్నియని యుపచారముగా (గౌణముగా) జెప్పుదురు ఎట్లన!-

"అర్థంవైప్రజాపతేరాత్మనో మర్త్యమాసీత్ అర్థ మమృతం" (ప్రజాపతి యాత్మయందు సగము మర్త్యము, సగమమృతము). అను శ్రుతి చొప్పున, అందలి మర్త్యమన్నది స్థూలము కనుక విశేషదూరము విక్షేపింప నైతికానందున, ఎంతవరకాబ్రహ్మ యొక్క మర్త్యభాగము విక్షిప్తమగునది యాతని "శ్రాయయంతీయం సామ" 'శరీర' మందురు. దానికి బరముగ నలువంకలను 'వారవంతీయము'. సరియే,

ఇక నమృతము సూక్ష్మతమ మెంతయో విస్తరించును దాని విస్తారము బ్రహ్మనామ 'పారావతము'. అవ్యయపురుషుని వాక్కులకది పరాకాష్ట (చివరిమెట్టు) "యావద్బ్రహ్మ విష్టితం తావతీర్వాక్" (బ్రహ్మవ్యాపన గలంతవరకు వాక్కే) అది నలువదియెనిమిదవ (48) స్తోమము. కాగా,

బ్రహ్మ ప్రతిష్ఠితుడగు విష్ణువింద్రునిచే విక్షిప్యమాణుడై త్రివృత్ (9) పంచదశ (15) ఏకవిశం (21) ములను మూడు స్తోమములను మూడు విక్రమములుగా విక్రమించును. ఆ మూడు స్తోమములును మూడగ్నులగును. అందు విష్ణువుచే వేరు సేయబడిన (అవచ్ఛిన) బ్రహ్మయే, విష్ణు విక్రమణము వలన వితాయ మానమగుచు నీ యమృతాగ్ని రూపమున బరిణమిల్లును. ఆ యీ యేకవింశము వరకు గల యగ్నిష్టోమము

వారవంతీయమను పేరుగలది. శరీరమనుడు త్రివృత మనుడు, సర్వభూతములు మర్త్యాగ్ని. ఏకవింశము వరకు గల సర్వదేవతలును అమృతాగ్ని. అమృతాగ్నికిబైన 33వ స్తోమాంతముగల బ్రహ్మామృత భాగము సోమము, ఇట్లు పంచప్రాణరూపులగు పంచాక్షరులు సిద్ధించిరి.

## అగ్ని షోములు

ఇందు, బ్రహ్మేంద్రవిష్ణులు - హృదయదహర (గుహ) మందలి ప్రాణవిశేషములు. అగ్నియన్నది రెండు విధములు. (1) శరీరమాత్రము - భూతమయము - మర్త్యము (2) దేవమయ మమృతము. అది శరీరస్థము - శరీరమునకు వెలుపల నుండునదియును. ఏమైన నీ రెండు విధముల యగ్నియు పిండాంతస్థమై నాభినుండి పైకిబోవు స్వభావముగలది కనుక నెటనుండి యేని, పిండము నుండి యనవరతము బయటికి బోనుంకించు చుండును. కాని, అన్ని దిక్కులనుండియు సూయమానమగు సోమము ప్రతి పిండమునకును బాహ్యమందుండి యనవరతమును శరీరదహర వివరమందు బ్రవేశింప బ్రవర్తించుచుండును.

ఇట బ్రహ్మవాఙ్మయుడు. ఉత్క్రామకుడింద్రుడు. అతని వ్యాపారమువలన నుత్క్రమించి బ్రహ్మవితానమును వాక్కే యగును. ఆయీ వాక్కు పిండాంతర్దహర హృదయమగు బ్రహ్మస్థానము నుండి యెంత దూరము బాహ్యమునకు వితాయ మానమగు, నంత ప్రదేశము 48 భాగము సేయగా నందలి 33 భాగము లహస్సులు. అహస్సులను విభాగించు నవచ్ఛేదములు రాత్రులు. ఇట్లీ విభాగము లహోరాత్ర రూపములు. అహోరాత్ర సంధులు విష్ణు సంజ్ఞలని సామవేదమనును.

ఇందు మర్త్యపిండ పర్యంతము శరీరము మర్త్యాగ్ని యిందు సంసృజ్యమానమగును. శరీరపృష్ఠ సంసక్తము కంటె మూడు భాగములకుబైని అయిదు షట్కములచే (5 × 6) పంచస్తోమము లేర్పడును. మొదటిదగు మూడు భాగము లోక

స్తోమము. దానితో మొదటి షట్కము గలుపగా త్రివృత్ స్తోమము. దానికి రెండవ షట్కము గలుపగా పంచదశస్తోమము. దానితో మూడవ షట్కము గలుపగా నేకవింశ స్తోమము. దానికి నాల్గవ షట్క యోగముచే త్రిణవ (27) స్తోమము. దాని కైదవషట్కము జేర్పగా, త్రయత్రింశత్ (33) స్తోమము. ఇట్లయిదు స్తోమములు సిద్ధించును. ఇందు 21 స్తోమాంత మమృతాగ్ని భాగము పర్యవశించును. ఆపై రెండు స్తోమములును సోమ భాగములు. ఇట్లు అహోరాత్రముల తోడి జగత్తు అగ్నీ షోమాత్మకము.

ఇందు 9 - 15 - 21 స్తోమములందలి యగ్ని వరుసగ అగ్ని - వాయు - ఆదిత్యులని విభాగింతురు. ఆపైనున్న రెండు స్తోమములును వరుసగ (బ్రహ్మణస్పత సోమము) "దిక్సోమము", నని రెండు సోమములు. ఈవిథముగ, అగ్ని భేదములు మూడు, సోమభేదములు రెండు కాగా (1) అగ్ని (2) వాయువు (3) సూర్యుడు (4) భాస్వరసోమము. (5) దిక్సోమముననిపంచదేవత లేర్పడుదురు. ఇందు రెండు సోమములును అగ్ని త్రయమునందు నిత్యమును హోమమగుచుండును. అందువలన సూర్యునందనుడు - పృథివియందనుడు - మన శరీరములందనుడు - నిత్యము నగ్ని ప్రజ్వలితముగ నుండుచుండును. ఆ ఈ యజ్ఞము ప్రతివ్యక్తి కిని జీవనహేతువుగ నెరుంగదగును. సర్వప్రజలు సహయజ్ఞులుగా ప్రజాపతి సృష్టులై యుండుచున్నారు. ఏ వ్యక్తి కి స్వయజ్ఞము నశించునో, ఆ వ్యక్తి మరణించును, వినాశ మొందును.

ఆయా యజ్ఞమునకు జెందిన యగ్నిత్రయవిభాగమందింక నితరులు 33 గురు దేవతలు. 9వ స్తోమమందష్ట (8) వసువులు, 15వ స్తోమందేకాదశ (11) రుద్రులు, 21వ స్తోమమందు ద్వాదశాదిత్యులు (12) మొత్తము 31. ఇక పృథివ్యంతరిక్షములకు, అంతరిక్ష ద్యులోకములకు గల రెండు సంధులతో - లేక, ద్యావా పృథ్వులతో - లేదా అశ్వినులతో - లేదా, పృథివీగర్భస్థ ప్రజాపతి - ద్యుగర్భస్థుడగు నింద్రుడు అను నిర్వురితో, లేదా ప్రజాపతి - వషట్కారములతో ముప్పది మూవురు. ఈ పక్షములందంతగా విశేషములు లేవు. చూడు డించుక.

ఇట నాభి (హృదయము) నుండి ప్రధి (అంచు) పర్యంతము వ్యాపించు వాక్కు గదా ఆరు భాగములై వాక్ + షట్కారము = వషట్కార మయినది. అది 33 స్తోమాత్మకము దాని యుద్గీథరూప హృదయమగు సప్తదశ స్తోమము (సప్తదశ) ప్రజాపతి. వషట్కారము వాగగ్నివితాన రూపముగదా! వితాన మింద్రధర్మము కనుక దానినే యింద్రుడని కొందరందురు. కానిండు, ఇట్లు 33 యజ్ఞియ దేవతలందురు. మొత్తముపై నీవిధముగ 'అగ్ని సర్వదేవతలు' అని సిద్ధమయినను, సోమాహుతివలననే అగ్ని రూప సిద్ధియుగనుక "సోమః సర్వాదేవతా" అన్నదియు సిద్ధమే యగుచున్నది. "అగ్నీషోమాత్మకం జగత్" ఇది అగ్నీషోమవ్యాఖ్య.

## పంచాక్షర వివర్తములగు

## వేద - యజ్ఞ - ప్రజా - లోక - ధర్మములు

పైన జెప్పబడిన పంచాక్షరులందు (1) బ్రహ్మ వేదమయుడు, (2) విష్ణువు యజ్ఞమయుడు, (3) ఇంద్రుడు ప్రజామయుడు, (4) అగ్ని లోకమయుడు, (5) సోముడు ధర్మమయుడు. ప్రతి వ్యక్తియు నీ వేద - యజ్ఞ - ప్రజా - లోక - ధర్మముల - మొత్తపు రూపముగా దోచును. ఇందు :-

(1) వేదములు :-

(1) ఋక్కు, (2) సామ, (3) యజుస్సు, (4) అథర్వా యని నాల్గు వేదములు. (1) అగ్నిమయమగు పిండహృదయము నుండి ప్రవర్తిల్లునదియు, 21వ స్తోమాంతము వరకు పిండ విస్రంసన లక్షణము గల వితానముచే విస్తరిల్లునన్నాదాగ్ని సముచ్చితవాక్కే ఋక్కు యొక్క రూపము. ఏలయన:- ఋక్కన మూర్తి, మూర్తి యన్నది పిండమే. పిండ మనగా నన్నాదాగ్నిమయమే కదా? కనుక ఋక్కు నకగ్ని ప్రభవము (మూలకారణము) (2) ఆదిత్యనుండి తిరిగివచ్చు నట్టియు, బ్రహ్మయందు సోమాహుతి

నాహూయమానము గావించునట్టియు, ప్రాణాగ్ని సముచ్ఛితవాక్కే సామరూపము. సామము యొక్క యేడవ అవయవము నిధనము. దాని స్థానము ఋక్కును దాటియుండును కనుక నది 'ఉదృచ' ము. అంతటితో పిండోచ్ఛిత్తియై అన్నాదాగ్ని సోమోప సంహార మగునుగదా! కనుక సామమున కాదిత్యుడు ప్రభవము. ఏమి? సామము తేజోలక్షణము కలది. తేజస్సు విరళాతిసూక్ష్మావయత్వముచే నంతఃప్రవేశి యగును. కనుక ప్రాణాగ్ని మయము గదా! అందుచే సామమున కాదిత్యుడే రూపము. ఏలయన:- ప్రాణాగ్నితో గూడినవాగగ్నియే ఆదిత్యరూపమున వెలసెగదా! ప్రాణాగ్ని వాగాగ్ని యోగముకదా ఆదిత్యరూపముం గల్గించునది? (3) పై జెప్పబడిన ఋక్సామముల యంతరమందు చర-స్థిర భేదమున, రెండుగా విభక్తమయిన వాక్కే యజుస్సు. అందు గతిగల చరభావము 'యత్' అనువాయువు, స్థితిగల స్థిరభావము 'జూ' అను నాకాశము. వాయ్వాకాశములు పరస్పరము సంధిల్లువాక్కు 'యజ్జూ' కాదగ్గదిపరోక్షముగా 'యజు' స్సందురు. వాయ్వాకాశరూపమగు నీ యజస్సు నుండియే సర్వయజ్ఞములు - సర్వ ప్రజలు - సర్వలోకములు - సర్వధర్మములు కల్గుచున్నవి.

శాంత (ఆకాశ) క్షుబ్ధ (వాయు) భేదముంబట్టి రెండుగా విభక్తమయిన యజుర్వేదమే యజ్ఞ - ప్రజా - లోక - ధర్మములకు ప్రభవ - ప్రతిష్ఠా - పరాయణము. అగ్ని వాయ్వాదిత్య రూపములగు మూడు వేదములు నగ్నిమయము లనియే యందురు. ఈ మూటికి సమాన ధర్మత అగ్నిమయము లగుటయే. కనుకనే సోమమయమగు నథర్వవేదముకంటే త్రయీ వేదము వేరనుకొందురు. 21వ స్తోమమునకు బైని 33వ స్తోమము వరకు గల సోమమయవాక్కే అథర్వవేదమని గోపథమన్నది. ఈ నాల్గువేదములు వాఙ్మయములు బ్రహ్మరూపము. ప్రతి యొక వ్యక్తియు నీ నాల్గువేదముల వలననే ప్రతిష్ఠనొందుచు, 'అస్తి' అనిపించుకొనుచున్నది. కనుకనే వేదమునందు :- "బ్రహ్మాస్య సర్వస్య ప్రతిష్టా" "సర్వాణీమాని భూతాని త్రయ్యాంవావ విద్యాయాం ప్రతిష్ఠితాని" బ్రహ్మ యీ సర్వమునకు బ్రతిష్ఠ. సర్వభూతములును త్రయీ విద్యయందు బ్రతిష్ఠితములని వాకొనబడినది.

(2) యజ్ఞము :-

ఈ వేదములచే యజ్ఞస్వరూపము సంపన్నమగును. అందు బ్రహ్మకు (1) ఉక్థము (2) అర్క (3) అశితియని త్రివిధత్వము కల్గును. (1) ఇందుక్థమన్నది వాఙ్మయబ్రహ్మకు హృద్గ్రంథిమయ రూపవిశేషము. ఇచ్చోటనుండియే అర్కలు బయలు దేరును కనుక నిది యుక్థము. (2) అటనుండి యన్నముదిను కొరకు సాగునట్టి జ్వాలయే అర్కనాబడును. అది యన్నాద ప్రాణము, అన్నముం గూర్చి ప్రవర్తింపుచు నాయా యెడల నుండి తన యన్నమును బలాత్కారముగ బరిగ్రహించి ఆత్మం జేరి శాంతమగుచున్నది. (3) అశితియన్నదన్నము. అన్న మర్క ప్రాణముం జేరి యుండి 'ఊర్క్' గానగును. ఊర్కన్నది రసము. అది పిదప (మరల) నర్కగనై స్వరూప భ్రంశమొందును. ప్రాణముక్థమందు లీనమగును. ఆ యీక్రమమంతట ననువర్తిల్లుచున్నది. అన్నము - ఊర్క్ - ప్రాణము అను వీని యన్యోన్య పరిగ్రహము యజ్ఞమని వాజసనేయ బ్రాహ్మణమందు కలదు. ఇట్లు బ్రహ్మయందు జరుగు యజ్ఞమును విష్ణువందురు. ఈ యజ్ఞమయ విష్ణువే యున్న యన్నిటికిని జీవనరూపమగు స్థితియగును. ఈ యాత్మయజ్ఞమున్నంత వరకే పురుషుడు జీవించియుండును. యజ్ఞవినాశము సర్వనాశము. ఆ యీ యజ్ఞ మన్నాదప్రాణము.

(3) ప్రజలు :-

బ్రహ్మ యందగు యజ్ఞవశమున నుత్పతిల్లు, యజుర్వేద వికారభూతములగు నెల్లయర్థములును ప్రజలందురు (1) బీజములు (2) దేవతలు (3) భూతములు నని యా ప్రజలు మూడు తెఱంగులు కలవారు (1) అవిద్య - అస్మిత - రాగ, ద్వేష - అభినివేశము లను పంచక్లేశములు కర్మజన్యములు భోగబీజములు (2) అగ్ని త్రయ - సోమద్వయ రూపవిశేషములగు, అగ్ని - వాయు - ఆదిత్య - చంద్ర - వరుణులను వారు పంచదేవతలు. (3) ఆకాశ - వాయు - తేజో - జల పృథువులన్నవి పంచభూతములు. (1) పంచబీజమయము కారణశరీరము (2) పంచదేవమయము సూక్ష్మ శరీరము (3) పంచ భూతమయము స్థూల శరీరము. ఈ విధముగా నీ మొత్తము పదునైదు కళలు

ఆత్మయు నింద్రుడు నగు షోడశినంతతట నావరించి యుండును. ఆ యివి యింద్రుని ప్రజలు. ఈ ప్రజలు నిర్మించిన భోగాయతనమగు శరీరమందంతతట వ్యాపించి, యింద్రుడు తన యింద్రియములచే నెల్ల భోగముల ననుభవించుచున్నాడు. ఇట్లా యీ యింద్రుడు ప్రజామయుడు.

(4) లోకములు :-

పై జెప్పబడిన ప్రజ లేభావము నొంది యేకమై అపూర్వములగు నేయే నామరూప కర్మలతో దయారై యగపడుచున్నారో అయ్యది వారికి లోకమని చెప్పబడుచుండును అట్టి లోకమన్నది: (1) సప్తభువనరూపము (2) త్రిభువనరూపము, (3) జనరూపము నని మూడు విధములు. (1) భూః - భువః సువః - మహః - జనః - తపః - సత్యం. అన్నవి సప్తభువనములు. (2) పృధివి - అంతరిక్షము - ద్యౌ అన్నవి త్రిభువనములు (3) మనస్సు - ప్రాణము - వాక్కు - వాయువు - తేజము - ఆపస్సు - అన్నమునని సంచరక్రమముననను, అన్నము - ఆపస్సు - తేజము - వాయువు - వాక్కు - ప్రాణము - మనస్సు నని ప్రతిసంచర క్రమముననను ఏడు జనములు లోకములుగా భావింపవలయును. ఎల్లభూతములును వీనియందేదో యొకభావమందగపడు చుండును. మరియు :-

(1) జీవలోకము (2) పితృలోకము (3) దేవలోకమునని మూడు లోకములందురు. (1) ఈ పృధివి జీవలోకము (2) సూర్యుడు దేవలోకము (3) చంద్రుడు పితృలోకము. వీని యందేదో యొకచో నాత్మ యుండుచుండును గాని మఱొక చోటికిబోదు, ఉండదు. ఇక:- రాత్రి మన కగపడు వెన్నెల పగలు చంద్రుడున్నప్పుడు నుండకపోదు కాని యగపడదు. ఏలనన, సూర్యజ్యోతియందది, యేవిశేషముగాని కల్గింపజాలదు. శుక్ల కృష్ణ పక్షములందు సూర్యజ్యోతి యే విషయమును లేకుండనే యగపడుచున్నది కదా! కనుక వెన్నెల సూర్య జ్యోతిచే పరాభూతినొంది యా సూర్యజ్యోతి రూపముననే పరివర్తన మొంది పోవుచున్నది. ఇట్లే లోకాంతరీభావము లుపచరించుచున్నవి. అనగా

నొకలోకమందొక లోక మంతర్భావము నొందుచుండునని తెలియనగును. మఱియు, "ఆగ్నేర్ధూమఏవదివాదృశ్యతేనార్చిః - అర్చి రేవ నుక్తం దృశ్యతేన ధూమ" (పగలు అగ్ని యొక్క ధూమమేగాని మంట యగపడదు రాత్రులందు మంటయేగాని ధూమ మగపడదు.) ఆ యీ భావముల యవస్థా పరిణామము ఒక లోకమునుండి మరొక లోకగమనముగ నొప్పును. తదీయావస్థయు నట్లే పొడకట్టు చున్నదికదా!

ఆపస్సులచే నీలోకములెల్ల వేర్వేరు నామరూపములు కలవిగా జనించుచున్నవి. ఆ లోకములందంతటనుపస్థితమైయున్న యగ్నినే వేర్వేరుగ జూచుచున్నాము కనుక అది (అగ్ని) పశువు. లోకావస్థాన భేదముంబట్టి యీ పాశుకాగ్నికే భిన్న భిన్నావస్థలగపడుచున్నవి కనుక నగ్ని లోకమయుడని వ్యాఖ్యాతము.

(5) ధర్మములు :-

పై జెప్పబడినవే కాక, ప్రజలందు లోకములందు నెన్ని వీర్యములగపడుచున్నవో, యే వీర్యములచే వాని యింద్రియ గ్రాహ్యత యొప్పుచున్నదో, ఆ సర్వధర్మములు ప్రజారూపములు. ధర్మ భేదముంబట్టి భావము నాల్గువిధములుగ అనగా, దివ్య భావము - వీరభావము - పశుభావము - మృత భావము నని యొప్పుచున్నదిగదా! ఈ నాల్గు భావములనుత్పాదించు <u>ప్రాణవిశేషములే వీర్యములు.</u> అవి (1) బ్రహ్మ, (2) క్షత్రము, (3) విట్ (4) శూద్రభేదముచే నాల్గువిధములు.

(1) శాంతి లక్షణ దివ్యభావముం గూర్చునది బ్రహ్మ (2) ఉత్సాహలక్షణ వీరభావము క్షత్రము. ఈ సత్వ మధ్యాత్మగౌరవము పూర్ణముగ గలది కనుక శరణ్యముగ నొప్పును. ఆశ్రితుల నాపదనుండి రక్షించును. (3) ఆత్మ గౌరవ హీనమైన శాంతిగల్గి ఆపదలందు దన్ను దాను రక్షించుకోజాలక పరాత్మ నాశ్రయించు పశుభావము విడ్వీర్యము (4) సర్వవీర్య స్తంభన లక్షణము - సర్వవీర్యానుద్బోధ లక్షణముగలది మృతవీర్యము పై మూడు వీర్యములచే సత్త్వము ధృతిమంతమగును. మృత వీర్యమగు సత్త్వము ధృతిభ్రంశ

మొందును. భయకాతరత్వమున నత్యంత సామాన్యవీర్యమునకు నుద్వేగమందును. ఆశు = వెంటనే, ద్రవతి = పరుగిడును కనుక శూద్రము. క్షుద్రవీర్యప్రాణి శూద్రుడు. మఱియు, గొందరీ క్రింది విధముగ నీ విషయమున జెప్పుదురు:-

(1) జ్ఞాన క్రియార్థములు ప్రసన్నరూపమున నొప్పి యుండు శాంతరూపము బ్రహ్మ వీర్యము (2) జ్ఞాన క్రియార్థములు విక్లిష్టములు - రూపము పరిక్షుబ్ధము - పర ప్రత్యాక్రమణ స్వభావము గలది - నిగ్రహానుగ్రహములచే పరులను లోబర్చుకొనునది క్షత్రవీర్యము. (3) శాంతము - సమృద్ధమునగు రూపము, జ్ఞాన క్రియార్థ, లవరోహణక్రమముం బ్రవేశించునట్లు తోచునది విడ్వీర్యము. ఈ మూడు వీర్యములు నగ్ని వాయ్వాదిత్యులను నగ్ని విశేషములచే కృతఛందస్కములు (ఛందో ఛందితములు) అగుచున్నవి. అందువలన నవి కట్టు బాటులు - మర్యాదలు గలవి - చక్కగా దయారైనవియునై భ్రంశము నొందక, పతనముగాక యుండును. కట్టుబాటు - మర్యాదలేక (ఛందస్సు లేక) యీ మూడు వీర్యములును సామాన్య హేతువులవల్లనే భ్రంశములై, ఉండియు దౌర్బల్య వశమున విశేషించి కార్యకారులు కాజాలకున్నచో నది శూద్ర వీర్యమగును. ఏది :- శు= అశు = వెంటనే, ఉత్=అధికముగా, ద్ర = ద్రవించునో, నిద్రించునో, అది శూద్రవీర్యము అనగా, శీఘ్రముగ - నధికముగ ద్రవించునది - పరుగిడునది - భయ విహ్వల మగునది - నిద్రించునది - సోమరితనమున నకర్మణ్యభావము నొందునది. వీర్యత్రయ ముల్బణముగా నెందగ పడకుండు, నది శౌద్రవీర్యము.

ఈ నాల్గు వీర్యములే నాల్గు ధర్మములు. ఈ నాల్గు ధర్మములచే పరివ్యాప్తమగు నీ సర్వమును వేర్వేరుగ విశేషించు చున్నది. దీని కన్యమంతయు భోగ్యమో భోక్తయో యగుచుండును.

ఇట్లు సర్వజగత్స్వరూప నిర్వాహకములగు వేదయజ్ఞ ప్రజాలోక ధర్మములను నీ పంచభావములే క్రమముగా, బ్రహ్మ - విష్ణు - ఇంద్ర - అగ్ని - సోములను పంచ దేవతలు; పంచాక్షర పురుషులను పేర బరగుచున్నారు.

## అవ్యయ పురుష నిరుక్తి

క్షరపురుషుడు పరిణామ కారణము, అక్షర పురుషుడు నిమిత్త కారణము, వారికన్యుడుగ నుండు నవ్యయుడు కార్యమును, కారణమును గూడ గాదనియు, మొదట ననుకొంటిమి. ఒక విథముగ నది యట్లే కాని, మరొకవిథముగా జూచునపుడతడే సర్వకారణుండనదగి యుండును. భగవద్గీతయందును సర్వజగత్కారణత్వ మవ్యయునకే ప్రతిపాదింపబడినది. అయితే:-

కారణత్వమన్నది (1) కార్యోపధాయకతా లక్షణము (కార్యనిర్మితి కావించునది) (2) స్వరూప సద్యోగ్యతా లక్షణ మనియు (స్వరూపపుటునికి కిదగినది) యని రెండు విథములు, కాగా, మొదటి కారణత్వము సమవాయి కారణత్వముగల క్షరునకును, నిమిత్త కారణత్వముగల యక్షరునకు నుండ వచ్చును. ఇక, స్వరూప సద్యోగ్యతా లక్షణముగల రెండవ కారణత్వ మన్ననో, అవ్యయునకును తప్పనిదే. ఎట్లన:- చూచుటయను పనియందు కారణము కన్నే కాని సూర్యుడు - దీపము మొదలగునవి కావు. కాని, అవి లేక, వాని ప్రకాశముతో సంబంధము లేనపుడు కంటికి దృష్టి కార్యోపథాయకత్వము చెల్లునా? కనుక ప్రకాశహేతువులగు సూర్య దీపాదికము, వానియంతనవి యుండియే కంటి పనియందు నిర్వ్యాపార కారణమగును. ఇక :- సూర్యదీపాదికము, కంటికి సహకారి కారణమనుకొనువారును, సామగ్రికి కారణత్వముంజెప్పి - కారణత్వమునకు వ్యాసజ్యవృత్తిత్వముం జెప్పువారును గూడ, సామగ్రీఘటకములగు ననేక ద్రవ్యములందు, కారణతం గూర్చు విలక్షణ కారణత్వమును జెప్పునట్లే యిచ్చట నవ్యయు నందును కారణత్వ ముపపన్నమే యనవచ్చును. మఱియు, "తత్తు సమన్వయాత్" అను బ్రహ్మ సూత్రమం దభియుక్తులు సమన్వయ లక్షణముగల కారణత్వముం జెప్పిరిగదా, ఏలయన స్పష్టమే, ప్రకాశ సమన్వితమగు కంటికివలె, అవ్యయ సమన్వితుడగునక్షరపురుషునకే కార్యమును బుట్టించుట యందంతటను సామర్థ్యము లభించును గదా! కనుక, అకారణుడైనను నవ్యయుడు సామాన్యముగా కారణుడే యనవలయును, మఱి :-

స్థితి యిట్లున్నను (అవ్యయునకు గారణత్వమున్నను,) అతనికి విక్రియమాణత్వము (వికార మొందుట) లేదు కనుక, పరిణామ్యుపాదానత్వము ప్రతిషేధింపబడుచున్నది. భగవంతుడు దీనింబట్టియే, "కర్తారమపిమాం విద్ధ్యకర్తారమవ్యయం" అని యెను. కనుకనే "నతస్యకార్యం కరణంచ విద్యతే" అను మొదలుగ కారణత్వమును నిషేధించు శ్రుతియు సంగతమగు చున్నదని యెరుంగనగును.

ఈ యవ్యయ పురుషుడు పరాత్పరుని రూపాంతరమగుటచే తదభిన్నుడని జ్ఞప్తి యుంచుకొనవలెయును. ఇక విశేష మేమన :- సర్వబల విశిష్టరసము పరాత్పరుడందురు. అందు బలము లనంతములయినను, వానిలో నితర బలము లన్నిటికంటె నెంతో విశాలమయి మాయ యన్నదొక బలము. దానిచే పరిచ్ఛిన్నమయిన రసము తక్కిన రసము కంటె వేరుగా భావితమై అవ్యయ పురుష నామము నొందును. అమితమును, మితత్వము నొందించునది మాయ. రసము సర్వబల విశిష్టమో బలోపహితమో యగునపుడు దిగ్దేశ కాలాదులచే ననవచ్ఛిన్నము కనుక నమితమనుకొందుము కాని, బలావచ్ఛిన్నత్వము నొందుచో పరిమితత్వ మొందును. అమితి నొందిన మాయా బలమునందితరములగు నెల్లబలములు నుప్పతిల్లును, ఉండును, లయించును. కనుక, అవ్యయుడును పరాత్పరాభిన్నుడు, సర్వ బల విశిష్టుడు, సర్వ ధర్మోపపన్నుడు నని యెరుంగవలయును అందువలననే అవ్యయుని వ్యాఖ్యానించునెడ గూడ నుపనిషత్తులందు సర్వధర్మా - సర్వ కర్మా - సర్వరస - సర్వ గుణ అను మొదలగు పదములగపడును.

<u>అవ్యయ పంచధాతుకత్వము</u>

ఆ యవ్యయుడైదు కళలు కలవాడని తెలియుచున్నది. ఎట్లన, అవ్యయమునందు; అంతశ్చితి - బహిశ్చితి యని, రెండు విధములుగ బలముల చితి యేర్పడును. మాయాబల పరిచ్ఛినత వలన దాని హృదయమందనేక బలములు పరస్పరబంధనముచే గ్రంధీ భావము నొందుట 'చితి'. అందీబలములు రెండు విధములు.

(1) ఒక బల గ్రంధిపై మరియొక బలగ్రంధి, దానిపై వేరొక బలగ్రంధి యిట్లు సృష్టి లక్షణముగల, అవిద్యాబలము లొక తెగలోనివి. (2) అనేక గ్రంథులందు కొన్ని హృద్గంధులను విప్పి వేయుటకు దగిన విద్యాబలము లొక తెగలోనివి. ఇందు; అవిద్యాబలముల సంచయము బహిశ్చితి విద్యాబల సంచయ మంతశ్చితి. ఎచట నీ బలమంతరమందో బాహ్యమందో చితి భావము నొందుచుండునో, అచ్చోటు 'అవ్యయమన' స్సందురు.

"మనోవా ఏతద్యదపరిమితమ్ ప్రజా పతిర్వై మనః" అను కాషీతకీ శ్రుతి యీ మనస్సునకు బ్రాధాన్యము చెప్పినది. ఆమనస్సునం దంతశ్చితిచే విద్య నావరించు నవిద్యయు చ్ఛేదము కాగా, ఆత్మ జ్యోతి యుదయింప ననువగు 'విజ్ఞాన' మనబడు రూపము వెలయును, దానికంటె నంతశ్చితిచే నా యశేషావరణ బలమును చ్ఛేదము కాగా, నది రసమాత్ర ప్రాధాన్యమున, 'ఆనంద' మను రూపము నొందును. ఇట్లే :-

మనస్సునందు బలములయొక్క బాహ్యచయనము వలన, నాత్మజ్యోతి యావరణము నొందగా, వీర్య లక్షణము గల 'ప్రాణ' మను రూపము వెలయును. దానికంటె బాహ్య బలచితిచే అర్థలక్షణముగల 'వాక్కు' అను రూపము కల్గును. బాహ్య చయనమువలన బలముల కుత్తరోత్తర గ్రంధులు కలుగగా, స్థూల - స్థూల రూపములు కల్గును. మనస్సుకంటె ప్రాణము, దానికంటె వాక్కును స్థూలములు. ఇక నంతశ్చితి యందన్ననో, వ్యవచ్ఛేదక బలగ్రంధు లుద్భిన్నములు కాగా, సంసర్జక (సృష్టి) బలముల యద్భేదము లక్షణముగా గల యద్బంధనము (విముక్తి) కలుగును కనుక క్రమముగా బలములుచ్ఛేదన మొందుట వలన రస రూపము వికసిల్లును. అందు, మొదటిదగు రసవికాసము విజ్ఞానము. దానికంటె నధికరస వికాస మానంద రూపము. కనుక, మనస్సుకంటె విజ్ఞానము, దానికంటె నానందము సూక్ష్మములు. బలములు తగ్గుకొలది సూక్ష్మతయు, బలములు పెరుగుకొలది స్థూలతయు వృద్ధి గాంచును. ఇట్లు,

స్థూల సూక్ష్మభేదముంబట్టి యీ యవ్యయునందు, (1) ఆనందము (2) విజ్ఞానము (3) మనస్సు (4) ప్రాణము (5) వాక్కు అని యైదు రూపము లేర్పడును. ఇందు, ఆనందము అన్నిటికంటె నధిక సూక్ష్మము. బలము లత్యంతము తగ్గియుండుటచే నది రస ప్రధానము. వాక్కన్నది, అధిక బలవృద్ధికలది కనుక స్థూలాతిస్థూలము, బలప్రధానత కలది కనుక, రసరూప మావరింపబడగా నిరానందమగును. ఇక మనస్సు అతి సూక్ష్మము, అతి స్థూలముగాని మధ్యమ రూపముగలది, జ్ఞానకర్మలు రెండును లక్షణముగా గలది, ఇచ్ఛామయుమునగుచున్నది. ఇట్లానందము మొదలు వాక్కు వరకు గల విభాగభేదముంబట్టి యైదు ధాతువులుగల యవ్యయ పురుషుడు సిద్ధించుచున్నాడు ఇతడు :-

## సృష్టి సాక్షి - ముక్తి సాక్షి

యెట్లన :- ఇతని కడపటి ధాతువులగు ప్రాణ - వాక్కులతో గూడినమనస్సు సంసార హేతువగును. కాగా, జగమునుత్పాదించుటయందు, విజ్ఞానందములు సహకారులగును. అట్లు, విజ్ఞానందముల సహకారముగల మనస్సు వాక్కునందు భిన్న భిన్న విధములుగా ప్రాణములంగూర్చి - (సన్నివేశ మొందించి) నానావిధ భావముల నుత్పాదించును. ఇక :-ః

విజ్ఞానానందములతో గూడిన మనస్సు నిస్తార (ముక్తి) హేతువగును. అపుడు, అనగా, జగన్మోక్షసాధన మందు, హృద్గ్రంధి మోక్షణ, బలోద్బంధనములచే నానంద విజ్ఞానములతో ప్రాణ వాక్కులు సహకరించును. ప్రాణవాక్కుల సహకారము లేకుండ నేయాత్మకును మోక్షము సంపన్నము కాదు. ఈవిధముగ, ప్రాణవాక్కులతో సంసారమునకును, ఆనంద విజ్ఞానములతో నిస్తారమునకు నొక మనస్సే ప్రయోజకమగును. కనుకనే అభియుక్తులు,

"నదేహోనచజీవాత్మా నేంద్రియాణిపరంతప
మనఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః"

అన్నారు. ఈవిధముగ ఆనంద - విజ్ఞాన - మనః - ప్రాణ - వాక్కులను, నైదుధాతువులు గల అవ్యయుడు సంసారమునకు నిస్తారమునకు, ముఖ్యహేతువని యెరుంగవలయును. ఇక అధికరణ భేదముంబట్టి (1) అధిదైవతము, అధ్యాత్మము - ఆది భూతము నని యీయవ్యయుని మూడు తెఱగుల నరయదగును, అందు,

## అధిదైవత నిరుక్తి

అధిదైవతమీశ్వర శరీరము. అందు మహా బ్రహ్మాండమందలి వికార సంఘము లోపల మూవురు పురుషులు నానా బ్రహ్మాండభావములన్నిటి నొకేయొక మారుగ సంచాలన సేయుచున్నారు. ఆ యీశ్వర శరీరమందు ప్రవర్తిల్లు నీయవ్యయ పురుషుడు తన మాయాబలముచే, మహా విశాలమగు నెంత ప్రదేశమున నభివ్యాప్తి నొందునో, అదియతనికి విశ్వరూపమను మండలము, అంతవరకే యిది యీశ్వర శరీరమగును. ఆ యీశ్వర శరీర హృదయబిందువందు పంచధాతువులుగల యీ యవ్యయ పురుషుండుండును. అతని రశ్మలు మహా బ్రహ్మాండ భూమి యంతటను వ్యాపించుచు హృదయ బద్ధములై సంచరించును. ఆ యీ యవ్యయుడు పరోరజా, మహేశ్వరుడునను ప్రథమ ప్రజాపతి.

### ప్రాణమయ స్వయంభూ (బ్రహ్మ)

ఆ పరోరజావ్యయుని యాశ్రయమున బంచాక్షరపురుషులును నానాశాఖలను వేర్వేరుగ నవలంబింతురు. అందు మొదట మహా విశాల మాయాబల మండల నాభి (కేంద్రము) యందుండునట్టియు, ఆనంద విజ్ఞాన సత్తామయ రశ్మల నంతటను సంచరింప జేయునట్టియు, అనిరుక్త ప్రజాపతి రూపుడును, పరోరజసుడు నగు నాయవ్యయుని నలువైపుల బరిక్రమించుచు అనిరుక్త ప్రజాపతి రూపమున వాఙ్మయ మండల నాభియందుండి మనఃప్రాణ వాఙ్మయ రశ్మలను, అంతటను సంచరింప జేయుచు, బ్రహ్మాక్షర పురుషుడు ఋక్సామ యజుర్భేద భిన్నమగు త్రయీవిద్య నఖిల బ్రహ్మాండమందు నల్గడలను సంచారణ మొనర్చుచున్నాడు.

“బ్రహ్మజ్యేష్ఠా వీర్యాసంభృతాని, బ్రహ్మాగ్రే జ్యేష్ఠందివ మాతతాన, ఋతస్య బ్రహ్మా ప్రధమోతజజ్ఞే తేనార్హతి బ్రహ్మణా స్పర్ధితుంకః” వీర్యములు బ్రహ్మ జ్యేష్టములుగ సంభృతములైనవి. జ్యేష్ఠద్యులోకమును మొదట బ్రహ్మ విస్తరించెను. ఋతమునకు మొదట బ్రహ్మయే కల్గెను. ఆ బ్రహ్మతో నెవడు స్పర్ధ సేయగలవాడు?

“అంతరస్మిన్నిమేలోకాః - అంతర్విశ్వ మిదం జగత్
బ్రహ్మైవ భూతానాం జ్యేష్ఠం - తేనకోఽర్హతి స్పర్ధితుం”

భూతములకు జ్యేష్ఠము బ్రహ్మయే, తదంతరమందే యీ లోకములు. అందే యీ విశ్వజగత్తు. దానితో స్పర్ధ జేయదగువాడెవడు?

“బ్రహ్మణ్ దేవాస్త్రాయ స్త్రింశత్ - బ్రహ్మన్నింద్ర ప్రజాపతి బ్రహ్మణ్హ విశ్వాభూతాని - నావీవాంతః సమాహితాః” ముప్పదిముగ్గురు దేవతలును బ్రహ్మ - ఇంద్ర ప్రజాపతులు బ్రహ్మ విశ్వభూతములు బ్రహ్మ. నావయందువలె లోపల నిమిడియున్నారు. (అధర్వణము)

ఆ యీ యపౌరుషేయ వేదమయ స్వయంభువు ద్వితీయ ప్రజాపతి అతని యా త్రియీవిద్య ప్రతియర్ధ మందును అగ్న్యాదిత్య వాయూపనీతమై (అగ్ని రవి వాయువులచే గొనిరాబడి) ప్రతిష్ఠారూపముగ సంసక్త మగుచుండును. ఆ పిదప ప్రతియర్ధమందును సంసక్తములగు నావేదములు పౌరుషేయములగును. ఏలయన నవి యగ్ని వాయువులచే నిటకు గొనిరాబడినవి గదా! పౌరుషేయ వేదములకు ‘సహస్ర’ మని పేరు. “సహస్రంవా అస్మైతత్ర్పాయచ్ఛత్, ఋచః - సామాని - యజూంషి - యద్వా ఇదం కించతత్ త్రైధాతవ్యా” అని మైత్రాయణీ సంహిత.

ఇంద్ర విష్ణువులీసహస్రము నధిష్ఠింతురు. “తస్మిణ్వా అపదేతాం సేయమస్యా అధ్యర్ధా వాగవదత్”

“ఉభాజిగ్యధుః నపరాజయేధేన పరాజిగ్యేకతరశ్చ నైకోః ఇంద్రశ్చ విష్ణో యదపస్పృధేథాం త్రేధా సహస్రం వితదైరయేథాం”

సహస్ర నిర్మాత లింద్రవిష్ణువు లిరువురును పరస్పర స్పర్ధ యందెవ్వరును జయింపరోడిపోవరు. సహస్రమును మూడు విధములు గావింతురు. ఆ యీ యింద్ర విష్ణులు బ్రహ్మనాలంబముగా గొనియుందురు. యీ స్వయంభూ బ్రహ్మత్రయీ వేదమయుడు. (1) వేదములు సత్యము (2) నియంతయగు నంతర్యామి సత్యము (3) సూత్రాత్మ సత్యము అను నీ మూడు సత్యములును ఈ స్వయంభూ బ్రహ్మకు మూడు ధాతువులని తెలియనగును. వీని మనోతలనియునందురు. ఇక :-

ఒక యీశ్వర శరీరమందు నానాబ్రహ్మ లందందుండుచుందురు. ఆయా యొకొక బ్రహ్మను విష్ణు ప్రభృతులక్షరులు క్రమముగా నాలంబముగా గొనుచుందురు. ఇట్లు ఈశ్వరశరీర మందాయా యొకొక బ్రహ్మచే నారబ్ధములగు పంచాక్షర పుండీరములు (ఉపశాఖలు) గల పెక్కు బల్శ (శాఖ) లుండును. ఇందేశాఖయందు మన పృథివి యున్నదో ఆ శాఖం బ్రవర్తింపజేయు బ్రహ్మ నాథారముగా గొని ముందు గ్రంథమును నిరూపించుకొందము.

## ఆపోమయ పరమేష్ఠీ - (విష్ణువు)

పై జెప్పబడిన వాఙ్మయ స్వయంభూ బ్రహ్మను, నల్గడలను ఆపోమయ పరమేష్ఠీ ప్రజాపతి పరిక్రమించును. అతడితనికి పరిప్రార్థ దేవుడు. అతనికివలె నితినికిని (1) ఇడా (2) గౌ (3) ఊర్క్ అని మూడు ధాతువులున్నవి. అతడు త్రయీ వేదమయుడయి నట్లితడు అధర్వ వేదమయుడు. త్రయీవేదమన్న దగ్ని వేదము, ఈ యధర్వ వేదమన్నది సోమవేదము, అని భేదము.

"షడ్భవైబ్రహ్మణద్వారః అగ్ని వాయు రాపశ్చంద్రమా విద్యు దాతిత్యః" అని శతపథము. ఇందు (1) అగ్ని - వాయు - రాదిత్యులన్నవి అంగిరసులు (2) వాయుః - అపః - చంద్రమా - అన్నవి భృగువులు. విద్యుత్తన్నది అత్రి. భృగ్వంగిరోఽత్రిమయ మధర్వవేదము (1) ఋతము (2) సత్యము నను పేరులుగల మూలతత్వముల విజ్ఞానము

వేదము (1) కేంద్రము లేక నిరాయతనమై యశరీరమగునర్థము ఋతము. (2) నాభి (కేంద్రము) ప్రధి (అంచు) అను వానిచే నొక సంస్థగనై నాయతనముగ నుండు నర్థము సత్యము. ఆ రెంటను భృగువులుప్రక్రమించునంత వరకు ఋతము. అంగిరసుల ప్రక్రమణముండునంత వరకు సత్యము. ఋతము సత్యమందు. సత్యము ఋతమందు. సత్యమున కంతరమందు ఋతము, బాహ్యమందును, నలువైపుల నంతట నీఋతవ్యాప్తి యుండునని వినుచున్నాము :-

"ఋతమేవ పరమేష్ఠి ఋతం నాత్యేతి కించస
ఋతే సముద్ర ఆహితః ఋతేభూమి రియంశ్రితా" (తై౹౹బ్రా)

"అగ్నిర్వాఋతం - అసావాదిత్యః సత్యం" అను శ్రుతి యందు, అగ్నిగాని, ఆదిత్యుడుగాని ప్రవర్గ్యావస్థయందు (ఎందేని విడువడిన దన యంశప్రవర్గ్యము) ఋతమందురు. సరియే,

భృగ్వంగిరోమయుడను నా యీ పరమేష్ఠిని మొదట నా పోమయ వరుణుడును, అతని మొదట భృగువు - పిదప అంగిరుడు. ఆ పిదప అత్రి తరువాత విద్యుత్తు అనుననవి యుత్తరోత్తర క్రమమున, చుట్టును బరిక్రమించును. వారీ పరమేష్ఠికి పరిప్రార్థదేవులు.

ఆపః - వాయుః - సోమః అన్నవి భృగుప్రాణములు, స్నిగ్ధములు - సంసృష్టి హేతువులు. అవి విరళ పదార్థములను సంసర్జనము (కూడిక) చేసి ముద్దగా జేయుటవలన పిండముం బుట్టించును. ఇందు,

ఆపస్సులు పరమేష్ఠి యందురు. అవి (1) అంభః (2) మరీచిః (3) మరః (4) శ్రద్ధా యని నాల్గు విధములు. (1) సూర్యునకు బైవి అంభస్సులు (2) సూర్య కిరణములందలివి మరీచులు (3) పృథివీ రూపమున బరిణమిల్లునవి మరములు (4) చంద్రరశ్మలందలివి శ్రద్ధా. ఇవి మౌలికములు, నిత్యములు అమృతములు నగు నాపస్సులు. మనము త్రాగుచున్న నీళ్ళు యౌగికము, యాజ్ఞికము, మర్త్యములు. ఇక,

వాయువు :- (1) వాయువు (2) మాతరిశ్వా (3) పవమానము (4) సవిత యని నాల్గు విధములు. అపస్సులే యీ నాల్గు విధముల వాయు రూపముగ వికారము నొందగా, ఆయాపస్సు లందు వికృతినొందకుండు నొకానొక స్వల్పభావము భృగు వనియు అర్వాక్ (పిదప) మిగిలియుండునది అథ+అర్వాక్ = అథర్వా ప్రాణమనియు నథర్వ వేదమందు జెప్పబడినది. ఇదే సోమములకు వాయువులకు అపస్సులకును అలంబనమగును. కనుక యీ మూడును అథర్వణములనియే చెప్పుదురు. కాగా సోమమన్నది శ్రద్ధామయము, బ్రహ్మణస్పతియను పేరుగలది, అత్యంత పవిత్రతమము, మనస్సునకు జనకము, నగు మూల పదార్థము. ఇవి భృగుతత్వములు. మఱి.

(1) అగ్ని - (2) యమ - (3) అదిత్యయని మూడు తెఱగులయిన అంగిరస ప్రాణములు తేజస్సులు. తేజమన్నది స్నేహమునకు బ్రతిబంధకమగు ధర్మము. ఈ ప్రాణములు ఘన పదార్థముల యవయవ సంయోగమును విడగొట్టి విరళములుగ జేసివైచును. ఇందు :-

(1) అగ్ని యన్నది విశకలన హేతువగు ప్రాణము. యౌగికములగు నర్థములందు, మూలపదార్థముల యాజ్ఞిక సంయోగమును విడగొట్టును. "ద్వయంవా అగ్నేరూపం నిరుక్తంచానిరుక్తంచ" కౌ॥ (1) నిరుక్తము (2) అనిరుక్తము నని యగ్ని రూపములు రెండు. ఇందొకటి అప్రత్యక్షము కాష్టాదులందలిది రెండవది ప్రత్యక్షమే.

(2) యముడన్నది మృత్యుప్రాణము. ఇది యమృతసోమమున కగ్నియందగు నాహూతిని నిరోధించి యాజ్ఞికయోగ యోగ్యతను నాశమొనర్చును. అగ్నియన్నది సంయుక్తార్థ మందలి సంయోగమును విడగొట్టును. ఈ యముడన్నో విద్యుదగ్నిగ గాబోవు సంయోగమును నిరోధించును.

(3) ఆదిత్యుడన్న ప్రాణము ప్రతి యర్థమందును సంసృష్టమై యున్న సోమము నటనుండి కొనికొని ఆయా ఘనపిండమును స్వరూపతః పరిణామము నొందించును. కనుక నీ మూడు ప్రాణములును మృత్యువు లందురు. ఇక :-

విద్యున్మయమగు నత్రి ప్రాణము, పిండము యొక్క యంతరమందున్నదై పారదర్శకతా భావమును నశింపచేయు చున్నది. జ్యోతిగల పదార్థమునుండి పిండము నాక్రమింపవచ్చు జ్యోతిని పిండము నుండి త్రిప్పివైచి తద్వ్యతిరేకపు వైపునకు, అనగా విపరీత దిక్కునకు ద్రోచివేయుచున్నది. జ్యోతిని పిండములోనికి రాకుండ నిరోధించుచున్నది. అందువలన పిండమున కావలివైపున (వెనుక) నల్లని కాంతి (నీడ) యగపడుచున్నది. కనుకనే, ఆత్రేయుడు చంద్రుడు పరజ్యోతి; ఆత్రేయి రజస్వల.

ఇట్లు మూడైన, భృగ్వంగిరోఽత్రి ప్రాణము లథర్వ జనితములై యథర్వణమందు సమావేశమగుట వలన నీపరమేష్ఠీ ప్రజాపతి అపోమయుడు - వాయుమయుడు - సోమమయుడు నని తెలియనగును. ఇతనిని విష్ణువందురు. ఈ భగవాను నా సోమమయ వరుణుడు పరిక్రమించును. ఆవరుణుని వాయు మయ హంసతోడను, సోమమయ బ్రహ్మణస్పతితోడను, గూడిన భృగువు ప్రథమ స్థానమందును, సవితతో గూడిన బృహస్పతి యంగిరుడు రెండవ స్థానమందును, విద్యుదక్షరుడగు నింద్రుడు సూర్యుడనబడువాడు తృతీయ స్థానమందును పరిక్రమింతురు - భృగువు వారుణియని యందురు. ఇట :-

అథర్వణికులిట్లందురు :- పరమేష్ఠి రేతస్సగు సోమము గర్భమందులయాపస్సు, తీయనిది - ఉప్పనిది యని రెండు విధములయినది. మధురములందు భృజ్యమానమగు రేతస్సు భృగువయ్యెను. మఱి యా వాయువన్నది:-

వాయు, మాతరిశ్వా - పవమాన - వాతభేదముచే నాల్గు విధములుగ వికృతి నొందును. అందవికృతమై యంతర్హితముగ నుండు స్వల్ప మాత్రయగు నొక యంశ 'మథర్వ' యను పేరు గలది. ఆపోమయమగునది పరమేష్ఠి వలె వేరొక బ్రహ్మయయ్యెను. బ్రహ్మత్వముంబట్టి యితనిని బ్రహ్మణస్పత్యాదులు పరిక్రమింతురు. పరమేష్ఠి కితడు ప్రథమ పరిచరుడు. యిక క్షారపరాస్సులగు నా బ్రహ్మ రేతస్సు సోమము నలుగడల నావరించియుండును. ఆపస్సుల యావరణము వలన నది వరుణడయ్యెను. "ఆపాంసముద్రా దముచ్యత" అనుటచే ముచ్యత్వముంబట్టి పరోక్షముగా మృత్యువని చెప్పబడినది. ఆ యీ వరుణుడు పరమేష్ఠికి ద్వితీయ పరిచరుడందుము. (ఇది యాథర్వణికుల మతము)

ఈ విషయమున మరికొందరు "ఈ వరుణుని యంశ రసములనుండి యంగిరసులగు నీ యాదిత్య యమాదులు ప్రాదుర్భవించిరి, కనుక, సూర్యాదిత్యుడా వరుణుని నల్గడ బరిక్రమించును. సూర్యుడు వరుణుం బరిక్రమించుచున్నాడని దేవరాతుడు (వైశ్వామిత్రుడు) "ఉరుంహి రాజా వరుణశ్చ కార సూర్యాయ పంథామన్వేతవాఉ" అను నిత్యాదిగా జెప్పి యుండెను గదా!" యనుచున్నాడు. కానిండు :-

<u>వాఙ్మయుడింద్రుడు - (సూర్యుడు)</u>

సూర్యేంద్రుడు వాఙ్మయుడు, పై వారికి వలె నితనికిని (1) జ్యోతి (2) గౌ (3) ఆయువు నని మూడు ధాతువులు కలవు. ఈ సూర్యుడు మొదటి ద్యులోకము, పరమేష్ఠి రెండవ ద్యులోకము స్వయంభువు మూడవ ద్యులోకము. కొందరు "తృతీయస్యామితో దివి సోమ ఆసీత్" "ఇటనుండి మూడవ ద్యులోకమందు సోమమున్న" దను వచనమునకు బరమేష్ఠియే మూడవ ద్యులోకమను కొనుచున్నారు. అది సూర్య పృథువుల మధ్య నుండు నంతరిక్షముంబట్టి, అంతరిక్షముం గూడ ద్యులోక మనుకొందురు కనుక, దానింబట్టి యనుకొన్నదని సంతోషింపనగును. కానిండు,

సూర్యరశ్మి మండలము మొదటి విశ్వరూపము. పరమేష్ఠి మండలము రెండవది, స్వయంభూ మండలము మూడవది. చూడు డీయాథర్వణ వచనము :-

"యత్పరమ మవమం యచ్చమధ్యమం ప్రజాపతిః ససృజేవిశ్వరూపం కియతాస్కంభః ప్రవివేశతత్ర యన్నప్రానిశత్ కియత్త ద్బభూవ"

<u>అన్నాదమయ పృథివి - (అగ్ని)</u>

ఆ సూర్యేంద్రునల్గడలను అగ్ని పరిక్రమించుచున్నది. అది యంగిరోరూపము. "త్వమగ్నేఽంగిరా ప్రథమః ఋషిః" అని శ్రుతి. అగ్ని - యమ - ఆదిత్యులను నీ మూడు నంగిరస రూపములు. ఈ యంగిరోమయాగ్నియే 'పృథివి' యందురు. వాక్, గౌ, ద్యౌ యన్నవి దీని ధాతువులు.

## అన్నమయ సోముడు (చంద్రుడు)

ఆ యగ్ని రూప పృథివిని సోముడు చుట్టును పరిక్రమించును. ఈతనినే చంద్రుడందురు. "ఏషవై సోమోరాజా దేవానా మన్నం యచ్చంద్రమా" దేవతల కన్నమగు చంద్రుడు 'సోమ రాజు' అని శ్రుతి రేతః - యశః - శ్రద్ధా యని ఇతనికి మూడు ధాతువులు.

## సప్త లోకములు

ఈవిధముగ బరోరజసుడగు నవ్యయు నాశ్రయించి బ్రహ్మాది పంచాక్షరులు నుత్తరోత్తరము పరిక్రమించువారిం బరిక్రమించుచు, క్షరసృష్టి చక్రమంతటిని సంచాలన సేయుచున్నారు. ఇందు :-

(1) స్వయంభూ ప్రజాపతి యొక్క - ప్రాణమయ - లేదా - వాఙ్మయ - లేదా, వేదమయ, రశ్మిమండలముచే క్లప్తమయిన బ్రహ్మాండము 'సత్య' మను నుత్తమలోకము. అందు, తదీయ వాక్కులు (1) మహోక్థ (ఋక్) (2) మహావ్రత (సామ) (3) యజురగ్ని (యజుస్సు) భేదముచే మూడు విధములగుట వలన, ప్రధాన భూతమగు యజుస్సంబంధము వలన ఆ యాండము స్థితిగతులుగల ప్రాణమయ పరమాకాశ మందురు. (2) పరమేష్ఠీ ప్రజాపతి యొక్క అధర్వమయ రశ్మిమండలముచే క్లప్తమయిన బ్రహ్మాండము 'జనత్' అను మధ్యమ లోకము. అందలి లోకులధర్వాణులాపో - వాయు - సోమ భేదము లచే మూడు విధములయ్యు, ప్రధాన భూతములగు, నావస్సుల సంబంధముచే నాయాండము సముద్రమందురు. అది వాయు సముద్రము. ఆపస్సు లందు వాయు రూపమున సంచరించు అందెంత ప్రదేశమునందు సూర్య ప్రకాశము ప్రవేశించి ప్రకాశించునో, అంతవట్టును, 'వేన' నామమున బిల్తురు. దానికి బైనంతయు నిబిడాంథకారము. దానిని మనము చూచుచున్నాము. (ఆకాశ నీలిమ యదే).

(3) సూర్య ప్రజాపతి యొక్క జ్యోతిర్మయ రశ్మి మండలముచే క్లప్తమయిన బ్రహ్మాండము స్వర్గమను ప్రధమలోకము. అందలి లోకులకు దేవతలగు వసురుద్రాదిత్యులని మూడు భేదములయ్యు ప్రధాన భూతాదిత్య సంబంధము వలన నా యాందము తేజోమయము - హిరణ్యమయము నగు వైశ్వ దేవ్యము. ఇవి ప్రథమ - మధ్యమ - ఉత్తమ లోకములు. ఇందు ప్రథమమగు హిరణ్మయ లోకమందు దానికి బైలోకములకు జెందిన ధర్మములన్నియు ననువర్తించు చుండును. శ్రతియు :-

"హిరణ్మయే పరేకోశే విరజం బ్రహ్మనిష్కలం
తచ్ఛుభ్రంజ్యోతిషాం జ్యోతిరాయుర్హోపాసతేఽ మృతం
హిరణ్మయేనపాత్రేణ సత్యస్యాపిహితంముఖం
తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే"

మఱియు, ప్రతి లోకమును మరల మూడువిధములగుటవలన మూడు విధములుగ త్రైలోక్యము సంపన్నమగును. యెట్లన :- (1) మన ముండుచున్న యీ భూమి యొక పృథివి, సూర్యుడు ద్యౌ. ఈ రెంటి మధ్యదగు నంతరిక్షముతో - 'రోదసీ' యను మొదటి త్రిలోకి (2) ఇట్లే సూర్యుడు పృథివి పరమేష్ఠి ద్యౌ. ఈ రెంటి మధ్యదగు నంతరిక్షముతో, 'క్రందసీ' యను రెండవ త్రిలోకి, (3) పరమేష్టి పృథివి. స్వయంభువు ద్యౌ. ఈ రెంటి మధ్యాంతరిక్షముతో 'సంయతీ' యను త్రిలోకి, ఇట్లు మూడు పృధువులు - మూడంతరిక్షములు - మూడు ద్యులోకములు. ఈ క్రింది శృతి వచనములరయుడు:-

(1) నడిమిదగు పరమేష్టి వరుణుని దివస్తుతియందు వసిష్ట భగవానుడు.

"తిశ్రోద్యావః నిహితా అంతరస్మిన్ తిస్రోభూమీరుపరాషడ్విధానా
గృత్యోరాజా వరుణశ్చక్రయేతం - దివిప్రేంఖంహిరణ్మయం శుభేకం"

(2) మధ్యమమగు మిత్రావరుణార్యముల దివస్తుతి; గార్త్సమదకూర్మడు:-

"తిస్రోభూమీర్ధారయన్ స్త్రిరుతద్యూన్ త్రీణివ్రతావిదధే అంతరేషాం
ఋతేనాదిత్యా మహివోమహత్వ్యం తదర్యమన్ వరుణమిత్రచారు"

(3) పరమమగు స్వయంభూ దివస్తుతి: మామతేయౌతథ్యుడు దీర్ఘతముడు

"త్రిస్రోమాతౄఽస్త్రీన్ పితౄన్‌బిభ్రదేక ఊర్ధ్వస్తస్థౌనేమవగ్లాపయన్తి
నుంత్రయంతేదివో అముష్యపృష్ఠేవిశ్వమిదంవాచమ విశ్వమిన్వామ్"

(4) ప్రథమమగు సూర్యద్యుస్తుతి : అంగిరసుడు హిరణ్యస్తూపుడు:-

"త్రిస్రోద్యావః సవితుర్ధ్వా ఉపస్థాం ఏకాయమస్య భువనే విరాషాట్
ఆణిం నరధ్య మమృతాది తస్థు రిహబ్రవీతు యఉతచ్చి కేతత్"

(5) భగవానుడు యాజ్ఞవల్క్యుడును :-

"త్రయోవా ఇమే త్రివృతోలోకాః, అద్ధావైతద్ యదిమేలోకాః
అనద్ధావై తద్యదిమాన్ లోకానతిచతుర్ధమ్ అస్తివానవా"

క్రమ సంకలితములగు నీ మూడు త్రిలోకులచే సప్తలోకము లేర్పడును. (1) అగ్నియగు నీ భూలోకము పృథివి. (2) సోముడగు చంద్రుడు భువర్లోకము (3) ఇంద్రుడగు సూర్యుడు స్వర్లోకము (4) బ్రహ్మణస్పతియు భృగువును మహర్లోకము (5) వరుణునితోడి పరమేష్ఠి జనల్లోకము (6) పరమేష్ఠీ స్వయంభువుల నడిమి విద్యున్మయుడగు నొక యింద్రుడు తపోలోకము (7) వేదమయబ్రహ్మ సత్యలోకము.

ఆ యీ సప్తలోకములను రజస్సు లందురు. వీనికి బరముగ బంచాక్షరుల కాలంబనముగ నుండు నవ్యయుడు రజస్సులకంటె బరుడగుటచే బరోరజసు డనబడును. అందు వేదమయ బ్రహ్మ తనకు క్రింది రజస్సులను విథారణ గావించి పరుడు నజుడు నగు నవ్యయునందు సన్నిధి నొందించును. జాతథ్యుడగు దీర్ఘతము డాయీ విషయమును జిజ్ఞాసాముఖమున సూచించుచున్నాడు:-

"అచికిత్వాఽ చికితుషశ్చి దత్రకవీఽ పృచ్ఛామి విద్మనేన విద్వాన్
వియస్త స్తంభషడిమారజాంసి అజస్యరూపే కిమపిస్విదేకమ్"

ఐతరేయ భగవానుడు :-

"యదక్షరాదక్షరమేతి యుక్తం - యుజోయుక్తా అభియత్సంవహన్తి
సత్యస్య సత్యమను యత్రయుజ్యతే తత్రదేవా స్సర్వ ఏకంభవన్తి

## ఈ సప్తలోకములు నొక యవ్యయ పురుషుని యుదరస్థములు

ఇంతకుమున్ను వాకొనబడిన బ్రహ్మలయందు, ఏ బ్రహ్మ యొక్క రశ్మిమండల మాయాబ్రహ్మకు వైశ్వరూపమగును. కాగా, వీనియం దుత్తరోత్తర వైశ్వరూపము పూర్వ పూర్వ మందు సన్నివేశమగుచుండును. చంద్రుడు పృధివీ వైశ్వరూప మందువలె, పృధివిది సూర్యుని యొక్కయు - సూర్యునిది పరమేష్ఠి యొక్కయు, ఆయనది వేదమయ స్వయంభువు యొక్కయు, అతనిది పరోరజసుడగు నవ్యయుని యొక్కయు రశ్మిమండలము లందంతధానములగును. అంతకుమించి బాహ్యమందేమియు నుండదు. ఉత్తరోత్తరమునకు బూర్వపూర్వ మాలంబన మగుచుండును గదా! పరమాలంబన మవ్యయుడు, శృతియు:-

"ఏతదాలంబనం శ్రేష్ఠమే తదాలంబనంపరం
ఏతదాలంబనం జ్ఞాత్వాయో యదిచ్ఛతి తస్యతత్"

అనుచున్నది. ఇది యాధి దైవతముగ బురుషత్రయ వ్యాఖ్యానము :-

--- ం ---

## ఆదిభౌతిక నిరుక్తి

ఇక బై జెప్పబడిన చంద్ర - పృధివీ - సూర్యాది జడపిండము లందును. ఆయా పిండములంబట్టి జనించిన నానావిధ జడపిండములందును, నుండునా మూవురు మూవురు పురుషుల నాధి భౌతికులని యెరుంగవలయును.

## ఆధ్యాత్మిక నిరుక్తి

అధిదైవతముగా, ఏ పురుష గ్రామముగాని, భూత గ్రామము గాని యీశ్వరుడందురో, ఆయన, సంపూర్ణావయవము కల్గి యుండును కనుక, వర్తులవృత్త శరీరి యని తెలియవలయును. ఆయనకు సర్వ శక్తులును, ఎల్ల దిక్కులందును సమానములు, కార్యకారిణులు నగును. అన్ని యెడల నతడప్రతిహ తేంద్రియుడు గదా! శ్రుతియు :-

"సర్వతఃపాణిపాధం తత్ సర్వతోఽక్షిశిరోముఖం
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి"

"యస్మాత్పరం నాపరమస్తి కించిత్ యస్మాన్నాణీయోసజ్యాయోఽస్తికించిత్
వృక్షఇవస్తబ్ధః దివితిష్ఠత్యేకః తేనేదంపూర్ణంపురుషేణసర్వం"

అనుచున్నది. కానిండు; ఈశ్వరాపయవ భూతమగు పృధివ్యాది పిండజనితుడగు జీవుడు అర్థేంద్రుడు. అర్థము (సగము) ఆత్మచే బుట్టినవాడు కనుక, అన్ని దిక్కులకు గాక యొక దిక్కునకు మాత్రమే చరించును. ముందటి భాగమందువలె నతనికి వెనుకటి భాగమందు చక్షుర్వ స్త్రాదికము లేదుకదా! కనుకనే (అపూర్ణుడు - అర్థేంద్రుడు నగుటచే) దుఃఖ మనుభవించు చున్నాడు. పూర్ణత కొరకే పత్నిం గోరుచున్నాడు. పత్నీ యుక్తుడైననే పూర్ణుడై పూర్ణాత్మయగు నీశ్వరుని గూర్చి యజనము సేయ సమర్థుడగునని శుక్ల యజుర్వేదము నొక్కి వక్కాణించుచున్నది. అర్థేంద్రుడగుటవలన జీవుడు, వర్తుల వృత్త శరీరము లేక దీర్ఘశరీరి యగుచున్నాడు.

## సర్వాత్మల కాధారము చిదాత్మ

పురుష భేదముంబట్టి యాత్మ భేదించును. ఎట్లన :- ఈశ్వరునందువలె నొక జీవునందును, పరోరజనుడు నవ్యయుడు నగు చిదాత్మ యందు, అయిదక్షరాత్మలును, క్రమముగ సన్నివేశ మొందుదురు. ఆ యైదుగురును జీవు డర్థేంద్రు డగుటచే అపూర్ణమాత్రలు గలవారుగనే కననొప్పుదురు.

## ప్రాణమయుడు శాంతాత్మ (బ్రహ్మ)

అధ్యాత్మముగ బంచాక్షర స్వరూపులగు పంచాత్మలలో మొదటివాడు ప్రాణమయుడు, శాంతాత్మ, స్వయంభూ బ్రహ్మ పిమ్మటి యాత్మలు క్రమముగ (1) ఆపోమయ పరమేష్ఠి మహదాత్మ (2) వాఙ్మయ సూర్యుడు విజ్ఞానాత్మ (3) అన్నమయ చంద్రుడు ప్రజ్ఞానాత్మ (4) అన్నాదమయాగ్ని యగు పృధివి భూతాత్మ యని యెరుంగవలయును.

వేదమయుడగు బ్రహ్మయే యీ సర్వమునకు బ్రతిష్ఠ. ఈ శరీరమందంతటను ముందుగ బ్రతిష్ఠయే సన్నిధి నొందును. మాతృగర్భమందు రేతస్సాధానము కాగా, బ్రహ్మ చేతనే యది ప్రతిష్ఠంగాంచి శరీర నిర్మాణమునకు దగిన దగుచున్నది. పిదపను, ఆరవమాసము నందాశరీర హృదయమందు ప్రతిష్ఠ నొంది బ్రహ్మతోడి యింద్ర విష్ణువులు సర్వక్రియా కలాప - జ్ఞాన కలాపములను గల్గించి చైతన్యము నొందజేయుదురు. కనుక ప్రతిష్ఠాత్మకుడుబ్రహ్మ, మొదటిదగు శాంతాత్మ, ఈయన, ఓజో ధాతుకృతాశయుడు.

## ఆపోమయ మహాదాత్మ (విష్ణువు)

శాంతాత్మ యాలంబనమున బ్రహ్మ సహచరుడగు పరమేష్ఠీ విష్ణువు, శరీరమందు సన్నిధినొంది, యజ్ఞస్వభావము గలవాడగుటవలన, తన్ను దాను, (1) ఉక్థము (2) అర్క (3) అశితి అని మూడు విధములుగ విభజించుకొని, యజ్ఞమును విస్తరించు చున్నాడు. ఇందలి యక్థరూపము హృదయమందు ప్రతిష్ఠితుడగు నా విష్ణువర్కగనై లేచి అన్నము గ్రహింపనై మూడు విక్రమములను విక్రమించును. ఆ విక్రమములే క్రమముగ త్రివృత్ (9) పంచదశ (15) ఏకవింశ (21) స్తోమములు, వానిచే నన్నాదుడగు నాయన, త్రిణవ (27) త్రయత్రింశ (33) స్తోమములనుండి సోమమును సంగ్రహించును. అన్నము - ఊర్క్ - ప్రాణమునను క్రమముంబట్టి యా యన్నము నుక్థమందు ప్రవేశపెట్టి ఆయర్క శమించును. ఆ యీ యన్నోర్క్ప్రాణముల యన్యోన్య పరిగ్రహ లక్షణముగల యజ్ఞమే బ్రతికియుండు జీవుని జీవన మూలము. ఇట్లు విష్ణువు యజ్ఞమయుడు, యజ్ఞాత్మయునని పేరొందెను.

మొదటిదగు శాంతాత్మ శరీరమందలి బీజ - దేవ - భూత గ్రామములందు. ఆత్మధృతి - పశు విధృతి లక్షణములు గల ప్రతిష్ఠ నాధానము సేయుచు యజ్ఞ ప్రవర్తకమగునట్లే, ఈ రెండవ మహదాత్మయు - అహంకృతి - ప్రకృతి - ఆకృతి యను మూడింటను, త్రైగుణ్యము నాధానము సేయుచు యజ్ఞముం బ్రవర్తిల్లజేయును.

స్వయంభూరసమగు శాంతాత్మ ఓజోధాతు కృతాశయుడైనట్లే ఈ పరమేష్ఠి రసమగు మహాదాత్మ శుక్రధాతువు నభివ్యాపించి యుండును. కనుబొమ్మలకు ముక్కునకు గల సంధి దీనికి యోని, హృదయము మొదలు బ్రహ్మ రంధ్రము వరకు గల ప్రాదేశద్వయదేశము దీనికి బ్రతిష్ఠ, శుక్రధాతు వాశయము. మనుష్య - పశు - పక్షి - క్రిమి - కీటాదులెన్ని యాకృతి విశేషములు కలవో, ఆ యన్నిటికి మూల భూత మీ మహదాత్మ.

ఈ మహదక్షర మెట్టి యాకృతి నవ్యయునందు సన్నిధి నొందించు; నట్టి శరీరముతో భూతాత్మ యుపసంపన్నమగును.

"భూతం భవిష్యత్ప్రస్తౌమి మహద్బ్రహ్మైక మక్షరమ్
బహు బ్రహ్మైక మక్షరమ్" అని శ్రుతి వాకొన్నది.

ప్రతి శరీరములోపలనుండుచు నాయా శరీరాకారముందనయందాపాదింప జేయుచుండు. ఇట నీశృతి యరయదగినది.

"అశరీరం శరీరేషు - ఆన వస్థే ష్వవస్థితం
మహాంతం విభుమాత్మానం, మత్వాధీరో నశోచతి"

తన గీతయందు శ్రీ భగవానుడును :-

"మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భంద ధామ్యహం
సంభవః సర్వభూతానాం తతోభవతి భారతః
సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవన్తియాః
తాసాం బ్రహ్మ మహద్యోనిః అహంబీజ ప్రదఃపితా"

ఇందలి యహంశబ్ద మవ్యయాభిప్రాయము కలదు. అవ్యయుడే ఆ మహదక్షరమందు బీజమును సంపాదించును. బీజమన కారణ శరీరము నుపపాదించునది. బీజము నుండి దైవతములు = సూక్ష్మ శరీర రూపములును, దాని నుండి భూతములు = స్థూల శరీరోప పాదకములును కల్గుచున్నవి. కనుక నశరీరమయ్యు మహానాత్మ (1) కారణ (2) సూక్ష్మ (3) స్థూల భేదముచే మూడు భేదములు గల శరీరముం గల్గించుచున్నది. ఇట్లు పరమేష్ఠి సోమ రూపము గల మహానాత్మ రెండవయాత్మయని యెరుంగనగును.

## వాఙ్మయ విజ్ఞానాత్మ (ఇంద్రుడు)

పై జెప్పబడిన బ్రహ్మయగు శాంతాత్మను, యజ్ఞాత్మయగు విష్ణువును ఆలంబనముగా గొని సూర్యునుండి వెలువడిన యింద్రుడు, శరీరమందు విజ్ఞానముంబుట్టించును. అతడే జ్యోతిష్టోమ, గోష్టోమ, ఆయుష్టోమ - భేదముచే త్రిస్తోమములు గల సూర్యరసము. శరీరమందలి యజ్ఞమునందు ప్రాణమైయుండును. ఈ విజ్ఞానాత్మనే క్షేత్రజ్ఞాత్మ యందురు. భగవద్గీతయందు :-

5 1 2 5

"మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ

5+5 1 5

ఇంద్రియాణి దశైకంచ పంచేంద్రియ గోచరాః

1 2 3 4 1 2 3

ఇచ్ఛా - ద్వేషః - సుఖం - దుఃఖం సంఘాతః - చేతనా - ధృతిః

31

ఏతత్క్షేత్రంసమాసేన - సవికారముదాహృతం"

అని చెప్పబడిన ముప్పదియొక్క కళలుగల శరీరమును జ్ఞానముచే వ్యాపించును గనుక నీ యాత్మను క్షేత్రజ్ఞుడందురు.

ఈ జీవ శరీరమందే, భౌతికజ్ఞానమయము ప్రాజ్ఞాత్మయను భూతాత్మ, సంజ్ఞావహ - చేష్టావహములగు నెల్ల నాడులనుండి కల్గు జ్ఞాన కర్మలను కల్గించుచున్నదని ముందు తెలయగలదు. ఎల్ల శరీర కర్మలను గావించు ప్రాజ్ఞ భూతాత్మనీక్షేత్రజ్ఞవిజ్ఞానాత్మ చేయించునది. అది కర్త - ఇది కారయతి. ఈ మనువచనమరయుడు-

"యోఽ స్యాత్మనః కారయితా, తంక్షేత్రజ్ఞం ప్రచక్షతే
యఃకరోతి తుకర్మాణి సభూతాత్మోచ్యతే బుధైః
జీవసంజ్ఞోఽ న్త రాత్మాఽ న్యః సహజః సర్వదేహినాం.
యేనవేదయతే సర్వం సుఖందుఃఖంచ జన్మసు" ఇత్యాది.

ఈ విజ్ఞానాత్మ, మహదాత్మయందు, ప్రజ్ఞానాత్మయందు, ప్రాణాత్మయందు - భూతాత్మ యందును ప్రకాశము నాథానము సేయుచు జీవన హేతువగు నాయువుం బ్రవర్తిల్లజేయును. అధ్మాత్మ మందిది హృదయమందుండు సూర్యుడు. దీని వైజ్ఞానికరశ్మి మండలము శోణితాకాశము నందంతటను వ్యాపించు చుండును. సూర్యుడు దీనికి ప్రభవము, బ్రహ్మరంధ్రము - ధృతి - నాందనము యోని, హృదయము ప్రతిష్ఠ, శోణిత మాశయము. ఇట్లు నాలుగనుబంధములని తెలియవలెను. ఇది సూర్యరసరూప విజ్ఞానాత్మ వివరణము.

## అన్నమయ ప్రజ్ఞానాత్మ (సోముడు) (మనస్సు)

ఈ భూమిపై మొలచు నోషధులకుదర్క భూతమగు నన్నమున కారంభకములగు ద్రవ్యములు (1) పార్థివములు (2) అంతరీక్ష్యములు (3) దివ్యములు నని మూడు విధములు. అగ్నియందన్న పరిపాక వశమున నా యారంభక ద్రవ్యములకు గ్రమముగా సంబంధ విచ్ఛేదము కలుగగా, విశకలితములగు నమృత - మృత్యు - భాగములందమృతము రసముగనై ప్రాణములచే పైకి గొంపోబడును.

మర్త్యము మలముగనై యపానముచే గ్రిందికి ద్రోచి వేయబడును. ఇందు పార్థివములయిన మర్త్యామృత ద్రవ్యములకు, అగ్ని పరిపాకవశమున, నుత్తరోత్తర విభాగక్రమముంబట్టి రసాసృఙ్మాంస మేదోఽస్థిమజ్జా శుక్రములు పుట్టుచున్నవి. పిదప, పార్థివ ద్రవ్యములు పూర్తిగ పోగా, ఆపో - వాయు విద్యుత్ - సోమమయము నాంతరీక్ష్యము నగు నోజో నామక ధాతువు స్థితి నొందును. తరువాత నందుండి ఆపో - వాయువులు విడిపోగా, విద్యుత్సోమమయమగు నే సూక్ష్మ పదార్థము మిగులునో యది మనస్సను పేరుగలది. ఇట్లన్నమందలి సోమరసము క్రమముగ విశుద్ధమై మనో రూపమొందునని సిద్ధమయినది. ఆయీస్వచ్ఛతమమగు మనస్సునందు, ప్రతిబింబితమగు క్షేత్రజ్ఞం సూర్యరశ్మి వెన్నెలగల్గించును కనుక, మనస్సు ప్రజ్ఞానాత్మ యగును. ఈ యైతరేయ వచన మరయుడు:-

"కోఽయమాత్మేతి వయముపాస్మహే, కతదః సఆత్మా - యేనవా పస్యతి - యేనవాశృణోతి - యేనవా గంధానా జిఘ్రతి - యేనవా వాచం వ్యాకరోతి - యే నా స్వాదు చాస్వాదుచ విజనాతి - యదే తద్ధృదయం మనశ్చైతత్ - సంజ్ఞాన - మాజ్ఞానం - ప్రజ్ఞానం - మేధా - దృష్టిః - ధృతిః - మతిః - మనీషా - జూతిః - స్మృతిః - సంకల్పః - ఋతురసః - కామోవశః - ఇతి సర్వాణ్యేతాని, ప్రజ్ఞానశ్య నామ ధేయానిభవన్తి; ఏషబ్రహ్మ - ఏషఇంద్ర - ఏష ప్రజాపతిః - ఏతే సర్వేదేవాః - ఇమానిచ పంచమహా భూతాని, పృధివీ - వాయు - రాకాశ - అపోజ్యోతీంషి; యత్కించేదం ప్రాణి జంగమంచ - పతత్రిచ - యచ్చస్థావరం సర్వం - తత్ ప్రజ్ఞా నేత్రం - ప్రజ్ఞానే ప్రతిష్ఠితం - ప్రజ్ఞానేత్రేలోకః - ప్రజ్ఞా ప్రతిష్టా - "ప్రజ్ఞానంబ్రహ్మ" సఏతేన ప్రాజ్ఞేనాత్మనాఽ స్మాల్లోకాదుత్క్రామ్యాముష్మిన్ స్వర్గేలోకే సర్వాన్ కామానాప్త్వాఽమృతః సమభవత్"

ఇచట నొక విషయము గుర్తింపదగినదేమన:- మనస్సన్నది (1) చిదాత్మకము - (2) ప్రాణాత్మకము - (3) ఇంద్రియాత్మకము నని మూడు విధములు. (1) శ్వోవసీయసమగు నవ్యయ మనస్సు చిదాత్మకమిది మొదటిది (2) సర్వేంద్రియ ప్రవర్తకమగు అనింద్రియ

మనస్సు - ప్రాణాత్మకమిది రెండవది (3) సుఖదుఃఖ వేదనీయ గుణముగలదియు, హృదయము స్థానముగా గలదియునగు నింద్రియాత్మక మనస్సు మూడవది. ఇందలి రెండవ మనస్సు ప్రజ్ఞానాత్మ. అది:- వాక్కు నందు వాక్కు, రసనయందు రసము, ముక్కు నందు వాసన, శ్రోత్రమందు శబ్దము, చర్మమందు స్పర్శ - కంటియందు రూపము, హృదయమందు మనస్సు, వేర్వేరు రంగులు గల యద్దములందలి సూర్యరశ్మి భిన్న వర్ణములు కలదయినట్లు ప్రజ్ఞానాత్మ భిన్న గుణములు కల యింద్రియములందనుగతమై భిన్న గుణములు కలదిగ నిష్పన్నమగుచున్నది. ఆయా యింద్రియాను గతివశమున నాయా యింద్రియజ్యోతిం గల్గించుచున్నది. ప్రాణాత్మయనబడు చంద్రుడిదే. ఈ సోమ ప్రాణమందే మూడగ్నులు రెండు సోమములు నని పంచదేవతలు వెలయుచుందురు. ఈ యైతరేయ వచన మరయుడు:-

"అధాధి దైవతమ్ : చక్షుః - శ్రోత్రం - మనో - వాక్ - ప్రాణః - తాఏ తాపంచ దేవతా - ఇమంవిష్టాః పురుషం - పంచోహైవేతా దేవతా అయంవిష్ఠః పురుషః; సోఽ త్రాలొమభ్యః అనఖాగ్రేభ్యః సర్వః సాంగ ఆప్యాయతే - తస్మాత్ సర్వాణి భూతాని అపిపీలికాభ్యః ఆప్తాన్యేవ జాయన్తే."

అయీ ప్రజ్ఞానాత్మ = ప్రాణాత్మయను చంద్రుడు ముఖమందలి (నోరు) వాక్కు లక్షణము గాగల పృధివిని పరిక్రమించుచు, హృదయము మొదలుగ కేశాంతమువరకు రెండు ప్రాదేశములు లక్షణముగా గల తన కక్ష నధిరోహించి సంచరించును. (1) అచట, హృదయమందలి క్షేత్రజ్ఞ సూర్యుని జ్యోతిచే జ్యోతిష్మంతుడై శిరమందు కేశాంతస్థానమందుండి పూర్ణిమం గావింపుచు, శిరమందలి యింద్రియములకు, వెన్నెల తోవలె ప్రకాశిల్లజేయును. కనుక, బాహ్యేంద్రియార్థములను సంపాదించుకొను భూతాత్మ కది జాగ్రదవస్థ యగుచున్నది. (2) పిదప తాలు (దౌడ) ప్రదేశమందు గోస్తన స్థానమందుండి యష్టమిం గల్గించి శిరమందలి యింద్రియములను స్పృశింపక, క్రిందుగ, భావనా వాసనారూప సంస్కారములను ప్రకాశిల్లజేయును. కనుక భూతాత్మ కది స్వప్నావస్థ

యగుచున్నది. (3) పిదప నింకను క్రిందుగ జరింపుచు, హృదయ సదేశము నొంది క్షేత్రజ్ఞ సూర్యునితో వసించును. కనుక నమావాస్య కల్గును. అచట కేవల మాత్మానందమే యనుభవించును గాని, యింకే విషయానుభవము నుండదు. అది భూతాత్మకు సుషుప్త్యవస్థ.

ఆధ్యాత్మముగా భూతాత్మక వస్థాత్రయము దెచ్చిపెట్టు నీ చంద్రుని పద (స్థాన) త్రయమును తిత్తిరి ప్రదర్శింపు చున్నాడు:-

“సేఏషోఽన్తర్హృదయ ఆకాశః, తస్మిన్నయం పురుషః మనో మయః - అమృతో హిరణ్మయః - అంతరేణతాలుకే యఏషస్తన ఇవాలంబతే - సేంద్రయోనిః - యత్రాసౌ కేశాంతః వివర్తతే వ్యపోహ్య. శీర్షకపాలే ఆకాశ శరీరం బ్రహ్మ సత్యాత్మ ప్రాణారామం మన ఆనందం శాంతి సమృద్ధ మమృతం”.

ఆయీ యాధ్యాత్మిక చంద్రుని సంచారము యాదృచ్ఛికము గాని, దివ్య చంద్రునికివలె నియతకాలము గలది గాదిది యొకటే విశేషము.

## అన్నాదమయభూతాత్మ - శరీరాత్మ - (అగ్ని)

అగ్నిమయము - పృధ్వీరస రూపమునగు నైదవది భూతాత్మ. ఇది మూడు విధములు. (1) శరీరాత్మ (2) హంసాత్మ (3) దివ్యాత్మ. ఇందు, పంచ భూతములే శరీరాకార విశేష సన్నివేశమొందగా, శరీరాత్మ యగును. ఇందలి భూతములు పృధ్వీ రసరూప మర్త్యాగ్నిగ నెఱుంగనగును. ఇది బాహ్యాత్మ (శరీరము).

(2) రెండవ భూతాత్మ = హంసాత్మ, మర్త్యవాయువు.

బాహ్యమయిన యీ శరీరాత్మయందే ప్రతి భూతమునందు నభి వ్యాప్తి కల్గిన భూతాభిమానియగు వాయువు, శరీరావచ్ఛేదా కారముచే సంఘటితమై హంసాత్మ యగును. ఇది జీవన కాలమందు తఱచుగ భౌతిక శరీరానుగతమై శరీరమందె యుండు చుండును.

కాని, మరణానంతరము శరీరము పూడ్చి పెట్టినచో నా శరీరము నాలంబముగా గొని యటనట వాయువునం దిరుగాడుచుండును. శరీరము దహింపబడుచో నీ భూమిపై నేమూషవాయువునందు వాయవ్య శరీరియై యటనట సంచరించును. అట్లు నూరేండ్లు, సామాన్య జ్ఞానము కలదిగనో, జీవన కాలమందలి జ్ఞానమువంటి జ్ఞానము కలదిగనో, బ్రతికి యున్ననాటి సుఖ దుఃఖావస్థలవంటి యవస్థ కలదిగనో జీవించును. వాయవ్య శరీరము గలది కనుక నది పరాకాయప్రవేశము సేయును. పలు విధములగు జీవ శరీరాకృతుల నెత్తగలదు. ఒకప్పుడు కన్పట్టగలదు. కలలోనికి వచ్చి మాటాడగలదు. ఆయీ యోని విశేషమునే ప్రజలు 'భూత' మందురు. గయా శ్రాద్ధము వలన దీని యీ శరీరము నశించునని కొందరు విజ్ఞాను లందురు. ఇది ఏమూషవాయుమయ హంసాత్మ యను భూతాత్మ పరిచయము.

(3) <u>మూడవ భూతాత్మ - దివ్యాత్మ = ప్రాణము.</u>

భూః - భువః - సువః నాబడు పృథివి - అంతరిక్షము - ద్యులోకములు మూడు, వీనియందలి ప్రాణమగ్ని - వాయు - ఇంద్రులని మూడు విధములు. కనుక, నీదివ్యాత్మయగు భూతాత్మ మూడు విధములుగ జెప్పబడును. (1) వైశ్వానరుడు (అగ్ని) (2) తైజసుడు (వాయువు) (3) ప్రాజ్ఞుడు (ఇంద్రుడు).

ఇందలి యింద్రప్రాణమే ప్రజ్ఞాత్మ;

"యః ప్రాణః సా ప్రజ్ఞా - యాప్రజ్ఞా సప్రాణః సహహ్యే తావస్మిన్ శరీరేవసతః సహోత్త్రిష్టతః తమేత మాయురమృత మిత్యుపాస్వ" అని కౌషీతకీశ్రుతి చెప్పుచున్నది. ఇట్లు జ్ఞాన కర్మమయమగు నీ ప్రాజ్ఞాత్మ జ్ఞానకర్మ జనితములగు భావనా వాసనలతో గూడి జ్ఞానాత్మయు, కర్మాత్మయు నగును.

ఆ యీ ప్రజ్ఞామయప్రాణము; సూర్యరస మగుటవలన నింద్రుడు; తిన్న యన్నము పరిణమింపగా గల్గు, చాంద్రరస మయ సోమమగు, మనస్సునందీ యింద్రుడు ప్రతిఫలింపగా, ప్రాజ్ఞుడను భూతాత్మ వెలయును. మనస్సునకు విజ్ఞానాత్మ నుండియేగదా జ్యోతి లభించును? ఇది కర్మాత్మయను భూతాత్మ. మర్త్యాగ్నిమయ శరీరాత్మ మొదటి భూతాత్మ, వాయుమయ హంసాత్మ రెండవ భూతాత్మ, ఈ యింద్రమయ కర్మాత్మ మూడవ భూతాత్మ. ఈ యగ్ని - వాయు - ఇంద్రులే కేనోపనిషత్ప్రసిద్ధులు. పృథివియందే వీరుపలబ్ధులగుచున్నారు కనుక, పృథ్వీరసములగు నీ మూవురిచే మూడు భూతాత్మలు వెలయుచున్నవి.

<u>కర్మాత్మ మూడు విధములు</u>

ఇందు, కర్మ పరతంత్రమగు కర్మాత్మ (1) వైశ్వానరుడు (2) తైజసుడు (3) ప్రాజ్ఞుడు నని మూడు విధములు. ఇందలి (1) వైశ్వానరుడగ్నిమయుడు (2) తైజసుడు వాయుమయుడు (3) ప్రాజ్ఞు డింద్రమయుడు. వీరిలో

(1) శరీరతంత్రధరుడు కేవలము వైశ్వానరుడై తైజసప్రాజ్ఞులు కాకున్నచో, ఖనిజమణి ప్రస్తరాది <u>ధుతుజీవు</u>డగును. (2) వైశ్వానర తైజసులిర్వురు మాత్రమే తంత్రధరులగుచో, నోషధి వనస్పత్యాది <u>మూలజీవు</u>డగును. (3) ఇక మూవురును తంత్రధరులగుచో, కృమి కీట పశు పక్షి మనుష్యాది <u>చేతన జీవుడ</u>గును. ఈ మూడు రకముల జీవులును క్రమముగ (1) అసంజ్ఞులు (2) అంతస్సంజ్ఞులు (3) ససంజ్ఞులుగ జూపట్టుచున్నారు. ఇందును:-

**(1)** వైశ్వానరాగ్ని యొకడే, శరీర ధాతు సంఘటన కర్మ కలవాడు.

(1) ధాతుజీవునందు :- శరీరోపాదన భూతములగు ధాతువులను భిన్న భిన్న రూపమున, సువర్ణ - రజత - తామ్రాదులుగా కల్పించును.

(2) మూలజీవు శరీరమందు:- భిన్న భిన్న రూపములుగల కాష్ఠ విశేష రూపములు, ఫల - పత్ర - పుష్ప - కాండాదులను, కల్పించును.

(3) చేతన శరీరమందు :- శోణిత - మాంస - మేదోఽస్థి మజ్జాదులగు ధాతు విశేష రూపముల నుత్పాదించును.

**(2)** ఇక తైజసాత్మ యన్ననో, అరోహావరోహ కర్మలు కలవాడు.

(1) అంతఃసంజ్ఞగల వృక్షాది మూలజీవులను, (2) ససంజ్ఞలగు మనుష్యాది చేతన జీవులను, క్రమముగా బెంచుచు, బాల్య యౌవనాద్యవస్థావిశేషములతో గూర్చును. (3) ధాతుజీవులగు సువర్ణాది పిండములందు శరీరవృద్ధ్యాది రూపావస్థా కృతవిశేష మగపడుటలేదు. ఏలయన, అందుకు గారణమగు వాయుమయ తైజస ప్రాణము వాని యందు లేదుకదా!

(3) మరి మూడవదయిన ప్రజ్ఞాత్మ వైశ్వానరతైజస ప్రాణ పరిపాకముచే నుత్పన్నమయినది. శరీరమునందు నేను - నీవు - వాడునను బుద్ధి రూప చైతన్యముం గల్గించునదీ ప్రజ్ఞానాత్మయే. ఇంద్ర ప్రాణమగు - దీని నుండియే చక్షుః శ్రోత్రవాగాది సర్వేంద్రియములు నాయా విధములుగ గల్గుచున్నవి. ఇంద్రుడను ముఖ్య ప్రాణమునుండి కల్గుటవలననే ఆ ప్రాణము లింద్రియములనబడుచున్నవి.

వృక్షాదులగు మూలజీవులందును, అతి సూక్ష్మదృష్టి నరయచో చేతన జీవులందువలె సుఖదుఃఖాది ప్రత్యయములు గోచరించుచున్నవి. కనుక, నాయింద్రియములు వానియందును నున్నవి. కానీ, వాని వృత్తులు చేతన జీవునందంత యుల్బణములుగ లేవు. కనుకనే మహర్షు లామూల జీవులనంతః సంజ్ఞములని వక్కాణించిరి. ఈ భారతపద్యము నరయుడు :-

సీ॥ అశని నిర్ఘోషంబు నాకర్ణనము లేక,
వికృతి నెట్టులువొందువృక్ష? మాక
సముశక్తి సూవె శ్రోత్రము[1]; నిదాఘంబుచో
కును వాడు, జోకెరుంగుట సమీర

శక్తి[2]; మార్గముగొని చాగెడు, కనుట తే
జశ్శక్తి[3]; పాదపసంజ్ఞఁ బరగు
బాద జిహ్వాలగొనిపానంబు సేయుట,
జలశక్తి జిహ్వ[4]; నైజంబులైన

గీ॥ కుసుమ ధూపాది గంధముల్ గొనుటనెలమి
దాల్చునని చెప్పుఁ దరువు వేదంబు, ఘ్రాణ
ముర్వి[5] శక్తి; యిట్లయిదును నుల్లసిలుట
ననఘ భూజంబు పంచ భూతాత్మకంబు॥ కానిండు,

మూలజీవులందనుద్బుద్ధ ప్రజ్ఞాప్రాణము చేతన జీవ శరీరములందు సంపూర్ణగ నుద్బుద్ధమగుచున్నది.

ఇట్లే ప్రాణత్రయ తారతమ్యమువలన ధాతు - మూల - చేతనులను మూడు విధముల జీవు లేర్పడుచున్నారు. కాగా వైశ్వానర - తైజస - ప్రాజ్ఞులను మూడుగా విభక్తమయిన కర్మాత్మయను భూతాత్మ సిద్ధమగుచున్నది. దీనింబట్టి భూతాత్మయన్నది యొకటే (1) శరీరాత్మ (2) హంసాత్మ (3) వైశ్వానరాత్మ (4) తైజసాత్మ (5) ప్రాజ్ఞాత్మ యని యైదువిధములగునని యెరుంగవలయును. ఇందలి మొదటి రెండును బాహ్యాత్మలు. తక్కిన మూడు నంతరాత్మలు. ఇట్లు భూతాత్మ పంచ విధమయినను ప్రాజ్ఞాత్మంబట్టి విశేషత గాంచుచున్నది. కనుకనే అది 'ప్రాజ్ఞాత్మ' యందురు. ఇది పృధ్వీరసమయము, పంచభేదభిన్నమునగు నైదవ భూతాత్మ పరిచయము.

## ఆత్మ గతి వివేకము

ఇక, మరణానంతరము శరీరాత్మ పంచత్వమునొందును. అనగా శరీరమందలి పృధివ్యాధి పంచ ధాతువులును; విశ్లథములై శరీరము నుండి విడి వడి, పృధివ్యాధి పంచభూతములందు, అందం దయ్యాది కలసి శరీర రూపములగు చర్మత్వ

మాంసత్వాస్థిత్వాదులను విడుచుచున్నవి. ఇదే శరీరమందలి భూతముల పంచత్వగతి కాగా, వాక్కు అగ్నియందు, ప్రాణము వాయువునందు చక్షు వాదిత్యునందు, శ్రోత్రము దిక్చంద్రునందు, మనస్సు బ్రహ్మణస్పతి చంద్రునందు, యధాయధముగ గలిసి యాధ్యాత్మిక స్వరూపము నుండి భ్రంశము నొందును. ఇది శరీరమందలి దేవతల పంచత్వగతి యగును. ఇది సూక్ష్మస్థూలభేద విభక్త మయిన శరీరాత్మయొక్క పంచత్వగతి.

ఇక హంసాత్మకన్నదో, ఏమూషవాయువునందు, యోని విశేషరూపమున గ్రొత్త జన్మ యగును. దానికి చిరజీవనము కన్పట్టుచున్నది. దానికి మృత్యుకాలము వచ్చినపుడది వాయువునందు లీనమగునని యెంచబడుచున్నది.

మరి కర్మాత్మగా జెప్పబడిన మూడవ భూతాత్మ యన్నది, పుణ్య పాప కర్మలచే నను బంధింపబడుచు శరీర త్యాగానంతరము కర్మగతింబట్టి పారవశ్యమున పుణ్యలోకమునకో, పాపలోకమునకో పోవుచున్నది (1) పృధివినుండి సూర్య విరుద్ధ దిక్కు నందు శనైశ్చర పర్యంతముగాని లోకాలోక పర్యంతముగాని, పోవుట యధోగతి = పాపగతియగును. అంధకార ప్రాయమగుటవలన నది కృష్ణగతి. (2) పృధివి నుండి సూర్యపర్యంతము పోవుట యూర్ధ్వగతి = పుణ్యగతి, యది ప్రకాశమయమగుటవలన శుక్ల గతి. ఈ రెంట నేదో యొక గతినొంది సుఖమో దుఃఖమో యనుభవించి పుణ్యమో పాపమో క్షీణము కాగా, మరల నీ మర్త్యలోకమున బుట్టును. ఇది కర్మగతి పరిచయము.

## అధ్యాత్మముగ పంచాక్షర పురుషోపసంహారము

ఈవిధము బ్రహ్మ - విష్ణు - ఇంద్ర - సోమ - అగ్నియను నీ పంచాక్షరులును, అధ్యాత్మముగ జీవ శరీరమందనువర్తించునపుడు, శాంతాత్మ - మహదాత్మ - విజ్ఞానాత్మ - ప్రజ్ఞానాత్మ - భూతాత్మ యని పంచాత్మలుగా జెప్పబడుదురు. ఈ పంచాక్షరుల కాలంబన భూతుడవ్యయుడు 'విరజా' అని చెప్పబడును. ఈ క్రింది యైతరేయ వచనము లరయుడు.

"యదక్షరం పంచవిధంసమేతి, యుజోయుక్తా, అభియత్ సంవహన్తి
సత్యస్యసత్యమనుయత్రయుజ్యతే, తత్రసర్వ ఏకీభవన్తి"

"హిరణ్మయేవరేకోశే విరజం బ్రహ్మవిష్కలం,
తచ్ఛుభ్రంజ్యోతిషాంజ్యోతిః తద్యదాత్మవిదోవిదుః"

## అధ్యాత్మముగా, అవ్యయ ధాతువుల వినియోగము

అవ్యయుని పంచధాతువులుగా జెప్పబడిన ఆనంద - విజ్ఞాన - మనః - ప్రాణ - వాక్కులు, ఎల్ల యక్షరపురుషులకు, క్షరపురుష కార్యములకు, వికార సంఘములకు, ఆయావిధముగ నాలంబనమగును. ఇందు (1) వికార సంఘము - క్షరపురుషుడును, ప్రధానముగ నవ్యయుని వాగ్ధాతువును, (2) అక్షర పురుషులందరును అవ్యయుని ప్రాణధాతువు నవలంబింతురు. (ఇందును శాంత - మహ - ద్విజ్ఞానాత్మలు మూడును విశేషించి అవ్యయుని విజ్ఞానధాతువును, ప్రజ్ఞానాత్మ ప్రాణధాతువును భూతాత్మ వాగ్ధాతువును, ఈ భూతాత్మ యందలి శరీరాత్మ వాగ్ధాతువును, హంసాత్మ, ప్రాణధాతువును, కర్మాత్మయన్నది మనోధాతువును, ఈ కర్మాత్మయందలి వైశ్వానరుడు వాగ్ధాతువును, తైజసుడు ప్రాణథాతువును, ప్రాజ్ఞుడు మనో ధాతువును అవలంబింతురని విశేషము).

ఏది యెట్లయినను, ఆ యీక్షరాక్షరపురుషు లెల్లరును అవ్యయుని మనోథావులు నొకదానినే ఆలంబనముగా గొందురని చెప్పవలయును. కానీ, కార్యోపథాన కాలమందు తమ తమ కనుకూలమగు వేర్వేరు థాతువుల నాథారములుగా గొని జగత్తునకు, సృష్టి - ముక్తుల నాపాదించుచుందురని యెంచవలయును. అందును, సృష్టింజేయునపుడు ముఖ్యముగ మనోమయ ప్రాణగర్భితవాక్కు నాశ్రయించి యానంద - విజ్ఞానములను సహకారులుగా స్వీకరింతురనియు, ముక్తి నపేక్షించునపుడు, ముఖ్యముగా, ఆనందమయ విజ్ఞానగర్భితమగు మనస్సు నాశ్రయించి ప్రాణవాక్కులను సహకారులుగా స్వీకరింతురనియు, విశేషము.

## అధ్యాత్మము అవ్యయకళలు పంచకోశములు

పై జెప్పబడిన విషయముంబట్టియే, అవ్యయుని పంచధాతువులును (1) అన్నమయ (2) ప్రాణమయ (3) మనోమయ (4) విజ్ఞానమయ (5) ఆనందమయములని పంచకోశములుగా తైత్తిరీయము వివరించినది. ఏమయినను:-

“హిరణ్మయే పరేకోశే విరజం బ్రహ్మ నిష్కలం” అను నీ మొదలగు వానియందు, అనాత్మయగు నవరబ్రహ్మకు కోశత్వముంజెప్పి, ఆత్మయగు పరబ్రహ్మ యా కోశమందున్న రత్నముగా జెప్పబడిన దానింబట్టి దార్శనికులు, ఈ కోశము లందు పూర్వపూర్వమనాత్మ = అపర బ్రహ్మయనుచు, ఉత్తరోత్తరము నిధేయరత్న మనుకొనుచున్నారు”, ఎట్లన :- అన్నమయమందు ప్రాణమయము, దానిలో మనోమయము. అందు విజ్ఞానమయము దానియందు ఆనందమయము నని, ఆయానందమయ కోశములో నిహితమయియున్న యొకానొక విశుద్ధానంద మాత్రమగు భావము పరబ్రహ్మయని చెప్పుచున్నారు. ఉపనిషత్తునందును ఆపాతతః అదే స్వరసముగ దోచును. కాని,

అదే రాద్ధాంతమనజాలము. ఏలయన:-

“మయాతతమిదంసర్వం జగదవ్యక్తమూర్తినా,
మత్స్థానిసర్వభూతాని నచాహంతేష్వపస్థితః॥

యధాకాశస్థితో నిత్యంవాయుః సర్వత్రగోమహాన్
తథాసర్వాణిభూతాని మత్స్థానీత్యుపధారయా॥

యస్యాంతస్థాని భూతానియేన సర్వమిదంతతం,
పురుషఃసఃపరః పార్థః భక్త్యాలభ్యస్త్వనన్యయా

యేచైవసాత్వికాభావాః రాజసాః తామసాశ్చయే.
మత్త ఏవేతితాన్ విద్ధినత్వహంతేషు తేమయి”

అని యిట్లనేక విధములుగ భగవద్గీతోపనిషాదులందు, అవర బ్రహ్మలగు భూతములవ్యయ పురుషునందున్న వనియు, అవ్యయుడు సర్వాధారుడనియు, పరబ్రహ్మయనియు చెప్పబడి యున్నది. మఱియు,

"ఏతదాలంబనంశ్రేష్ఠ మేతదాలంబనంపరం,
ఏతదాలంబనంజ్ఞాత్వా యోయదిచ్ఛతితస్యతత్"

అని శృతియు, పరమాత్మ సర్వాధారుడన్నదిగదా! స్వజన్య భూతము లందుండుటవ్యయునకు పొసగదని స్పష్ట శబ్ధములతో చెప్పివేయబడినది. ఇట్టిచో, తదీయ వాఙ్మనః ప్రాణాదులగు ధాతువులకే కోశత్వముం జెప్పనొప్పును. ఇక,

తైత్తిరీయమం దొకదానిలో మరొక కోశముగ జెప్పబడిన యంతరాంతరీభావ మొకదానికంటె మరొక కోశము సూక్ష్మత గలదను నభిప్రాయముతో జెప్పినదిగాని యాధారాధేయ భావముతో జెప్పినది కాదనుకొనదగును లేదా, అన్న జనితమైన మౌలిక మర్త్యకోశాభిప్రాయము గలదనియైన ననుకొనవలెను. వాస్తవమున కవ్యయుడొకడే, సర్వాక్షరాదుల కాలంబనుడు కనుక, కోశభూతుడనదగును 'నేనొకడను పెక్కురయ్యెద' "ఏకోహం బహుస్యాం" అనునట్టి ఇచ్ఛా - తపః - శ్రమ యోగమున నాయొకనికే వివర్త రూపమున ననేక విధత్వము నొందిన, వాక్ప్రాణ మనోవిజ్ఞాన లక్షణములు గల యవ్యయధాతువులు, సర్వ జగదర్ధములగు నామరూప కర్మలకు, కోశభూతములుగ నండుననుకొన నొప్పును. ఇది అవ్యయ పురుష పరిచయము.

## అధ్యాత్మముగ పురుషత్రయ నిర్వచనోప సంహారము

ఆ యీ మూవురు పురుషులను గూర్చియు శ్రీ భగవానుని సమ్మతి:-

"ద్వావిమోపురుషౌలోకే క్షరశ్చాక్షరఏవచ
క్షరఃసర్వాణిభూతాని కూటస్థోఽక్షరఉచ్యతే
ఉత్తమఃపురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యోలోకత్రయమా విశ్వభిభర్త్యవ్యయ ఈశ్వరః
యస్మాత్ క్షరమతీతోఽహం అక్షరాదపిచోత్తమః
అతోఽస్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః
అవ్యక్తంవ్యక్తి మాపన్నంమన్యంతే మామబుద్ధయః
పరంభావమజానంతో మమావ్యయమ నుత్తమం
నాహంప్రకాశః సర్వస్య యోగమా యాసమావృతః
మూఢోయంనాభిజానాతి లోకోమామజమవ్యయం
త్రిభిః గుణమయైర్భావైః ఏభిసర్వ మిదంజగత్
మోహితంనాభి జానాతి మామేభ్యః పరమవ్యయమ్"

శ్రుతియు :- "పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భావ్యం" అన్నది.

## పరాత్మపర నిరుక్తి

బ్రహ్మయొక్క నాలుగు పాదములందును, (1) భూతగ్రామ రూపమగు పురమును (2) ఆత్మగ్రామ రూపమగు పురుషుడును, అను రెండు పాదముల నెఱింగికొంటిమి. ఇక మూడవ పాదము పరాత్పరుడందురు. (1) క్షరుడవర బ్రహ్మయనియు (2) అక్షరుడు పరావర బ్రహ్మయనియు (3) అవ్యయుడు పర బ్రహ్మయనియు, నింతకంటె (పరాత్) పరభావము పరాత్పరుడనియు ననుకొంటిమిగదా, పరత్వమనగా నభివ్యాపకత్వము.

(1) తన వికారసంఘములన్నింటిని క్షరుడభివ్యాపించును, (2) క్షరపురుషులనక్షరపురుషు డభివ్యాపించును (3) అక్షర పురుషులను పురుషోత్తము డువ్యయుడభి వ్యాపించును. కనుక నాయవ్యయుడు పరపరుషుడందురు. అతనింగూడ నభివ్యాపించు నితడు పరాత్పరుడగును.

పురుషోత్తము డక్షరపురుషునికంటె వ్యాపకుడే, కాని మాయాబల విశిష్టతచే మితిగలవాడై ది-గ్దే-శ- కాల- సంఖ్య లను పరిచ్ఛేదక ధర్మములచే పరిచ్ఛేదము నొందును. కాని అనంత మాయాబలములు కల్గుచుండుట కాధారము రసము. అది యనంతము కనుక మాయాబలములున్నను అది పరిచ్ఛేదముసేయనైతి (శక్యము) కాదు. చూడుడు :-

చిత్రపటమందనేకవిధ రూపమయములగు చిత్రములుండును. అందొకానొక పరిచ్ఛిన్న చిత్రరూపముచే పరిచ్ఛిన్నమయిన పట ప్రదేశము. ఆ చిత్రరూపముంబట్టి పరిచ్ఛిన్నమను కొన్నను అంతమాత్రముచే సర్వవిధ చిత్రమయపటమును పరిచ్ఛిన్న మనుకొనరాదుగదా, అట్లే యీ పరాత్పరుడను రసమును, దిగ్దేశ కాలములచే బరిచ్ఛిన్న మననైతిగానిదగుటవలన ననంతము - అసీమమునని తెలియనగును.

"నతస్య ప్రతిమాస్తి యస్యనామ మహద్యశః" అను మొదలగు శృతు లీపరాత్పరుని స్తుతించును. అసీమత్వమే ఇటనప్రతిమత్వము, శ్రుతి "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అనుటయు నీ పరాత్పరుం గూర్చియే:-

అధిదైవతము, అధ్యాత్మము, ఆదిభూతము నను నధికరణ త్రయభేదముచే నవ్యయ పురుషులకు, మాయాబలవైశిష్ట్యముంబట్టి పరిచ్ఛిన్న శరీరులగుదురు కనుక నానాత్వ మొప్పినను, ఈ పరాత్పరునకు దిగ్దేశ కాలాద్య నవచ్ఛిన్నతం బట్టి అద్వితీయ సర్వైక్యతయే యొప్పును.

# పరాత్పర - పురుషులకు భేదము

అపరచ్ఛిన్నుడగుటవలననే పరాత్పరుడు పురుషుడనిపించుకొనడు. పురవాసిత్వము, పురావచ్ఛేదము వలనగదా! పురుషులకు పరిచ్ఛిన్నత గల్గును? పరాత్పరునకన్నో ఆ రెండును లేవు గనుక పురుషత్వ మతనికసంభవము.

## పూర్వ పక్షము

పరాత్పరుడు పురుషునికంటె వేరన్నచో, శ్రుతి విరోధము:- "యథానద్యః స్యందమానాస్సముద్రేఽ స్తంగచ్ఛంతి నామ రూపే విహాయ, తథా విద్వాన్నామ రూపాద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యం" అని పురుషునకు పరాత్పరత్వము లేదా పరాత్పరునకు పురుషత్వము శ్రుతి చెప్పినది కదా! ఈశ్వర పురుషుడన్నిటికంటె బరుడనవచ్చును. కనుక పురుషునకు పరాత్పరత్వము చెప్పదగును. పురుషులకంటె పరాత్పరుడు వేరగుచో :-

"పురుషఏవేదం సర్వం యద్భూతం యచ్చ భావ్యం" అనుచున్న శ్రుతిమాట యేమీ కావలయును? అన్నచో :-----

## సమాధానము

"పరాత్పరం పురుషముపైతి దివ్య" మనుదాని యర్థము సరిగా నెఱుంగమిచే నీశంక కల్గినది. అచట పరపురుషుడు, (1) జీవావ్యయుడు (2) ఈశ్వరావ్యయుడు నని రెండు విధములు. ఎట్లన:-

"గతాఃకలాఃపంచదశప్రతిష్ఠాం దేవాశ్చ సర్వేప్రతిదేవతాసు,
కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మాపరేవ్యయే సర్వఏకీభవన్తి"

అని పూర్వమచటి శ్రుతి వాక్యము జీవశరీరమందలి సర్వవిధ వికారములకును, వానికిగారణుడగు క్షరపురుషునందును, అతని కక్షరపురుషునందును, అతని కవ్యయ

పురుషునందును, విలయనము ప్రతిపాదించుచున్నది ఇట్లేకీభూతుడయిన యా జీవ శరీరమందలి పరుడగు నవ్యయునకు, మరల నీశ్వర శరీరమందలి మహావ్యయునందు సాయుజ్యము జెప్పుచున్నది.

ఈశ్వర శరీరమందలి యవ్యయపురుషునికంటె, జీవశరీరమందలి యవ్యయ పురుషునకు, పంచదశ (15) కలాది నానా విధ క్షుద్రధర్మ, సంయోగముండుటవలన, స్వల్ప మాత్రుడగును కనుక, ఏవిధముగనైన భేదముండును కనుక, నాయా క్షుద్రధర్మములన్నియు దొలగిపోగా, భేదోపాధి నశించుంగాన, నతనికీశ్వరావ్యయునితో నేకత్వము స్వయముగనే లభించును. ఈ యర్థమే యాశ్రుతి చెప్పుచున్నది. నామరూప విముక్తుడగు విద్వాంసుడు జీవపరావ్యయునందును, పిదప నీశ్వర పరావ్యయునందు నేకీభవించి సర్వైకీభావమువలన పరావ్యయ మాత్రుడగును. కనుక, నాశ్రుతింగొని పురుషుని పరాత్పరత్వముంగాని, పరాత్పరుని పురుషత్వముంగాని యాక్షేపించుట తగదు. ఇట్లు అసీమత్వ - ససీమత్వములచే పురుష - పరాత్పరులకు భేదము నెరుంగవలయును. ఇక :-

"మాయాబల రూపోప్రాధి పోగా, పరాత్పర - పురుషు లిర్వురకును భేదముండదు! అపుడు 'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" "నేహనానాస్తి కించన" అను నీ మొదలగు నద్వైత శ్రుతులకు దాత్పర్యము కుదురును గదా!" అనుచో నది వేరు విషయము. భేదముంజెప్పు శ్రుతులు వ్యావహారికావస్థల నుపపాదించునవి, అభేదముంజెప్పు శ్రుతులు పారమార్థిక భావముం జెప్పునవి, కాగా నా రెంటికి ప్రకరణ విషయ భేదముంబట్టి యవిరోధమేకదా!

## చితి సంబంధమువలన బురుషుడు సృష్టికి హేతువు

సర్వవిధబలములతోడి కూడికయన్నది పరాత్పరునకు బురుషునకును సమానమయినను, పురుషునందు చితి సంబంధముచే సర్వవిధబలములును పరస్పర సంబద్ధములగును. చయనము వలన బల సంపన్నమయిన రూపము జగత్సృష్టి

కధికారము వహించును. చితియే సృష్టి. ఒక బలముపై మరొక బలము చయనము కాగా, పరస్పర సంబంధాత్మకమగు, నారెంట్టి సంసర్గము బంధము, దానినే బలసంసృష్ట్యాత్మకము కనుక సంసృష్టి యందురు. ఆ సృష్టియందొక కేంద్రమున, బలముల యన్యోన్యబంధనము గ్రంధిరూపముం దాల్చును. అదే హృదయ గ్రంధి. హృదయగ్రంధి సంపాదనమే చయనము. బలమందు బలము చయనముకాగా, కల్గు హృదయ గ్రంధిచే బలముల పరస్పర బంధమువలన, పరస్పరముప సృష్టములగు వానియందు కలుగు నొకానొక యపూర్వరూపము, సృష్టి. దానినే విశ్వము. జగత్తు అందురు. మన కగపడు నీ వికారసంఘములెల్ల పెక్కు బలముల యొక్క బంధ రూపములగు సృష్టులని యెరుంగవలయును.

## సృష్టి - ప్రతిసృష్టి కారణ బల నిరుక్తి

(1) సంసర్జకములు (2) వ్యవచ్ఛేదకములు నని బలములు రెండు విధములు. ఇందు సంసర్జబల ముదయింవగనే స్వభావముగనే బలములు పరస్పర సంసర్గమునొంది సృష్టి నారంభించి యుత్తరోత్తర మధికాధికముగ గ్రంధి పై గ్రంధి నుత్పాదించి, క్రమముగ సూక్ష్మమునుండి స్థూల స్థూలరూపము గల్గించుటన్నది సృష్టి క్రమము.

ఆబంధమందేవ్యవచ్ఛేదకబల ముదయింపగా, క్రమముగ, నాబలములకు విడుమర ప్రారంభము కల్గును. హృదయ గ్రంధి విభేదనమువలన బలబంధ విమోక్షము, దాని వలన సృష్టి విచ్ఛేదము, అని యీ క్రమమున ప్రతిసంచర (ప్రళయ) ముపపన్నము కాగా, స్థూలమునుండి సూక్ష్మ సూక్ష్మరూపము సంపన్నమగుచుండును. ఈ ప్రతిసృష్టి (ప్రళయము) అన్నది (1) నిత్యా - (2) సాధ్యా యని రెండు విధములుగ గల్గుచుండును. స్వయముగ బ్రకృతివలన గల్గునది నిత్య. అందొకా నొకపుడు, తప్పక యీ యెల్ల సృష్టి రూపములకు విడమరకలు గగా మోక్షము కల్గుననుకొందము. కాని, యింతవరకు

మొత్తముగా సృష్టి విచ్ఛేదమయి పోయినట్లు తోచదు. ఈ సృష్టి కుద్బంధనము (విడుమర) అయిన వెంటనే అన్యములగు సంసర్జక బలములు స్వభావముగనే యుదయించుచుంగావున, సృష్టి క్రమము, ధారావాహికముగ ప్రవాహ రూపమున, నిత్యముగనే యుండును గదా!

చూడుడు :- పదివేల యేండ్లక్రిందట బుట్టియున్న వృక్ష విశేషము లిపుడెందును లేకపోవచ్చును. కాని నేడును పృధివిపై ననంత వృక్ష విశేషములు లేకున్నది కలదా? నిర్మూలములైనను వాని ప్రతినిధులు కలవుగలదా! ఇవిమాత్ర మెల్లకాల ముండగలవా? అట్లని ముందుముందెన్నడో చెట్టే పుట్టదనగలమా? ఇంతకును, సృష్టికి వలె పరివర్తన స్థితి మోక్షమునకును స్వభావసిద్ధమని యెంచుట తప్పు కాదనియే అనుకోదగినదని మనవి.

ఎన్నివేల యేండ్లనుండియో యున్న పూర్వకాలిక బలబంధము లన్నియు విముక్తములు కావచ్చును, వెంటవెంటనే సృష్టి హేతువులగు నితరములగు బలబంధములు నుండుచుండ వచ్చును. వాని యందును కొన్ని ముక్తము కావచ్చును. కొన్ని బంధనములు మరల బుట్టుచుండవచ్చును. ఇట్లు బంధవిముక్తి క్రమమన్నది, ధారావాహిక ప్రవాహమగు నీ సంసారమందెప్పుడు ననువర్తించుననియే యెరుంగదగును. ఇది ప్రళయమందలి నిత్యము నగుచుండు ప్రాకృతిక ముక్తి క్రమము.

ఇక సాధనవలనసాధ్యమగు ముక్తి క్రమమన్ననో, కర్మ పూర్తిగా నివృత్తి నొందుటవలననో, నిష్కామ కర్మవలననో విశుద్ధాత్మ జ్ఞానముగల విద్వాంసుడు, సర్వవిధ సుకృత దుష్కృత కర్మలను దాటి ముక్తి నొందునని జ్ఞానులు వక్కాణించుచున్నారు. దీనిని సాధ్యముక్తి యనదగును. ఇట్లు బంధ విముక్తి యన్నది రెండు విధములని యేర్పడినది. ఆ యీ రెండు విధములయిన సృష్టి క్రమముగాని ప్రతిసృష్టి క్రమముగాని, రసమందు, బలముల యన్యోన్య చయనము (చితి) వలన నేర్పడునని తెలియనగును. కానిండు, ముక్తి కాలమందు, ఆత్మకు;

## కర్మాత్యంత నివృత్తి

యన్నదేమో యించుక పరామర్శించుకొందము. రసమందు బలముల చితి సంబంధమువలన నేర్పడిన భావమునుగదా, పురుషుడనుకొంటిమి? మరియు, చితి సంబంధము నొందక, సహచర భావమున, నెల్లబలములును తేలుచు - మునుగుచు ఉండుచు లయించుచు, ఏ రసమునందుండునో, అట్టి బలవిశిష్ట రసము పరాత్పరుడనియు ననుకొంటిమి గదా! ఇట్టిచో, ముక్తి కాలమందు ఆత్మకు బలముల చితి సంబంధము వీడునే కాని, సహచర భావము కూడ వీడుననవచ్చునా?

కనుక, 'కృత్స్న కర్మ విప్ర మోక్షమే మోక్షమని కొందరు దార్శనికు లనుకొన్న మాట యందు విశ్వాసము కుదురకున్నది. అవ్యయాత్మ యన్ననో విద్యా - కర్మలు రెండును రూపముగాగలది కాగా జ్ఞాన కర్మాత్యంత నివృత్తి యన్నది యవైజ్ఞానికమగును గదా! అటుగాక

పుట్టుచు - లీనమగుచు నుండు క్రమమే రూపముగా గల బలములు ప్రవాహ నిత్యములే కనుక, హృదయ గ్రంధిని కలుగజేయు చితి సంబంధము వానికి లేకుండుటే మోక్షమని తాత్పర్య మనుకున్నచో బాధలేదు. ఏలయన, బలములేని రసము పపన్నమే కాదు. రసము లేని బలము నంతే. సదసత్తులు అమృత మృత్యువులు - నను పేరులుగల యీ రస - బలములు రెండు నొకదానిని విడచి యొకటి యుండవు. కనుక, హృదయ గ్రంధి భేదమువలన బల బంథములు మోక్షము నొందుటే మోక్షమనుకొనదగును. అందు నిషేధింపబడునది చితి సంబంధమే కాని సహచర భావ మెన్నడును గాదు. చితి సంబంధ సంబద్ధములగు బలముల కూడిక వలన పురుష రూపము సంభవించునట్లే, సహచర భావమున నుండు బలముల కూడిక వలన పరాత్పరరూప మేర్పడును. కాగా, సృష్టియన్నది బలచితి సంబంధముగల పురుషునకు జెందిన విషయమగుంగాని, కేవలము బల సహచర భావము మాత్రమేగల పరాత్పరుని యధికారమునకు జెందినది కాదనియు కనుకనే

అవ్యయపురుషుడు మొదలుగనే వేదము నందు సృష్టి ప్రక్రమణము కన్పట్టుచున్నదియు స్పష్టమగుచున్నది. ఇంతటితో

బ్రహ్మ యొక్క నాల్గుపాదములందును, పురము - పురుషుడు రెండు పాదములే జగత్తు - సంసారము అగుననియు, తదీయ నిస్తారార్థము విశ్వమునకు వెలిగానున్న పరాత్పర - నిర్విశేషములను రెండు పాదములు నగుననియు నెఱుంగదగినది. ప్రస్తుతమిది పరాత్పర పరిచయము ఇక -

## నిర్వి శేష నిరుక్తి

వంకకు మరలుదము :-

"బ్రహ్మణోహి ప్రతిష్ఠాహం, అమృత, స్యావ్యయస్య చ,
శాశ్వతస్యచధర్మస్య, సుఖస్యైకాంతి కస్యచ (గీత)

ఇందలి 'అహం' శబ్దమీశ్వరావ్యయుని జెప్పునది. చరాచరము లగు నాల్గు పాదములిందు నిర్దేశింప బడినవి. ఇందలి 'శాశ్వత ధర్మా' యన్నది పరాత్పరుడు. 'ఐకాంతికసుఖ' మన్నది నిర్విశేషు డానందమాత్రుడు:-

పుట్టుచు, ఉండుచు, లీనమగుచుండు బలముల సహచర భావముతో గూడినవాడు గదా పరాత్పరుడు. బలములన్న విఖండ ఖండాయమానములు ననంతములు నగును. రసము నాధారముగ గొనకున్న వానికి స్థితియుండదు, కనుక బలము లకు ప్రభవ, ప్రతిష్ఠా, పరాయణమయిన, బలోపహిత రసము, బలముకంటె వేరుగానుండునని భావింపబడుచో, నిర్విశేషుడందురు. అయితే.

ఇంత మాత్రమున బలముల రసము నుండి విడివడినట్లెన్నడు నెంచకూడదుసుడీ! ఏలయన, బలము కూడ అయుతసిద్ధమే గదా! కాని, పట్టువట్టి బుద్ధిచే బలముకంటె రసమును వేరుగా గ్రహింపవచ్చును. కాగా, సర్వవిశేష శూన్యమై స్వరూప మాత్రమున నుండు, నట్టిరసమును నిర్విశేషుడని యందురు.

పరాత్పరుని సర్వకర్మా - సర్వధర్మ - సర్వరస - సర్వగంధ - సర్వగుణ - సర్వశక్తి - యన్నట్లే, ఈ నిర్విశేషు నందుకు వ్యతిరేకముగా, నిష్కర్మక - నిర్ధర్మక - నీరస - నిర్గంధ - నిర్గుణ - నిరంజన - అదృశ్య - అగ్రాహ్య - నేతి నేతి యని యనుకొనదగును. పదములకు, శక్తి యున్నది, ఏకొంచమేని పదార్థ తావచ్ఛేదకావచ్ఛిన్న మందే కల్గును. నిర్ధర్మకమగు రసమునందే శబ్దమునకును జొరనైతిగాదు కనుక, సర్వవిశేష శూన్యుడగు నిర్విశేషుడనిర్వచనీయు డందురు; సత్తామాత్రముగా, సామాన్యముగ దెలియబడుగాక, అయినను విశేష రూపముగ నెట్లును దెలియ శక్యుడు కానందున, అవిజ్ఞేయుడందురు. మహర్షులును,

"సంవిదంతి నయంవేదా విష్ణుర్వేద నవావిదిః
యతోవాచో నివర్తన్తే అప్రాప్యమనసానహ॥
యస్యామతం, తస్యమమతం, మతంయస్య నవేదసః
అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాత మవిజానతాం ॥
నాహంమన్యే సువేదేతి నోనవేదేతి వేదచ,
యోనస్త ద్వేద తద్వేదనోనవేదేతి వేదచ ॥

అనుచున్నారు. ఏమైనను, ఈ విశ్వమందు, ఎఱుగదగిన పరమ సీమ పరాత్పరుడన్నది. "యద్జ్ఞాత్వా నేహభూయోఽన్యద్ జ్ఞాతవ్య మవశిష్యతే" (దాని నెఱింగిన నిటనిక దెలియదగినది లేదు) దాని నెఱింగి విదితవేదితవ్యులగుదురు. సర్వవిధ కల్యాణము నొందుదురు. నిశ్రేయసముంజూరగొందురు. ఇక నీ నిర్విశేషమన్నది దానికంటె బైనున్నది. ఆనందమాత్ర మనదగు రసమే, కాని నేవిధముగను విశేషముగ నెరుంగ శక్యము గానిది కనుక, నతి ప్రసంగము మానెదము. ఇది, నిర్విశేష - పరాత్పర - పురుష - పురములను నాల్గు పాదములుగల బ్రహ్మ యొక్క పరిచయము.

ప్రథమ ప్రసంగము సమాప్తము.

ఓన్నమః పురుషోత్తమాయ

గురవే మధుసూదనాయ

# శ్రీమద్బ్రహ్మ విజ్ఞాన పరిచయము

## ద్వితీయ ప్రసంగము

ఈ ప్రపంచమందు మనకగపడునదెల్ల బ్రహ్మ, కనుక విశ్వమంతయు బ్రహ్మాండము. "త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోఽ స్యేహాఽ భవత్పునః" అను శ్రుతి చొప్పున నాబ్రహ్మకు నాల్గు పాదములు (స్థితులు) (1) నిర్విశేషుడు (2) పరాత్పరుడు (3) పురుషుడు (4) షోడశి.

(1) నిర్విశేషుడు :- శుద్ధరసరూపము - అఖండము - నిర్ధర్మకము - సర్వాతీతము - నిర్గుణము - అవిజ్ఞేయము - అనిర్వచనీయము - విశ్వాతీతము.

(2) పరాత్పరుడు :- శుద్ధమనోరూపము - బలవిశిష్ట రసము, సఖండము, సర్వధర్మ లేక సర్వధర్మోప పన్నము - సగుణ లేక సర్వగుణము, సర్వజ్ఞము, సర్వవ్యాపి, సర్వశక్తి. ఆ యీ నిర్విశేష పరాత్పరు లిరువురును అసీములు - (అమితులు = హద్దులేనివారు)

### పురుషుడు

రసమందొక బలముపై మరొకబలము చితిగా నేర్పడగా సిద్ధమగు సావచ్ఛిన్నము (వేరుపడినది) అగు రూపమును పురుషుడందురు. ఈ పురుషుడు (1) అవ్యయ (2) అక్షర (3) క్షర యని మూడు విధములు. ఈ మూవురు వరుసగ పర - పరావర - అవర యనియు నందురు. వీరు వరుసగ జ్ఞాన - కర్మ-అర్థ స్వరూపులు, అనగా మన

మేవస్తువుంబట్టి చూచినను జ్ఞానము - క్రియ - అర్థము అను మూడు భాగములు గోచరించును. ఈ మూటికి మూలబీజము లీయవ్యయాక్షరక్షరులు. ఈ మూవుర మొత్తమే పురుషుడని యెరుంగవలయును. పురుషుడన 'త్రిపురుషైక పురుషు'డనుకొనవలెను.

నిర్విశేష- పరాత్పర - పురుషు లేకముగా నాత్మ యనుకొనుడు. కాని, పురుషునందలి క్షరాత్మయన్నది, రెండు భాగములు, అందొక భాగ మమృతమది జగత్తంతకు నుపాదాన కారణము. అదే ఆత్మ భాగము. మఱి, దానిపై (ముందు చెప్పనున్న) అయిదు చితులు క్రమముగా కల్గును. అవి యన్నియు రెండవ భాగమగు మర్త్యక్షరము. ఇది మర్త్యము కనుక నీ వికారక్షర పంచకము నాత్మయనక విగ్రహమందురు. విగ్రహముతోడి యాత్మ 'ఆత్మన్వీవిగ్రహ' మందురు. ఇదే 'షోడశీ' యన్న బ్రహ్మ యొక్క నాల్గవపాదము. ఇందు విగ్రహ భాగమగు క్షరుని యైదు కళలును, అక్షరుని యైదు కళలును అవ్యయుని యైదు కళలును, అసీమాత్మయగు పరాత్పరుని యొక కళయు నుండుంగావున్న, మొత్తముగ పదునారు కళలు గల దీనిని 'షోడశి' యనదగును. ఇందాత్మకళలు పదునొకండు విగ్రహపు కళ లైదునని తెలియబడుచున్నది.

## <u>అవ్యయ పురుషుడు</u>

పరాత్పరుడు శుద్ధ మనోరూపి యనుకొంటిమిగదా! అనగా, ఆ మనస్సునందలి బలము (క్రియాశక్తి) లు సహచర రూపమున రసము (జ్ఞానశక్తి) యందుండుటవలన దానికెట్టి పరిచ్ఛిన్న రూపమును గలుగకున్నప్పటి స్థితియని భావము. మఱి ఆ మనస్సునందే బలములు చితిరూపము నొంది పరస్పర సంబంధము నొందునపుడు, గ్రంథి రూప బలసృష్టి వెలసి యాబలము లన్యోఽన్య బద్ధములు కాగానే అందు సత్తారూపముగా రసము ప్రవిష్టమగును; కనుకనే శ్రుతియు "తత్ సృష్ట్వాతదేవాను ప్రావిశత్" "అది సృజించి అదే అనుప్రవేశము చేసెను" అనుచున్నది. ఇట్లు బలమందు ప్రవేశించిన మనస్సు అనగా, రసము బలముతో నేకముకాగా బలము యొక్క పరిచ్ఛేదముంబట్టి పరిచ్ఛిన్నముగా భాసిల్లు మనస్సును అవ్యయుడు పరుడు అందురు.

అట్టి యా మనస్సునందు, నియతముగా, అంతశ్చితి - బహిశ్చితి యని రెండు చితులేర్పడును. ఇందుచే నా మనస్సునకు, అంతశ్చితివలన విజ్ఞానము - ఆనందము నని రెండు విశేష స్వరూపములును, బహిశ్చితివలన, ప్రాణము - వాక్కు అను రెండు విశేష రూపములును నేర్పడగా, ఈ యానంద - విజ్ఞాన - మనః - ప్రాణ - వాక్కులను నైదు అవయవములతో, అనగా నీ యైదిటి మొత్తముతో అవ్యయ స్వరూపసిద్ధి యగుచున్నది. ఈ రూపము అవ్యయాక్షర క్షరులన్న మూవురు పురుషులం దుత్తమము కనుక అవ్యయుని, పురుషోత్తముడందురు. ఈ గీతావచనము నరయుడు.

"యస్మాత్ క్షరమతీతోఽహం, అక్షరాదపిచోత్తమః
ఆతోఽస్మి లోకేవేదేచ - ప్రథితః పురుషోత్తమః"

వాస్తవముగ నీ యవ్యయుడే ముఖ్యమగు నాత్మ. సంసార - నిస్తారము లీయనవలననే యగుచున్నవి. మనస్సు బహిశ్చితి వంకకు దిరుగునపుడవ్యయాత్మ ప్రాణ వాగ్భాగమును ప్రధానముగా గొనును. అపుడు విజ్ఞానానందములు రెండును, ప్రాణమునకు సహకారులగును. కాగా, ప్రపంచ పదార్థములెల్ల వివిధములుగ వెలయింపబడుచున్నది. కనుక పదార్థములన్నియు బ్రాణమయ వాక్కులు. వాని రచనయందలి, శిల్పకళ నవలోకింపుడు. పూర్ణ విజ్ఞానసంబంధము గోచరించుచు, నవియెల్ల నానందమయములుగ దోచుచుండును.

ఇక ఆ మనస్సే అంతశ్చితి వంకకు దిరుగునపుడా యవ్యయాత్మయే తన విజ్ఞానానంద భాగమును ప్రధానముగా గొని సంసార నిస్తారమున కారంభించును. విజ్ఞానానందములు పెరిగిన కొలదియు, ప్రాపంచిక భేదభావములన్నియు దుచ్ఛములుగా దోచుచుండును. యెల్లపదార్థములయందు నేకత్వము భాసింప మొదలిడును. చివరకై కాత్మ్యము సిద్ధించుటయు సంసారబంధములు తెగిపోగా, సంపూర్ణానందోపలబ్ధి యగుటతో, నా స్థితిని నిస్తారము - ముక్తి యందురు. ఇందు ప్రధానము లానంద విజ్ఞానములయినను, ప్రాణవాక్కులు కూడ వానికి సహకారులై యుండును, కనుక,

ప్రాణముయొక్క వ్యాపారముంబట్టి జగత్తునందలి యెల్ల వాఙ్మయ పదార్థముల విజ్ఞానానందములు ననుభూతికి వచ్చుచుండును. ఇట్లు, అవ్యయాత్మ = అనగా, వాస్తవముగ నపరిచ్ఛిన్న మనస్సు యొక్క యవస్థా విశేషమందు మాయాబలము ద్వారా, సోపాధికము, పరిచ్ఛిన్న రూపమునయిన మనస్సు, భిన్న భిన్న చితి కారణముగ జగత్తు యొక్క బంధమునకును, ముక్తికిని గూడ గారణమగుచున్నది కనుకనే మహర్షులు

"నదేహోనచ జీవాత్మా - నేంద్రియాణి పరంతప
మనఏవ మనుష్యాణాం - కారణం బంధమోక్షయోః"

"బంధ మోక్షములకు గారణము మనస్సే కాని, దేహము - జీవుడు - ఇంద్రియములు గాదు" అన్నారు.

## అక్షర పురుషుడు

అవ్యయ పురుషునందు నియమముగ నుండువాడక్షర పురుషుడు. ఇతడాయన ప్రాణభాగ మండగా గొనియుండును. కనుక ప్రాణమయుడు = ప్రాణ ప్రధానుడు అందుము. తప్పక కుర్వద్రూపి యగుటచే నితడేదోయొక క్రియ నిత్యమును జేయుచునేయుండును. క్రియా భేదములంబట్టి యితడు బ్రహ్మ విష్ణు - ఇంద్రయను ముత్తెఱగువాడు.

బ్రహ్మ ప్రాణమనగా - వస్తువును (దాని నుండి పదార్థము పోవుచు వచ్చుచున్నను) ఎప్పటియట్లు స్థిరముగా నుంచునది. అనగా, ఎచ్చోటినుండి ప్రతి క్షణమును, కొన్ని ధర్మములు పోవుచున్నను, కొన్ని ధర్మములు బాహ్యము నుండి వచ్చి చేరుచుండునో ఆ చోటును (ఆయతనమును) బ్రహ్మయందురు. దీపజ్వాలనుండి ప్రత్యేక పరమాణువులు ప్రతి క్షణమును పోవుచున్నను జ్వాలస్వరూపము, ఏకరూపమున, స్థిరముగనే యుండును గదా! ఆస్థిరతనే - ప్రతిష్ఠారసమునే బ్రహ్మ యందురు. సరే, కాని

ఇక నే ప్రాణశక్తి వలన వస్తువందలి ప్రతి పరమాణువును, ప్రతి క్షణమును బయటికి పోవుచున్నదో ఆ ప్రాణమును 'విక్షేపణ ప్రాణము' లేదా 'ఇంద్రుడు' అందురు. మఱి, యా విక్షేపణశక్తి వలన వస్తురూపమున కగు తగ్గుదల యగపడకుండ నే ప్రాణశక్తి, బయటి నుండి యన్నముందెచ్చి పెట్టి దాని లోపమును పూర్తి చేయుచున్నదో, దానిని 'యజ్ఞశక్తి' 'అన్నాదశక్తి' 'అశనాయా' 'ఆకర్షణ ప్రాణము' 'యజ్ఞవిష్ణువు' అందురు. ఈవిధముగా.

ప్రతి వస్తువునందును విక్షేపణ - అశనాకర్షణ - ప్రతిష్ఠ, అను మూడు ప్రాణములు కన్పట్టుచున్నవి. వీనినే వరుసగ ఇంద్ర - విష్ణు - బ్రహ్మ లందురు. ఇంద్రునివలన వస్తువునుండి పదార్థములు బయటికి బోవుచుండును. విష్ణువు వలన బయటి పదార్థములు వస్తువులోనికి వచ్చుచుండును. ఏ వస్తుస్వరూప స్థిరత్వసీమకు లోపల నీ రాకపోకలు జరుగుచుండునో, దేనివలన వస్తురూపము స్థిరముగ నుండునో, అది ప్రతిష్ఠాప్రాణము - బ్రహ్మ యందురు. ఈ మూడు ప్రాణములు లేని వస్తు వేదియు నుండదు.

విక్షేపణసేయు నింద్రుడు తన వెనువెంట బ్రహ్మను, విష్ణువును గూడ కొంతదూరమువరకాకర్షించును; కాని యా బ్రహ్మ - విష్ణుల యుత్సర్పణము (బైకి పోవుట) సమానము కాదు. బ్రహ్మ (స్థూలము కనుక) కొలదిదూరము పోయి నిల్చును. ఆ మేరనే 'మూర్తి' - 'శరీరము' అందురు. విష్ణుని యుత్సర్పణము మూడు విక్రమముల (అంగల)తో పూర్ణమగును కనుకనే విష్ణువును త్రివిక్రము డందురు. సరి. ఇంతకును దాత్పర్య మేమనగా:- హృదయ గ్రంధి రూపమగు, నాత్మ గ్రంధినుండి పరాక్రమణ మొనరించు నింద్రుడుత్పన్నము గావించు వషట్కార రూపమునకు, త్రివృత్ (9) పంచదశ (15) ఏకవింశ (21) త్రిణవ (27) త్రయత్రింశ (33) స్తోమములను నైదు భాగములగును. ఇందలి మొదటి మూడును విష్ణుని త్రివిక్రమములు. ఈ విక్రమములకు గారణ మింద్రుడు. శ్రుతియు "యస్మైవిష్ణుః త్రీణిపదావిచక్రమ ఉపమిత్రస్య ధర్మభిః" అనుచున్నది. కానిండు.

విష్ణుని మొదటి విక్రమము శరీరమువరకు, రెండవ విక్రమము అంతరిక్షము వరకు, మూడవ విక్రమము ద్యులోకము వరకు. ఈ మూడును లోకములందురు. ఇందు

మూడవ లోకమందు విష్ణు ప్రాణ మాకాశమునుండి సోమరసము నాకర్షణము - భోజనము సేయును. ఆ సోమాహుతినే యజ్ఞ మందురు.

మూర్తి - యజ్ఞమునను రెంటి కేంద్రమందు (హృదయ మందు) బ్రహ్మ - విష్ణు - ఇంద్ర ప్రాణములు మూడును 'అంతర్యామి' రూపమున నుందురు. ఇక, మూర్తి వరకు బ్రహ్మ యొక్కయు, యజ్ఞము వరకు విష్ణువు యొక్కయు స్వరూపములు. ఈ రెంటి నగ్నులందురు. ఇందు మూర్తికి జెందిన యగ్ని 'చిత్య' మనియు; 'మర్త్య' మనియు ; యజ్ఞమునకు జెందిన యగ్ని 'చితేనిధేయము' లేదా 'అమృతాగ్ని' యనియు నందురు. ఇట్లు అగ్నియను నాల్గవప్రాణ మేర్పడుచున్నది.

ఈ నాల్గవదగు ప్రాణాగ్ని, యాకాశము నల్గడలనుండి యాకర్షించు సోమరసమన్నదే అయిదవ ప్రాణము. విష్ణువు నాకర్షణమున నీ సోమరసము, లోనికివచ్చి హృదయము నుండి బయటికి బోవుచున్న బ్రహ్మరసమునందు లీనమై గట్టిదగు శరీరమును సృజించును. ఇందలి బ్రహ్మభాగమును మర్త్యాగ్ని యందురుగదా, అది శరీరము వరకే యుండును. అదే భూత సృష్టి గావించును. అనగా, శరీరమందలి భౌతిక ధాతువర్గములను సృజించును. మఱి, లోనికివచ్చిన సోమరసము బయటికి బోవుచున్న విష్ణురసమునందు లీనమై శరీరమునకు జెందిన నల్లని కాంతులను సృష్టించుచున్నది. అందు, విష్ణువు యొక్క యొక భాగము నమృతాగ్ని యందురు. అయ్యది విష్ణు = (ఏకవింశతి స్తోమ) పర్యంతముండును. ఇదే శరీరమందు దేవతాప్రచారమునకు గారణము. ఎల్ల యింద్రియ కార్యములు నీ దేవతా వర్గమువలన బుట్టుచున్నవి. ఇంతకును, బ్రహ్మ - విష్ణు - ఇంద్రులును బ్రహ్మ - విష్ణుల రూపాంతరములగు, అగ్ని - సోమములునను నీయైదును ప్రతి వస్తువునందును, ఏదోయొక పని (క్రియ) సేయుచుండు పంచాక్షరులనియు, యింకను విశదముగ, ఈ పంచావయవములుగల ప్రాణమే అక్షరపురుషుడందురనియు తాత్పర్యము.

## క్షరపురుషుడు

క్షరపురుషుడు నియమముగ నవ్యయపురుషుని వాగ్భాగమున నుండువాడు, కనుక వాఙ్మయుడు. వాక్ప్రధానుడు, ఇత డర్థస్వరూపి కనుక జ్ఞాన - క్రియలకు విషయమగును. అనగా, విజ్ఞానమందితడు ప్రవేశించుననియు, క్రియ యితని నాధారము గా గొనియుండుననియు భావము. అర్థమునకు (1) అమృతము (2) మర్త్యమునని రెండవస్థలు. ఇందమృతరూపముచే, నియమముగ క్షరు డవ్యయుని వాగ్భాగమున నుండును. అతని కెన్నడును వ్యభిచారము అనగా అవ్యయుని వీడియుండుటన్నది లేదు. కాని ఆయమృతక్షరుని రెండవ యవస్థయే మర్త్యరూపము. వాగ్వికారముంబట్టి, యవ్యయుని వాక్కుపై నుత్పన్నమగును. కొంత కాలమునకు బిదప నవ్యయుడు నియమముగా దీని విడిచివేయు చుండును. కొంత కాలమట్లు శుద్ధుడై మరల, తన యా యమృతక్షరమందు, నీటియందు నురుగు, పాల యందు మీగడ, ఇనుమునందు త్రుప్పువలె క్రమముగా, తన యందే వికార ముత్పన్నముగావించి, దానియం దతడావృత్తుడగును. (చుట్టుకొనబడును).

కొంతకాలమునకు బిదప మరల వికారమును వీడి శుద్ధుడైపోవుచుండును. ఇట్లవ్యయాత్మ వాగ్భాగమందలి యమృతక్షరము పై వికారస్వరూప మర్త్యక్షర ముదయించుట, కొంత కాలమునకది విడువబడుట, యన్న రెండు భావములు, అనాద్య నంతకాలముగ స్వభావసిద్ధములు. అవ్యయుని యీ స్వభావమే జగత్తు - సృష్టిమూలము. ఎట్లన :-

అవ్యయ వాగ్భాగమందుండు నమృతక్షరునిపై స్వభావముగ గల్గు వికారముల ద్వారా, 'చితు' లేర్పడుచుండును. ఆ చితులు (1) బీజచితి (2) దేవచితి (3) భూతచితి అని మూడు విధములు. ఇందు బీజచితి పుట్టుటకు క్షరాత్మయొక్క స్వభావమును, భూతచితికి దేవచితియు గారణములు.

## బీజచితి

విద్య - అవిద్య యన్నవి రెండు ముఖ్య బీజములు, మఱి యీ రెండును సమభాగములుగా, గలియుచో మూడవ బీజ మొకటి యుత్పన్నమగును. ఇట్లు బీజములు మూడు విధములగును. వీని యుత్పత్తి ప్రకార మెట్లన :- మనః - ప్రాణ - వాక్కులన్నవి మూడును, అవ్యయరూప జగత్తునకు సాక్షులు. ఇందు ప్రాణము కుర్వద్రూపము. అది మనోభాగము నధికముగా గొనుచో విద్యయనియు, వాగ్భాగము నధికముగా గొనుచో అవిద్యయనియు బేరొందును. మఱి యారెంటినది సమభాగములుగా గొనుచో సిద్ధమగు మూడవరూపముం గూడ నవిద్యయనియే యందురు. ఇట్లవిద్యకు రెండు భేదములురాగా, వానిని మూలావిద్య - తూలావిద్య యందురు. ఇందులో మూలావిద్యవలన బంధము, విద్యవలన ముక్తి, (బంధమోచనము) ఇక సమతాయోగమున వెలయు, తూలావిద్య వలన జగమందలి యెల్ల పదార్థములకు నా యా యవస్థాస్థితులును సిద్ధములగుచుండును. ఇట్లే మూడు భావములవలనను, సంసారోత్పత్తి స్థితిముక్తులు కల్గుంగాన నీ మూడును బీజములందురు ఇచ్చట గొందరీ క్రిందివిధముగా నందురు :-

"విద్యను బీజమనరాదది యాత్మకు స్వరూపము. దాని వలన నాత్మకు గ్రొత్తధర్మ మేదియు కలుగదు, అది యాత్మ నుండి యెన్నడును విడివడదు. ఏది ఆత్మనుండి కల్గి; జగత్సృష్టి గారణమై, ఆత్మనుండి వేర్పడగా ముక్తి సంభవమగు నయ్యది గదా బీజమనదగును? కనుక, విద్యను బీజచితియనక, అవిద్య - కామము - కర్మము అను నీ మూటిని బీజచితి యనదగును.

## అవిద్య

అవ్యయుని ప్రాణభాగముతో వాగ్భాగ మధికముగా గలియగా నేర్పడు స్థితినే యవిద్య యందురు. అవిద్య - అస్మిత - రాగ - ద్వేష - అభినివేశములని దాని కైదు పర్వములు. విద్యా రూపియగు నాత్మ కయ్యది స్వాభావిక వికారము. బాహ్య పదార్థముల

నది తనలో గలిపికొనుచుండును. అందువలన జ్ఞానమునకు (1) నిర్విషయకము (2) సవిషయకమునని రెండు రూపము లేర్పడును. ఇందు మొదటి దాత్మకు ముఖ్య రూపము, ఏకరసము. మఱి యదే, ఘట పటాది బాహ్యపదార్థములను లోగొనునపుడు సవిషయకమగుచు, విషయపరిచ్ఛేదముచే పరిచ్ఛిన్నమయిపోవుచున్నది. ఇట్లు జ్ఞానమందు విషయ ప్రవేశమగుటకు జెందిన శక్తినే యొక విధమగు బలమనియు అవిద్య యనియు నందురు.

## కామము

పై జెప్పబడిన యవిద్యాబలముచే జ్ఞానరూపియగు నాత్మయందు విషయరూపము ప్రవేశించి భాసించుటన్నదే కామము. ఏల యన, జ్ఞానమునకు వెనువెంటనే, ఆ విషయ భాగముతో గూడ ననుభవింపవలయునను నిచ్ఛ (ఆశనాయా - భోజనేచ్ఛ) కలుగ నారంభించును. జ్ఞానమందు విషయము ప్రవేశింపకున్నపుడు వస్తుజ్ఞాన మెట్లు? తదిచ్ఛ యెక్కడ? కనుక, జ్ఞానమందు విషయం సంస్కారముత్పన్నమైనపుడది వాసన రూపమున నుండును. పిదప విషయేచ్ఛ కల్గును. ఆయిచ్ఛనే కామమందురు. అది వాసనచే జనించునదగుటచే వాసనను కామమనియే యందురు. ఈ కామమవిద్యాజనితమై అవిద్యయందేయుండును. విద్యారూపియగు నాత్మపై అవిద్య యన్నది ప్రథమచితి, ఆ అవిద్యపై నీ కామమన్నది రెండవచితి. దీనివలననే యొక వస్తువు మరొక వస్తువుచే నాకృష్టమై కూడును ఆ యీ రెంటి మేళనముచే మూడవది వెలయును. కనుక కామమే సృష్టి కారణము. దాని నివృత్తిచే నాత్మ నిర్వికారము - శుద్ధము - ముక్తమునగును. కనుక నవిద్యతో దుల్యముగా గామమును, సృష్టి కారణము.

## కర్మ

ఆత్మ, విద్యారూపి, శుద్ధజ్ఞాన స్వరూపముగలది. క్రియకంటె భిన్నము కనుక నిష్క్రియము. అట్టిదాని నుండి యేవిధముగ నేని సృష్టి యెట్లు? కాని, ఆ

యాత్మయందవిద్యా బలప్రవేశము కాగా, నా విషయరూప కామసంయోగము వలన నాత్మయందిచ్ఛావృత్తి కలుగ నారంభించుటయు, నదే కర్మకు గారణమగును. ఇచ్ఛ - ఆకర్షణకలుగగా, ఆత్మయందు బాహ్య పదార్థ ప్రవేశము - సంసర్గము ప్రారంభమగును. అదే సృష్టి మూలము. భూమి యందలి వేడి, తడిసిన జలము, కరిగిన మట్టి, సూర్యుని వేడి, గాలిపాటు, మొదలగు బాహ్య పదార్థముల నొకబీజము లోగొని క్రియ నారంభించి, వాని సంసర్గము తన యాత్మను సంసృష్టము గావించుకొని, తన్నుండి అంకుర - పత్ర - పుష్పాది నానాభావములను వెలయించునట్లీశ్వరుని యవ్యయాత్మనుండి బాహ్యసృష్టి వెలయుచు - లయించుచున్నది. ఈశ్వర జ్ఞానమునందు వెలయు నాయా భావములను మనము జగత్తునందలి సత్తాసిద్ధ పదార్థములుగ నెంతుము. జీవా వ్యయునందాంతరికముగ నట్లే వెలయుచు - లయించు నాయా సృష్టులను, భాతి సిద్ధములందుము.

ఇట్లు విద్యారూపియగు నాత్మయందవిద్య - కామము - కర్మ యను మూడు చితులు కాగా, నది జగత్సృష్టి కారంభించుచున్నది. కనుక నీ మూటి మొత్తమును బీజచితి యనదగును. జ్ఞాన - విద్యారూపియగు నాత్మకిది యొక యావరణమగును. కనుక నిది దానికి బ్రథమ శరీరము. జగత్కారణమగు దీనిం గారణశరీరమనుటయు దగును.

## దేవచితి

పై జెప్పబడిన బీజచితింబట్టి ఆత్మ యొక్క క్షరభాగము భిన్న భిన్న పదార్థ క్షరభాగములతో గూడ, గూడనారంభించును. ఆ బాహ్యాక్షర భాగములు దేవ - భూత భేదమున రెండు విధములు. ఇందు సూక్ష్మతంబట్టి మొదట దేవత తోడను, పిదప స్థూల భూతములతోడను సంయోగము నొందును. ఇట, దేవ భూతభాగము లొకదానిని విడచి వేరొకటి యుండవు సరిగదా! మనకంతటను భూతములే గోచరించుచున్నవి. అయినను, కలసి మెలసి యుండువానియందు మొదట దేవతతోడను, పిదప భూతముతోడను మేళనము కల్గును.

మన నివాసస్థాన మీ పృథివి సూర్యప్రకాశ మండలాంతర్గతము. సూర్యుడును పరమేష్ఠి నామక సూర్యరశ్మి మండలాంతర్గతుడు. ఆ పరమేష్ఠియు బ్రజాపతి యనబడు బ్రహ్మ మండలాంతర్గతుడు బ్రహ్మయు, నొక యీశ్వరుని సచ్చిదానంద దివ్యమండలాంతర్గతుడు.

ఇట్లు, ఈశ్వరుడు (1) ప్రజాపతి (2) పరమేష్ఠి (3) సూర్యుడు (ఇంద్ర) (4) చంద్రుడు (5) అగ్ని (పృథ్వి) (6) మనుష్య శరీరము అను నీయారు ప్రతిష్టల యందంతర్గతమైన మన హృదయమందలి యాత్మ యొక్క క్షరభాగమా యారు ప్రతిష్టల రసములతో సర్వదా సంబంధము కల్గియుండును అనగా, నా యారింటిరసములకు మన క్షరాత్మయందు చయనము జరుగుచుండును. ఇందు దేశ - భూతచితులు రెండును వెనువెంటనే యగుచుండును కాని, ఈ రెంటిని దేవచితులే యందుము, ఏలయన:-

అవి యన్నియు సూక్ష్మములు, ఇందును, స్పష్టముగా, మన శరీరమందు వేర్వేరుగా బనిసేయుచున్నట్లగపడుచున్నవి. అగ్ని - వాయు - సూర్య - చంద్ర - దిక్కులన్న వయిదే. అన్ని కార్యములును వీని యధీనములే. అయినను, వాని యందు స్థూలముగా, పంచేంద్రియముల పనులే స్పష్టముగా గోచరించుచున్నవి. వానినే వరుసగ వాక్కు - ప్రాణము - చక్షువు - మనస్సు - శ్రోత్రము అందురు. ఈ యైదు దేవచితులే ముఖ్యములు.

ఇందలి, చంద్రుడు - దిక్కు - అను రెండును పరమేష్ఠి లోకమునుండి వచ్చుచున్నవి. మఱి, వానికి బైనున్న బ్రహ్మ ప్రజాపతి - ఈశ్వరుడు నను భాగములనుండి, వచ్చిన దేవతలు గావించు చితులు సూక్ష్మములగుటచే నిట వివరింప ననువుపడవు. కాని, బ్రహ్మ ప్రజాపతి లోకమునుండి నాల్గు వేదములును, ఈశ్వరునుండి సత్తా - చేతన - ఆనందములను మూడును, సర్వదా మన యాత్మకు జెందుచుండుననుకొన్న జాలును. ఈ రెండును దేవచితులే.

ఈ దేవచితులే, అనగా, పంచదేవతల కార్యములెల్లను యింకను విశదముగ, జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదు, శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములను

విషయము లైదు, మనోబుద్ధులు రెండు ననువాని మొత్తము పదునేడు తత్త్వములు నేకముగా లింగదేహము లేదా, సూక్ష్మశరీర మందురు. ఇది యాత్మకు రెండవ యావరణము. మరణకాలమందు ఆత్మ, తన మూడవ యావరణమయిన స్థూలశరీరమును వీడి వేరగును. కాని, సూక్ష్మశరీర కారణ శరీరములను రెండావరణములును ఆత్మ నంటియే యుండును. వాని విడువగల్గుటయే దానికి ముక్తి. ఆ దశయందీ రెండావరణలు వేరైపోవుంగాన వాని నాత్మస్వరూపము లనక శరీరములనియే యందురు. ఏనాటి కేని, ఆత్మ విడిచివేయగలదానినే శరీరమందురు కానిండు, ఇంతకు దేలిన దేమనగా:-

అవ్యయకళలైదు - అక్షరకళలైదు - క్షరకళలైదు - పరాత్పరుడొకటి, మొత్త మీ పదునారు కళలందును, అవ్యయుని కళ లైదును, అక్షరకళలందు బ్రహ్మ విష్ణు ఇంద్రులను మూడును క్షరునందలి యమృతభాగ మొకటి, మొత్తమీ తొమ్మిది కళలు నొకదానికొకటి వీడక యుండునవి, కనుక, 'హేయ ప్రత్యనీకములు' వీని నేకముగా, 'ఆత్మ', యనవలయును. ఇక మిగిలిన, అక్షరుని రెండు (అగ్ని - సోమ) కళలును, క్షరాత్మకు జెందిన వికారములైదును, (అనగా, బీజచితి, దేవచితి, భూతచితి - ప్రజా - విత్తములన్న వైదును) ఆత్మకు శరీరమందురు. ఇవి యాత్మనుండి వేరగుచుండు వ్యభిచారధర్మము గలవి, అనాత్మికములు గనుక వీని నాత్మస్వరూపముగా నెంచరు.

## <u>భూతచితి</u>

మన పృధివినుండి వచ్చు రసవిశేషము భూతచితి. భూమిపై వెలయు ప్రాణి మాత్రమునకు బృధివిమాత, ద్యోపితయని శ్రుతి చెప్పును. అనగా, నా రెండు రసముల మేళనమున, శరీరము వెలయునని భావము. ఇందు 'ద్యు' రసము దేవచితి, పైన జెప్పబడినది. ఇక, దానియందేకీభవించు, భూతచితి యనబడు, పృద్వీరసముం గూర్చి పరిచయము గలుగజేసికొందము.

భూతము లైదందురు కాని ప్రతి శరీరధారియు ననుభవించుచు. శరీరధారణ సేయ గల్గియుండుట కనువైన భూతములు, (1) మనస్సు (2) ప్రాణము (3) వాక్కు = ఆకాశము = శబ్దము (4) వాయువు (5) తేజస్సు (6) జలము (7) పృధ్వి యని యేడుగా నెఱుగవలయును.

(1) మనము గ్రహించుచున్న - జలములు పృధ్వీ - జలముల చితులు. (2) తాప ప్రకాశములంగోరుదు మది తేజశ్చితి. (3) మనము గావించు నుచ్ఛ్వాస - నిశ్వాసములు వాయు చితి (4) నిశ్శబ్దత భీతి గొల్పును. కనుక మనమేదో యొక శబ్దము వినగోరుదుము. అది వాక్చితి. (5) ఏదేని పని చేసి బలము సంపాదింపనెంతుము గాని యూరకుండ జాలమది ప్రాణచితి. (6) జ్ఞానేంద్రియముల ద్వారా సదా, యేమేని యెఱుంగగోరెదమది మనశ్చితి.

ఈ యేడు భూతచితులును మన జీవన మూలములు, ఇవి లేకున్న శరీరము నిల్వజాలదు కనుక దేవచితివలె భూత చితియు నావశ్యకమే. ఇందొక్కొక్కటియు మరల నేడేసి చితులగును. ఆ యన్నిటి నిట వర్ణించుచో విస్తరమగును. కనుక మచ్చునకొక యన్నచితిం జూతము :- అన్నము నుండి మొదట, రసము పిదప రక్తము - మాంసము, మేదస్సు - అస్థి మజ్జ - శుక్రము ననియిట్లు ఏడు ధాతువులు వెలయును. కాని, వాని యారంభఫక్కి :- దేవచితికి జెందిన ప్రాణముపై నన్నిటికంటె మొదట శుక్రచితియు, బిదప క్రమముగా, మజ్జాస్థి మేదోమాంస రుధిర రసత్వాచాలోమములు నన్నవేర్పడును. తక్కిన వానికి నిట్లే యేడేసి చితులేర్పడును. ఈ సప్తభూత చితులనే స్థూల శరీరమందురు. ఇది యాత్మకు మూడవ యావరణము. ఇట్లు మూడు చితులు కాగా, ఆత్మకు మూడావరణములు. ఇవే మూడు శరీరములు.

ఈ మూడు శరీరముల నాభి = హృదయము = కేంద్రమునందు ఆత్మ యుండును. ఆత్మయన:- అవ్యయాక్షర క్షరులను మూవురు పురుషుల యేక స్వరూపమయిన సూక్ష్మబిందువు. ఇది మూడు శరీరములకంటె వేరుగా వాని నాభి

యందున్నను, దాని శాసనము మూడు శరీరములకును బైటనున్న యేడవచితియగు చర్మమువరకును సాగుచున్నట్లు మన కనుభూతమగుచున్నది. కనుక సూర్యునికివలె నాత్మకును, హృదయమాదిగా సర్వాంగ శరీరమందంతటను వ్యాపించు కిరణములు కలవని తోచును. శృతియు "ఆలోమభ్యః - ఆనఖాగ్రేభ్యః" "రోమములవరకు - గోటి చివర వరకు నాత్మ వ్యాప్తి యుండు ననుచున్నది. కాని, వాస్తవమున కాత్మ కేవలము హృదయమందె యుండునని జ్ఞప్తి యందుంచుకొనదగును. కనుకనే గీతయందు

"ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా"

అని వక్కాణింపబడినది. ఇందువలన, హృదయమందుండు నాత్మ శాసనము స్థూలశరీర చర్మము వరకు సాగునన్నచో, కిరణములు లేకుండ సాగుటెట్లు? కనుక సూర్యునకు వలె నాత్మకు గిరణము లుండుననియే యెంచెదము, అయితే.

ఆత్మవగు నీ కిరణములందరి యందును సమానములుగ నుండునా? హెచ్చుతగ్గులుగ నుండునా? అన్నచో, ఎల్ల శరీరములందు నవ్యయాత్మ పరిమాణమునందు హెచ్చుతగ్గులున్నవి. కనుక అక్షర - క్షర మాత్రలందును హెచ్చు తగ్గులు కల్గుచుండును. ఇట్లు ప్రతి శరీరమందు నాత్మమాత్రలు సమానములు కాకుంటవలననే, కొందరు మనుష్యుల జ్ఞాన క్రియార్థ సంస్థలు ఎంతో అధికమాత్రలు కలవిగను, కొందరం దెంతో న్యూనముగను గన్పట్టుచున్నవి. ఒకడు పృథ్వినంతటిని శాసింపనేర్చును. ఒకడతని యుదరమునే తాను పోషించుకొనజాలడు. దీనింబట్టి ఆత్మ యొక్క హెచ్చుతగ్గులును - కిరణముల హెచ్చుతగ్గులు నుండునని తేలుచున్నది. దీపజ్వాలయొక్క ఆయతనపు హెచ్చుతగ్గులంబట్టి ప్రకాశమందు హెచ్చుతగ్గులేర్పడుచున్నవి కదా!

ఒక యాత్మ కిరణజ్యోతిమూడు శరీరముల వరకె వ్యాప్తమై సమాప్తమగుచో, నాయాత్మ తన భోగార్థము చాలిన పదార్థము నేని బయటి నుండి యార్జింపజాలదు.

అటుగాక, అధిక కిరణవ్యాప్తిగల యాత్మ బయటి మనుష్య పశు గృహ క్షేత్ర గ్రామ నగర దేశ మహాదేశముల వరకు బూర్ణ ప్రతాపము గల్గి శాసించి పాలింపగలదు. దీనిబట్టి యాత్మ కిరణవ్యాప్తి శరీరముం దాటియుండునని తేలుచున్నది.

ఆ యీ కిరణసంబంధ మణుభూతముగా, రెండు విధముల పదార్థములతో నగుచుండునని యెఱుక పడుచున్నది. ఒకటి :- ప్రాకృతిక సంబంధములుగల పదార్థములతో, అనగా, ఏ శరీరమునకు యోని సంబంధమును శోణిత సంబంధమును మొదటి నుండియు సిద్ధమైయుండునో, దానితో ఆత్మకు గల సంబంధము; ఆత్మ దుర్బలమైనప్పుడును సహజముగనే యుండును. చూడుడు, భార్యపుత్రాదులతో; మూడు శరీరములందు వలెనే వారియందును ప్రేమ యుండునుగదా! కనుకనే శరీరమట్లు వీరు నాత్మీయులే. వీరిని ప్రజలందురు. ఇక,

రెండవది, సంబంధ ద్వారము మొదట నేమియునుండదు. కేవలమాత్మ, తన కిరణముల బలముచే తనవశమునకుందెచ్చి కొన్న భృత్య - పృథ్వీ - గృహ - ధన - ధాన్యాదులతో నాత్మకుగల సంబంధము. ఇవియు నాత్మీయములే వీనిని 'విత్త' మందురు.

ఇట్లు, మూడాత్మలు (అవ్యయాక్షరక్షరులు) మఱి అయిదాత్మీయములు; అనగా, కారణ - సూక్ష్మ - స్థూల శరీరములు; ప్రజా - విత్తములు, ఇవి క్షరాత్మకు జెందిన వికారములు కనుక నాత్మీయములు. (ఆత్మలు కావు) కాని, ఆత్మ సంబంధముంబట్టి యీ యైదిటిని గూడ నపుడపుడాత్మ యనుచుందురు. జ్వాలయే దీపమయినను తదాధారములగు బుడ్డి పత్తీ మొదలగువానింగూర్చి దీపమనుచుందురు గదా! "ఏతావాన్ ఖలువై పురుషః యావదశ్యవిత్తం"

## <u>షోడశీ</u>

ఇంతటితో బురుషవర్ణనమైనది. మున్ను <u>నిర్విశేషరసముగా</u> జెప్పిన దానియందు బలముదయింపగా, రసబలము లేకమై ఎంతగా బ్రహ్మకు వైకారిక స్వరూపముగ

నేర్పడుటకు వీలగునో, అది పురుషునితో ముగిసినది. అనగా, పరాత్పర - అవ్యయ - అక్షరక్షరములను నాల్గును బ్రహ్మ వివర్తములకు జెందిన కక్షలు (తరగతులు). ఈ నాల్గు స్వరూపములతో - అవస్థలతో బ్రహ్మ యెల్లడల నుపలబ్ధమగుచున్నది. జగమందన్ని స్వరూపములును, ఈ నాల్గు స్వరూపములతో నేర్పడినవే. ఏ వస్తువుంగొని పరిశీలించినను ఈ నాల్గింటిని మించి మరొకటి యగుపడదు కనుక నివి యెల్ల పదార్థముల కారంభణములు - ఉపాదానములగు తత్వము లనవచ్చును.

ఇక వేనింబరిశీలించిన యా నాల్గ తత్వములును వేర్వేరుగ మనకుపలబ్ధములగునో, అట్టి పదార్థములం గూర్చి అరయుదము. ఇంతకుమున్ను వర్ణింపబడిన మూవురు పురుషులు నొకరినొకరు విడచియుండనివారు, పరస్పర మాశ్రయాశ్రయి భావము గలవారు నగుదురు. అనగా, నొకరినొక రాలంబనముగా గొనుచుందురు. చూడుడు - క్షరున కక్షరుడు నతని కవ్యయుడు నాలంబనములు కదా! కాని, అవ్యయునకును పరాత్పరు డాలంబనము. కనుక నితడు సర్వాలంబన మనదగును. శ్రుతియు:-

"ఏతదాలంబనంశ్రేష్ఠ మేతదాలంబనంపరం
ఏతదాలంబనంజ్ఞాత్వా యో యదిచ్ఛతితస్యతత్" అన్నది.

ఈ శ్రుతి యాత్మ వర్ణనావసరమున జెప్పినది. కాని, శాస్త్రములందాత్మయన, నొకచో క్షరుడనియు నొకచో నక్షరుడనియు నొకచో నవ్యయుడనియు గన్పట్టినను, అవ్యయుడును పరాత్పరాలంబనముననే యగపడుంగాన, నా పరాత్మరుడే సర్వాత్మలకును ముఖ్యాత్మ. సర్వమునకు బరుడునగును. కనుక, "శ్రుతియందు ఓంకారమాత్మయని వర్ణితమయినది అది అవ్యయపురుషుని నామము. అవ్యయాత్మాభిప్రాయముంగొనియే, యాశ్రుతి వెలసియుండవచ్చును." అనుకొన్నను, ఆ యవ్యయ మహాత్మ్య మా పరాత్పరునింబట్టియే యనుట యుచితము. పరాత్పరుడు లేని యవ్యయుడుండుట యెచట? కనుక పరాత్పరస్థితిని లక్ష్యముగా గొన్నపుడే అవ్యయుని యా మహిమ. కానిండు.

ఇంతకు, ఆ యీ నాల్గు తత్త్వములు సర్వదా సర్వత్ర యేకముగా నుండుననియే తాత్పర్యము. ఇందన్నిటికంటె ముందు మన దృష్టికి క్షరపురుషుడగపడును. అతనికి లోపల నక్షరుడు, తదంతరమందవ్యయుడు, అన్నిటిలోపల పరాత్పరుని యత్యంత సూక్ష్మరూపము. ఇదే యన్నిటికిని ముఖ్యాత్మ. దీనింబట్టియే, అవ్యయాక్షరాదులు శాస్త్రములందాత్మలుగా వర్ణింపబడిరి.

ఇట్లీ నాల్గుతత్త్వముల కూడికచే జగమందలి యెల్ల వస్తువులను భిన్న భిన్న రూపములతో సిద్ధములగుచున్నవి. నగరము - గృహము - మనుజుడు - ముత్యము ఇత్యాదులందొక్కొక్కటియు నొక్కొక్కటిగనే మన మనుకొందుముగాని పరిశీలించుచో, ఇందు ప్రతి యొకటియు ననేక తత్వముల కూటము. వైజ్ఞానిక పరిభాషంబట్టి ప్రతి వస్తువునందును పదునారు పదార్థము లుపలబ్ధములగును. కనుక, ప్రతి వస్తువును, షోడశీ యందురు. శ్రుతియు :-

"షోడశకలంవా ఇదం సర్వం" "షోడశకలోవైపురుషః" అనుచున్నది. ఆ యీ షోడశకళల పరిచయ మించుక, పిమ్మట జూతము.

ప్రస్తుతము :- మన మేవస్తువుం గనుగొన్నను, కేవలము వికారములే గోచరించును (భాసించును) అనగా, వికృతి - పరివర్తనము కాలధర్మమునొందని వస్తువేదియు లేదు. కనుక వికారమయమగు దానిని 'క్షర' మనవచ్చును. కాని, యావికారములను సూక్ష్మదృష్టినరయుచో వానియందవాంతర భేదములు కొన్ని గోచరించును అనగా, నీ వికారములను మొదట (1) భాతిసిద్ధములు (2) సత్తాసిద్ధములునని రెండు భాగము లనవచ్చును.

(1) వస్తువునందు గోచరింపక, బుద్ధియందుమాత్ర మాగుణములు వస్తువునందున్నవిగా నంగీకృతములగునవి బుద్ధి సాక్షికములగుటవలన భాతి సిద్ధములని వాకొనబడును. అవి పది. వానికి అస్తిత్వమున్నది కాని, ప్రత్యేకాస్తిత్వము లేదు. అనగా వేరుగా గోచరింపవు.

(1) దిక్కు = ప్రతి వస్తువునందును దీనితో సంబంధమున్నది. ఎల్లవస్తువులు నొక్కొక్కటియు, తన కన్యముంబట్టి, తూర్పు - పడమర - దక్షిణము - ఉత్తరము - క్రింద - మీద - అగుచుండును.

(2) దేశము :- దేశము = ఆయతనము, ప్రతి వస్తువునకును నియతధర్మము. ప్రతి వస్తువునకు నొక సీమ (ప్రదేశము) యుండును. వస్తువు నస్తిత్వ మా సీమలోపలనే కాని దానికి బయట నుండదు.

(3) కాలము :- ఏ వస్తువునకేని కాలనియతి యుండును, అంతకు బూర్వమందుగాని పరమందుగాని వస్తువుండదు.

(4) సంఖ్య :- వ్యక్తి యొక్క పృధక్త్వముంబట్టి ప్రతి వస్తువు నందిది యుత్పన్నము కాక తప్పదు.

(5) పరిమాణము :- అణుత్వ - మహత్వ - హ్రస్వత్వ - దీర్ఘత్వములను పరిమాణములు, వస్తువునంద పేక్షాకృతములుగ నుండును.

(6) పృధక్తవము :- (ప్ర)దేశ భేధముంబట్టి వస్తువులందన్యోన్యము వేర్పాటుండు చుండునదే పృధక్త్వము.

(7) సంయోగము :- అవయవ సన్నివేశమునే సంయోగ మందురు.

(8) విభాగము :- సంయోగనాశమునే విభాగమందురు.

(9) పరత్వము :- ఒక వస్తువుకంటె నొకవస్తువు దూరముగ నుండుట.

(10) అపరత్వము :- వస్తువుకు మరొకవస్తువు దగ్గరగా నుండుట.

ఇందు క్రిందివి రెండు నపేక్షాకృతములుగ ప్రతి వస్తువునందును దప్పక యుండుచుండును. ఈ గుణములెల్ల నిట్టివని నిర్ణయము సేయ నలవికానివి. కాని, ఆ బాలవృద్ధ మందరకు నివి వానియంత నవే హృద్గతములగును. కనుక నివి యున్నవనక తప్పదు. ఈ పది

గుణములును సనిరూపకములు = రెండవ వాని యపేక్షంబట్టి సిద్ధములగుచుండును. కనుక నాపేక్షికములు. ప్రాతిభాసికములు కనుక నివి భాతిసిద్ధములు. పరివర్తన శీలములగుట వలన నివి వికారములు.

(2) ఇక సత్తాసిద్ధములగు వికారముల నరయుదము. వస్తువునందు వీనికి అస్తిత్వము (ఉనికి) యున్నది. ఒక వస్తువు నందివి వేర్వేరు వస్తువులనుండి చేరును. ఇవి (1) ప్రతికూలములు (2) సాధారణములు (3) అనుకూలములు నని మూడు విధములు. ఇందు :-

(1) మనుష్య శరీరమందుగాని, యేదేని యితర వస్తువునందుగాని, ప్రవేశించి దాని స్వరూపమును వికృతము (లేదా నష్టము) గావించు ధర్మములు (లేదా గుణములు) ఆత్మ విరోధులు కనుక ప్రతికూలములు. వికృత వాయువుల - ఉష్ణములు శరీరమున ప్రవేశించి రోగముల నుత్పాదించును. ప్రజ్ఞా పరాధమువలన జేయు మిధ్యాహార విహారాదులిట్టివే కొలదియో, గొప్పయో, యీ ప్రతికూల ధర్మములు ప్రతి వస్తువు నందు నపుడపు డుండిపోవుచుండును. కనుక వికారములు.

(3) సాధారణములు :- వీని ప్రవేశమువలన శరీరమునకు గాని యాత్మకు గాని యెట్టి హానియు నుండదు. ఇవి యుదాసీనములు. కాని, శరీరమందు వీనికి బరివర్తన ముండుచుండును గాన వికారములు. సామాన్య శీతోష్ణ వాయ్వాదులిందుజేరును.

ఈ చెప్పబడిన రెండు ధర్మములును శరీరమున బ్రవేశించినను వీనినాత్మ గ్రహింపదు. కనుక నివి యనాత్మికములు. దోషములు అందురు. ఇందు మొదటి దోషములు విరోధ్యుపసర్గములు. రెండవవి సాధారణోపసర్గములు నందురు. ఇక :-

(3) అనుకూలములు :- వీనినాత్మ ప్రవేశించిన వెంటనే యంగీకరించును. భుజింపబడిన హితమితాన్నాదు లిందుజేరును. ఒక శేరు బియ్యపు మూట మోయుటకు బరువుగా దోచును, ఏమి? అది అనాత్మికము - దోషము కనుక నట్లు తోచును, కాని, ఆ

బియ్యమే అన్నముగావండి తినుచో నది యాత సాత్కృతమై యాత్మభాగమై - బరువుగా దోపదుకదా! సరియే,

శరీరము పుష్టమయినకొలదియు నది బరువు దోచుగదా, యన్నచో నది యన్న భాగము కాదు. అన్న పరిపాకము వలన గల్గిన శారీరక మాంసపుబరువు; అది వేరు వస్తువు. కానిండు, భోజనానంతరమందు దోచు తృప్తియు నన్నపు బరువు కాదది శరీరమునకు జెందిన లాఘవము (తేలికదనము), ఆత్మ గుణము అన్న మాత్మికమగుట వలన దోచునది తృప్తి.

నేటి క్రొత్త వైజ్ఞానికులు కొంద రాత్మయందును గొంచెము భారమున్నదనుకొనుచున్నా రది భ్రమ. వాస్తవమున కాత్మయందు బరువన్నది లేదు బరువుగ దోచున దాత్మయే కాదని ఘంటాపథముగా జెప్పెదము. ఆత్మ భారమే యంత్రమేని కనుగొనజాలదు. వాయువు నందలి బరువును, తదీయాంశిక యోగమున నాత్మదేయనుకొని, వాయువు నాత్మగనెంచు వైజ్ఞానికులు కొందరు భావించుటయు గేవలము భ్రమయే. భౌతికమగు వాయువునకు బరువుండుట తప్పదు. భౌతిక పదార్థములకంటె వేరుగనుండు నాత్మకు బరువెట్లు?

పృథివ్యాకర్షణగదా బరువన్నది? అది భౌతిక వస్తువులకే చెల్లును. ఆత్మయో అసంగము. దానిపై దేని యాకర్షణయు సాగదు. కనుక నాత్మయందు బరువుండదు. సరిగదా, భారము గలవస్తువేదైనను, ఆత్మ నెంతెంతగా గ్రహించునో, స్వీకరించునో, అంతంతగా నది లాఘవము నొందుచుండునని గ్రహింపవలెను.

ఈ మానవ శరీరమందు ఆత్మికములు :- అనాత్మికములు నగు రెండు విధముల పదార్థముల కూటమి కలదు. ఇందనాత్మిక పదార్థముల బరువే శరీరభారముగా దోచును. అవి యెంతగా పెరిగిన శరీరమంత బరువెక్కువ. అటుగాక, ఆత్మసంబంధ మెంతగా పెరిగిన నంతగా శారీరక లాఘవమనుభవమునకు వచ్చు చుండును. స్ఫూర్తి యధికమగుచుండును.

ఈ వస్తువులతో నాత్మకగు సంబంధము యోగము - విభూతి యని రెండు విధములు. వీని విశేషవర్ణన గీతయందు కలదు. ఈ రెండు సంబంధములును, భౌతిక వస్తువుల స్వరూప సంఘటన తారతమ్యము వలననే ప్రతీతి నొందుచుండును. ఇక నాత్మయన్ననో, స్వయముగా నిష్క్రియము - అసంగము - నిర్వికారము - తారతమ్య శూన్యము కనుక, నేవస్తువు తోడను, యోగమును - విభూతిని నెఱపబోదు. ఆ యీ సంబంధ విచారణ మఱొకచో జూతము. ప్రస్తుతము :- భుజింపబడిన యన్నమాత్మసాత్కృతము కాగా, భార విహీనమై పోవు ననుకొన్న జాలును.

మన శరీరమందీయన్న మేడు విధములు. (1) పృధివి (2) జలము (3) తేజము (4) వాయువు (5) శబ్దము (6) బలము (7) జ్ఞానము. కాని,

"యత్ సప్తాన్నాని మేధయా తపసాజనయత్పితా,
ఏకమస్య సాధారణం - ద్వేదేవానభాజయత్

త్రీణ్యాత్మనేఽ కురుత పశుభ్యఏకంప్రాయచ్ఛత్
తస్మిన్సర్వం ప్రతిష్ఠితం యచ్చ ప్రాణితియచ్చన

కస్మాత్తానినక్షీయన్తేఽ ద్యమానాని సర్వదా
యోవై తామక్షితింవేద - సోఽన్నమత్తిప్రతీకేన
సదేవానపిగచ్ఛతి సఊర్జముపజీవతి"

అని యిట్లుపనిషత్తు ప్రాణిభేదముంబట్టి యేడన్నముల విభాగముం జూపియున్నది. ఇందు, సాధారణమున, ప్రాణులన్నియుదినును, బియ్యము - యవలు - గోధములు మొదలగునవని భావము. ఇట్లు, హుతము - ప్రహుతము నను రెండు దేవతల యన్నములు. హోమమును హుతమనియు బలిహరణమును ప్రహుతమనియు నందురు. మనస్సు - ప్రాణము - వాక్కు నన్నవి ఆత్మకు చెందిన యన్నములు. ఎల్ల యాత్మలును వాఙ్మయములు - ప్రాణమయములు - మనోమయములు. పశువులకు పాలే యొక యన్నము.

ఇట్లు బృహదారణ్యకము చెప్పుట, ప్రాణిభేదముంబట్టి కూడ నేడన్నములను జూపుటకే కాని, యింత మాత్రమున, నొక ప్రాణి కేడన్నములతో బనిలేదని యనుకొనరాదు. ఇది లోక సిద్ధ ప్రత్యక్ష విషయము. చూడుడు:- భోక్ష్య - భోజ్య - చోష్య - లేహ్యములన్న నాలుగు విధముల పిండగ్రాసము పృధివికి జెందిన యన్నము. (1) జలమన్నది ప్రసిద్ధమేకదా (2) సూర్యాదిప్రకాశ - తాపములు తేజోఽన్నము! (3) వాయు సేవనము (4) శబ్దశ్రవణము గూడ మన కావశ్యకములే (5) శ్రమించి యలసత నొందినపిదప వాయువు నుండి ప్రాణమాత్రలు రాగా, లభించు బలమొక యన్నము, (6) శిక్షణోపదేశమువలననో, ఇంద్రియముల వలననో లభించు జ్ఞానమొక యన్నము. (7) ఈ సప్త ప్రకారాన్నములును ప్రత్యక్ష సిద్ధములు. శ్రుతితాత్పర్యము వీనింగూర్చి కావచ్చును. ఏలయన :- ప్రతిప్రాణి శరీరమందును (1) ఆత్మ భాగము (2) దేవభాగము (3) పశుభాగము నని మూడు భాగములుండుటన్నది, విజ్ఞాన వినిశ్చిత విషయము ఎట్లన :-

బయటికి భూతమయ జడభాగముగా మన కగపడునది పశువు. పరాధీనము పశువుగదా! శరీరమందలి భూతభాగము దేవభాగమున కధీనము కనుక పశువు. చర్మ - శోణిత - మాంస - మేదోఽస్థి - మజ్జా - శుక్రములెల్ల పశువులు. వీనియందు వీనిని సంచాలన మొనర్చునది దేవభాగము. ఇట్లు భూతచితి - దేవచితులు రెండును ఆత్మ యాధారముగా గలవి, వీనికాలంబన మాత్మ. ఆత్మానాశ్రయమున నివి నిల్చి యున్నవి. కాని,

ఈ మూడు భాగములే యజ్ఞరూపములు. అనగా, అన్నాహుతినొందినవే వీని సత్త యుండును. కనుక నీ మూడు భాగములకును, వేర్వేరుగ నన్నములను శ్రుతి చూపియున్నది.

అందు :- మనః - ప్రాణ - వాక్కులన జ్ఞాన - బల - శబ్దములని భావము. ఇవి మూడు నాత్మాన్నములు, అనగా సాక్షాత్తుగ నాత్మయందు బ్రవిష్టములగునవి. వాయు - తేజములు రెండును దేవభాగాన్నములు. వీనినొంది శరీరమందలి దేవతలు పుష్టిగాంతురు.

పృధ్వీ = స్థూలాన్నమువలన శరీరమందలి భూతభాగమగు మాంసాస్థ్యాదులు (పశువులన్నవి) పుష్టినొందును. జలమీ యన్ని భాగములకును సాధారణాన్నము (General Food ) మూడు భాగములు స్థితియు దీనిపై నాధారపడియున్నది. ఇదే శ్రుతి యభిప్రాయము.

ఈ సప్తాన్నములద్వారా బయటి నుండి శరీరమందు ప్రవేశించిన సామగ్రి నాత్మ స్వీకరించుకొనుచో నది యాత్మికమై పోవును. ఆత్మయందొకానొక విశేష సంబంధము నొంది యది యాత్మమయమయిపోయి యాత్మకు విగ్రహము నాబడును. ఆ సప్తాన్నములును ఆత్మావయవములంగొని యొక భిన్న ప్రకార వికారముల నుత్పన్నములు గావింప నారంభించును. ఆ వికారములెల్ల నాత్మ కనుకూలములు, శరీరము యొక్కయు, ఆత్మయొక్కయు, స్థితికి సహాయకములునగును. కనుక వీనిం దోషములనక ధాతువులందురు. మనస్సు-ఓజస్సు- శుక్రము - మజ్జ - అస్థి - మేధస్సు - మాంసము - శోణితము, హరితపీతరసము, త్వక్కు, అనునీ పదియు శరీర ధాతువులు. కఫ - వాత - పిత్తములను నీ మూడు నుప ధాతువులు. ఇట్లే వృక్షాదులగు నుద్భిజ్జ, జీవులందు, ముత్యము మొదలగు ఖనిజ జీవులందును వేర్వేరు విధములగు ధాతు వికారము లగపడుచుండును. ఆ యీ వికారములెల్ల నన్నము వలన గల్గునవి. అన్నములు శరీరమునకు వెలుపలనుండి ప్రవేశించునవే అయినను శరీరాధిష్ఠాతయగు నాత్మ వానిని వెంటనే స్వీకరించుకొనును, నియంత్రితముల గావించును, వానితో నది తన వికారముల నుత్పన్నముల గావించును. కనుక నీ యాత్మిక వికారముల నుపయమములందురు.

ఈ యుపయమములు (1) భూత ధాతూపయమము (2) చేతన ధాతూపయమము నని రెండు విధములు. ఇందు మొదటి దాని నుండి రక్త - మాంసాస్థ్యాదులును, రెండవదాని నుండి ఇంద్రియాదులును గ్రహింపబడును. పిదప మఱి యెరుంగదగినవి (1) ప్రవర్గ్యోపజనములు (2) మూలోపజనములు నను రెండు పదార్థములు. (1) భ్రూణ - సృమ రాదులు ప్రవర్గ్యోపజనములు (2) అవిద్యా - కామ - కర్మలు మూలోపజనములు.

ఇట్లు :- భావికములు (అనుకూలములు) విరోధులు (ప్రతికూలములు) - సాధారణములు నను మూడు వికారములు, రెండు విధముల యుపజనములు, రెండతెఱగుల యుపయమములు నను నీ యన్నిటి సమష్టితో, చరాచర వస్తు నిర్మాణము జరుగుచున్నది. గ్రంధ విస్తరమగునని వీనిని సూక్ష్మముగా సూచించితిమి. కానిండు,

వస్తువన్నదెల్ల షోడశి, అనగా పదునారు కళలుగలది యనివ్యవహారము. దేనింగన్నను (పరిశీలించినను) పదునారవయవములు తోచును. ఎట్లన:- ప్రజా - విత్తములు - స్థూల (భూతచితి) సూక్ష్మ (దేవచితి) కారణ (బీజచితి) అనునైదును క్షర విభాగమునకు జెందిన పదార్థములు. మనకు దఱచుగ నగపడునవివే. వీని యంతర్గతములగు పంచకళలు సోమ - అగ్ని - ఇంద్ర - విష్ణు - బ్రహ్మ లన్నవి అక్షర విభాగమునకు జెందిన పదార్థములు. ఇక వీనికి నంతర్గతములు, వాక్ప్రాణ మనోవిజ్ఞానానందములన్న అవ్యయ పంచకళలు. ఆ యీ మూటిమొత్తము పదునైదు కళలకు, ఉదయ - స్థితి - లయముల కాధారమయిన పదునారవకళ 'పరాత్పరుడు' ఈ కళ చంద్రుని పదునారవకళయగు నప్రకాశమండలము వంటిది. అతని తక్కిన పదునైదు కళలు పుట్టి యుండి, లయించుట కాధారమా యప్రకాశమేగదా!

పరాత్పరమండలము జగదతీతము, (బాహిరము) అది యసీమముగదా! ఈ పదునారు కళల మొత్తము షోడశి. జగత్తునందలి ప్రతియొక పదార్థమును షోడశియని యెరుంగనగును. ఇందు పరాత్పర కళ గాక తక్కిన పదునైదు కళల మొత్తమును 'విగ్రహ' మందురు. వేరు, కానున్న వాని కూడిక 'విగ్రహము' లేదా కలసియున్న వాని వేర్పాటు 'విగ్రహము'. ఈ పదునైదు కళలు భిన్న భిన్న పురుషులకు జెందినవై యొకచో గూడినవి. జ్ఞానము ద్వారా వీని విభాగము సేయుటన్నది సంభవమే. కలసియున్నపుడు నొక సముదాయమునందలి విభిన్నార్థములను గ్రహింప (జ్ఞానమున తెలియ) వచ్చును. కనుక పదునైదుకళల మొత్తము విగ్రహమందురు.

వి = విభిన్న; గృహ = గ్రహణము, జ్ఞానము, భగవంతుని గూర్చి 'భక్తానుగ్రహవిగ్రః' అనుట కలదు. దీనికి భక్తులయందలి యనుగ్రహముంబట్టి శరీరమును ధరించు పరమేశ్వరుడని యర్థముగదా! అనుచో, జగత్తున కతీత పదార్థమగు పరాత్పరుడు - పరమేశ్వరుడు వివిధ కళలను గ్రహించి జగద్రూపముగ వచ్చునపుడు, అనగా, సంసారాతీతుడు లేక అసంసారియగు పరాత్పరాత్మ సంసారియగునపుడు దేనిద్వారా, ఆ కార్యము జరుగునో, ఆ భాగము విగ్రహమందురు. ఆయీ షోడశి (1) పరమేశ్వరుడు (2) ఈశ్వరుడు (3) జీవుడు నని మూడు విధములు. ఇందు,

## పరమేశ్వరుడు

అనగా, అసీమషోడశిపేరు. ఇతని యందు స్వతంత్రరూపముగా షోడశకళలు లేకున్నను, షోడశకళలు గల ఈశ్వరుడు - జీవులు నను సర్వపదార్థ సముదాయమగుట వలన, భిన్న భిన్నములగు నాయన్నిటి షోడశకళలు నుపలబ్ధములగుచున్నవి. కనుక, నాయా యీశ్వర - జీవ - పదార్థముల షోడశకళలంబట్టి యితనింగూడ షోడశి యనవచ్చును. ఇతడసీముడగుట వలన నాభి - కేంద్రములేనివాడు. అనంతులగు నీశ్వరులకు, అనంతా నంతులగు జీవులకు సముచ్చయమగుటచే ఈశ్వరుడనిగాని జీవుడని గాని చెప్పనయితిగాని వాడు, ఏలయన - జీవేశ్వరు లిరువురును బరిచ్ఛిన్నులు, ఇతడపరిచ్ఛిన్నుడు కనుక నితని వారి కంటె వేరుగా పరమేశ్వరుడందురు. ఇతడేకము = ఒకడే.

జీవులు - నీశ్వరులు ననంతులయినట్లు పరమేశ్వరుడు ననంతుడే. కాని, భేదమెందన, సీమాబద్ధులగుట వలన జీవేశ్వరులిరువురును దైశికానంతులు గారు, ఉత్పత్తి మాత్రులు నాశవంతులు నగుట వలన కాలికానంతులునుగారు. కాని సంఖ్యచే ననంతులు. ఇక పరమేశ్వరుడన్ననో, సంఖ్యచే ననంతుడుగాదు. అతడసీముడు కనుక, నతనికి వ్యక్తిత లేదు. "వ్యక్తిస్తు పృథగాత్మికా" యని కోశము. భిన్నత తోచునపుడు గదా 'వ్యక్తి' యనుట?

ససీమతయున్నపుడు వ్యక్తిత్వము సంభవము. కనుక, పరమేశ్వరుడు రెండు మూడయినను, సర్వదా, యేకమే = ఒకడే కాగలడు. ఇట్లు సంఖ్యచే నతడనంతుడు కాకున్నను, దేశ - కాలములచే ననంతుడు, దేశకాలసీమ లతనియందు లేవుగదా! ఇంతకు :- జీవేశ్వరులు సంఖ్యంబట్టి యనంతులు, దేశ కాలములంబట్టి సాంతులుననియు, పరమేశ్వరుడు సంఖ్యంబట్టి యొకడేయనియు, దేశకాలములంబట్టి యనంతుడనియు దాత్పర్యము.

## ఈశ్వరుడు

అనంతములగు భిన్న భిన్న బలములను లోగొన్న యొక యనంత రసస్వరూపము పరమేశ్వరుడు. అతని యందలి యితర బలముల కంటె విస్తృతియందు బెద్దదగు నొక విశేషబలముచే బరిచ్ఛిన్నమగు రసముంగొన్నచో నీశ్వరుడగును. బలమనంతానంత ప్రకారములు కలదయినను, నాయన్నిటను ప్రధానమొక జాతిబలమును మాయా యందురు. అమితమునకు మితి గల్పించునది మాయయని యర్థము. అనగా, పై జెప్పబడిన విధముగ, దేశ కాలములచే ననంతుడు. ఆసీముడు - అపరిచ్ఛిన్నుడు -అనగా నేకొలతకు లొంగనివాడునగు పరమేశ్వరు డేబలముచే పరిమితుడై ససీముడగునో, ఆబలమును మాయా యందురని భావము. పరమేశ్వరునందు మాయాబలములు లేకపోలేదు; ఉన్నవి, అవి భిన్న భిన్నములు ననంతములును గనుక, గేవల మాయా ధర్మమగు మితి - ససీమత యన్నది కలుగటకట వీలు చిక్కదు. కనుకనే, ససీముడు = పరిచ్ఛిన్నుడు నగుటచే నీశ్వరుని, మాయావిశిష్టుడందురు. పరాత్పరుడు మాయా తీతుడు. ఈశ్వరుడు మాయి (మాయావిశిష్టుడు) "మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్" అని శ్రుతియు జెప్పుచున్నది. మా = కొల్త; యా = ద్వారాము = కొల్త = పరిమాణమునకు హేతువు మాయ.

మాయావచ్ఛిన్నుడగు నీశ్వరునుదరమందు మాయయే కాక, చిన్న - పెద్ద బలము లనంతములుగ వేర్వేరుగ దమ తమ కార్యము లొనరించుచున్నవి. ఈ యన్నిటిపై

బూర్ణాధికారము గలది మాయా కనుక దానిని 'అతిష్ఠావా' = (అతిక్రమించి యుండునది) యందురు. మహావిస్తృతి గలదైనను దీనికి గేంద్రమున్నది. కనుక నిది యొక విశాలమండలము, (వర్తుల వృత్తము) యొక్క స్వరూపము నొందును.

ఉత్పన్న వినష్టమగుట (పుట్టిన వెంటనే నశించుట) బలమునకు స్వభావమయినను, రసముంబట్టి దానికి స్థిరత యేర్పడును. స్థిరమగు రసము - చరమగు బలము కూడగా నేర్పడు రూపము స్థిరముగా నిల్వదు. వెంటనే నశింపదు. రసస్థితి - బలగతి సముచ్చయముచే, బ్రతిపదార్థమునకును, కొంత కాలమున్నను ప్రతిక్షణమును మార్పునొందు స్వభావము కల్గుచుండును. మనుజ శరీరము జన్మించినది మొదలు 100 సంవత్సరముల వరకు బ్రపపంచమున జక్కగా స్థిరముగా నుండుగాక, ప్రతి క్షణమును మారుచు తన పూర్వ రూపమును నష్టమును గావించుకొనుచుండును; ఈ నియమానుసారము, పృథివి లక్ష సంవత్సరములు, సూర్యుడంతకంటె నధికముగ, ఈశ్వరుడంత కెక్కుడుగ, స్థిరములుగ నుందురు గాక, ఈ యన్నియు, నందరును, ప్రతి క్షణమును పరివర్తనను బొందుచున్నవి. రస - బలములు కారణముగా, నీ సత్తా - నాశములు రెండు నుండుచుండును. అనగా, బలముంబట్టి యీశ్వరుని రసమందు పరివర్తన గతి యుత్పన్నమయినట్లే, రసముంబట్టి యతని మాయా బలమందును కొంత కాలము వరకు స్థిరత యుదయించుచున్నది. కనుక, మాయాబల మున్నంతవరకీశ్వర శరీరస్థితి యని యంగీకరింపవచ్చును. లేదా,

మాయాబలవిస్తృతి గలంతవరకీశ్వర శరీరవ్యాప్తి యుండుననియు, మాయాబల స్థిరతంబట్టి యీశ్వర జీవనముండు ననియు ననవచ్చును. మాయాబల విశాలమండల మొక వర్తుల వృత్త రూపము. కనుక, నీశ్వర రూపమదే యనుకొనవలయును. శ్రుతియు:-

"సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽ క్షిశిరోముఖం
సర్వతః శ్రుతిమాల్లోకే సర్వమావృత్యతిష్ఠతి" అన్నది.

ఈశ్వర శరీర స్వరూపమగు నీ మాయాబల కేంద్రమునందనంత బలాహుతి యగుచుండ, నుందుండియే యొక నియత క్రమముంబట్టి యనంతబలములు మరల నుదయించు చుండును. అగ్ని యందు తైలఘృత సమిధాదు లాహుతములు కాగా; నా యగ్ని యందు విస్తృతజ్వాల యుదయించునట్లే, ఈశ్వర హృదయమందు ప్రతి క్షణమును సర్వ పదార్థముల యాహుతిరూప యజ్ఞము జరుగుచుండుటవలన, క్షణక్షణమునను నూతన బలోత్పత్తి యగుచుండును. ఈ యాహుతి - లేదా - బల రూపజ్వాలయొక్క యుత్థానమే యజ్ఞమందురు. ఈ యజ్ఞమే యీశ్వర జీవనము. లేదా, ఋషుల దృష్టియందీ యజ్ఞమే యీశ్వరుడు.

## ఈశ్వరునందవ్యయ పురుషుడు

రసమే బలమునకు సత్త = ఆలంబనము. రసము లేనిచో కేంద్రమునుండి బలముల యభ్యుత్థాన ముండజాలదు. ఇక కేంద్రమునుండి యజ్ఞక్రియవలననగు బలములను పరిశీలింతము. బలసత్తను లేదా, సత్త గలబలము పురుషుడందురు. మాయాంతర్గతుడై యతడు స్వరూపధారణ గావించును. ఇతడు మాయావలె వర్తుల వృత్తరూపి, లేదా, పురుషరూపమయిన మొదటి మాయయే, ప్రథమపురుషు డవ్యయుడనవచ్చును. ఇతడు తన మనోరూప కేంద్రమునుండి భిన్న భిన్న బలముల యుత్థానముంబట్టి ఆనంద - విజ్ఞాన - మనః - ప్రాణ - వాక్కులను నయిదు రూపములుగా విభక్తుడగును. ఇన్ని యవయవములున్నను, యితని యందు క్రియ లేనందుచే నితడు వికారి కాడు. కాని, సర్వక్రియల కాశ్రయమయిన ప్రాణ మీతనియందున్నది. కనుక, జగముల కెల్ల ప్రభవ - ప్రతిష్ఠా - పరాయణుడితడే యందురు. కాని,

ఇందొక విచిత్రము. బీజము స్వరూపనష్టి నొంది యంకురమును వెలువర్చును. ఈ యవ్యయ రూపబీజ మెన్ని జగముల వెలయించినను తన స్వరూపనష్టి నొందదు,

ఎప్పటియట్ల వికలముగనే యుండును. కనుకనే అవ్యయము, వివిధ రూపములందును తనకు మార్పులేనిది.

"సదృశం త్రిషులింగేషు సర్వాసుచ విభక్తిషు
వచనేషు చసర్వేషు యన్న వ్యేతితదవ్యయం"

అని ఋషియు నీ యవ్యయ తత్త్వముం గీర్తించెను.

## సంసారము

అవ్యయపురుషుడు సంసృతి (జగత్తు) వెలయింపనున్న పుడతని యంతచ్చితికి జెందిన యానంద - విజ్ఞానములపై మనః ప్రవాహము తగ్గి ప్రాణవాక్కుల వంకకు మొగ్గును. కాగా నతనియందు మొట్ట మొదట ఇచ్ఛా - తపస్సు - శ్రమ యను మూడు భావములుదయించును. ప్రాణమునుండి పుట్టిన క్రియ యెంత భాగము మనస్సు నాలంబనముగా గొనునో (అనగా, మనస్సు పై బడు క్రియాంశము) ఆ భాగమును 'ఇచ్ఛ' యందురు. స్వతంత్రముగా ప్రాణమందుండు క్రియను 'తపస్సు' అందురు. వాక్కు నందు వ్యాపించు క్రియను 'శ్రమ' యందురు. శ్రుతియు "సఐచ్ఛత్ - సతపోఽతప్యత - సోఽశ్రామ్యత్" అన్నదికదా!

మొదట కోరిక, బిదప బ్రయత్నము = అంతర్వ్యాపారము, తరువాత బాహ్య (శారీరక) వ్యాపారము. ఇందు మొదటిది మనసుతో, రెండవది ప్రాణముతో, మూడవది శరీరముతో (వాక్కుతో), ఈ మూడు భావములును సృష్టికి ముఖ్య కారణములు, ఏపని కేని మనకు నీ మూడు లేకున్నచో నది సాగదు గదా! ఇట్లీశ్వరావ్యయుని పంచ భాగములందు జివరివగు మనః - ప్రాణ - వాక్కులను మూడు భాగముల ద్వారా జగముల సృష్టి కార్యము జరుగుచున్నది. కనుక నవ్యయుడు సృష్టిస్థితుల ముఖ్య కారణము.

## నిస్తారము

మరియతడే, సంసారనిస్తారము లేదా ఉద్ధారమును గావింపనున్నపుడతని మనస్సు ప్రాణ వాక్కుల వంక నుండి మరలి, విజ్ఞానానందముల వంకకు మొగ్గును. అంతటితో విజ్ఞానము వలన, ప్రాణక్రియ లెల్ల శిథిలము కాగా, వాక్కు (భూత) స్వరూపము నాశము కాగా, సర్వబల బంధవిముక్తి యేర్పడగా, కేవల మానంద రూపమగు 'రసము' ఉండిపోవును.

## ఈశ్వరునందక్షరుడు

కాని, అవ్యయుడు నిష్క్రియుడు, కనుక జగత్తునకు ప్రభవ - ప్రతిష్ఠా - పరాయణ మితడనుట యుచితము కాదని దోచును. శ్రుతియు, నవ్యయుడు 'కార్య - కారణములకు వేరైనవా'డన్నది ఏలయన, క్షరపురుషుడు కార్య రూపవికారి, జగదుపాదాన కారణము. అక్షరపురుషుడు జగత్తునకు కారణము అనగా నిమిత్త కారణము. మఱి యవ్యయుడో, కార్యము గాడు కారణముంగాడు. శ్రుతి నట్లే వినవచ్చుచున్నది.

"నతస్యకార్యం కరణంచవిద్యతే - నతత్సమశ్చాభ్యదికశ్చ శ్రూయతే (దృశ్యతే)
పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే - స్వాభావికీ జ్ఞానబలక్రియాచ"
ఈ స్థితియందితడు సృష్టి నిరపేక్షుడు, స్వతంత్రుడుననవచ్చును.

అయినను, ఇతనియందు రెండు విధములుగ గారణత్వ మంగీకరింప వచ్చును. ఒకటి సాక్షి రూపమున, రెండవది అక్షరునితోడి యోగమునుబట్టి అనగా :- (1) దీపమునకు గన్ను లేదు. చూచుపనికంటిది. దీపము ఎవరి నేత్రము నపేక్షింపక తనంతదాను ప్రకాశించును. అయినను "కన్ను చూచుటకు దీపము సాక్షి" యందుము. దీపము లేకున్నచో, నేత్రము చూచుపని సేయజాలదు. ఈవిధముగనే, జగద్రచనా కార్య మక్షరునిది కాని, అవ్యయాంశకు అక్షరునందు యోగము లేకున్నచో, నాయక్షరుడాపని చేయజాలడు కనుక సాక్షిరూపమున, అవ్యయుని కారణుడనవచ్చును. ఇక రెండవది :-

అవ్యయుడు కేవలాత్మగా నెందు నుండడు. ఇతని ప్రాణాంశయందక్షరు డెల్లపుడు నవినాభావమున నుండును. అనగా, అవ్యయుడు లేని యక్షరుడు, అక్షరుడులేని అవ్యయుడు నెన్నడు నుండరని భావము. ఆ యీ యక్షరుడు జగత్కారణము. కాగా, నితని ద్వారా, అవ్యయుడు కూడ జగత్కారణ మనవలసి వచ్చుచున్నది.

అవ్యయుడు జ్ఞాన ప్రధానుడయినట్లు, అక్షరుడు క్రియా ప్రధానుడు. ప్రతి కార్యమందలి క్రియకు నావపనము (అవకాశము) అవ్యయుడు. ఏ వస్తువున కేని యెల్ల క్రియలును, ఈ యావపనమునకు లోపలనే కాని దానికి బయట నేమియు సాగవు.

పృథివి - సూర్యుడు మొదలగు విశాలపిండములనుడు, ఘటపటాది క్షుద్రపిండములనుడు, అన్నిటికి నాయతనము = ఆవపనము భిన్న భిన్న రూపముగా నియతమైయున్నది. ఆయా యతన కేంద్రమందు, ఆ పిండము యొక్క బింబముం (చిత్రము)డును. మఱి యా పిండబింబమునుండి యెంత దూరము వరకు బోయి మనము దానిం జూడగలమో, అంతవరకా వస్తువుయొక్క ఆవపనము = ఆయతనము అనుకొనవలయును. ఏలయన, వస్తువు యొక్క క్రియ కొలదిగనో గొప్పగనో, అంతవరకును భిన్న భిన్న రూపమున దప్పక యుండు చుండును.

గంధ - రస - రూప - స్పర్శ - శబ్ద - ప్రాణ - మనస్సులను నీ యేడు గుణములు పిండ బింబము నుండి వెడలి యా హద్దు వరకు నుండును. దానిందాటి పోజాలవు. పోయెనా యవి మరొక భావములుగా పరివర్తన జెంది పోవును. చూడుడు, ధూమము (పొగ) పైకి గొంత దూరము పోయి తన స్వరూపమును విడచి వాయు ప్రాణ రూపమున వచ్చుచున్నది గదా!

ఇట్లు ప్రతి వస్తువు నందును మనము చూచు నవకాశము = ఆయతనమే అవ్యయసాక్షాద్దర్శనము. ఈ యవకాశ మొక విధమగు ప్రకాశము. తన రూపమున నది స్థిరము - అవిచలము - నిష్క్రియము. కనుక దీనిని జ్ఞానస్వరూపమందుము. ఇక, నాయవకాశమందెట నెంత క్రియాకలాపము జరుగుచుండుటంగందు మయ్యది యెల్ల

నక్షరస్వరూపము. జ్ఞాన క్రియలు రెండు నేకవస్తువు కాదు. కాజాలవు. కనుక జ్ఞానస్వరూపావ్యయుకంటె, కర్మస్వరూపాక్షరుడు వేరందుము. అక్షరపురుషుడు కుర్వద్రూపుడు. ఒక క్షణమేని గతిలేకుండ, నవిచాలిగ - స్థిరుడుగ నెన్నడు నుండడు. కనుక నవ్యయుడు జ్ఞానమయుడు, అక్షరుడు కర్మమయుడందుము.

జగమందగపడు పరివర్తనలకు - వికారము లన్నిటికి కారణ మక్షరపురుషుడు కనుకనే శ్రుతియు నిట్లనుచున్నది.

"యథాసుదీప్తా త్పావకాద్వి స్ఫులింగాః సహస్రశః ప్రభవన్తే సరూపాః
తథాఽ క్షరాద్వివిధాః సోమ్యభావాః ప్రజాయంతేతత్రచైవాపియన్తి"
"యథోర్ణనాభిః సృజతేగృహ్ణతేచ - యథాపృదివ్యా ఓషధయః సంభవన్తి
యథాసతః పురుషాత్కేశలోమాని, తథాక్షరాత్సంభవతీహవిశ్వమ్"

అనగా :- (1) వెల్గుచున్న నిప్పునుండి అనేక రూపముల మిణుగురులవలె, అక్షరునుండి పలు భావము లుదయించి యందే లయించుచున్నవి (2) సాలెపురుగు తంతువును సృజించుకొని, లీనము గావించుకొనుము, పృధివి నుండి యోషధులు జనించు చున్నవి. బ్రతికియున్న పురుషునుండి కేశలోమములు జనించుచున్నవి. అట్లే యిట విశ్వమక్షరునుండి సంభవమగుచున్నదని భావము.

అవ్యయాక్షరులకు స్వభావనియతము లైదేసి ధాతువులు. అవ్యయుని మనస్సు నుండి విజ్ఞానానందములను రెండమృత ధాతువులు, ప్రాణవాక్కులను రెండు మర్త్య ధాతువులు వెలయొనట్లె అక్షరుని ముఖ్య ధాతువగు బ్రహ్మ నుండి యింద్ర విష్ణులను రెండమృత ధాతువులు, అగ్ని - సోముడు నను రెండు మర్త్యధాతువులను వెలయును. ఇందక్షర ధాతువులందు:-

ఇంద్రుడు విక్షేప (త్రోసివేయు) శక్తి. విష్ణు వాకర్షణ శక్తి. బ్రహ్మ ప్రతిష్ఠా (నిల్కడ) శక్తి; అగ్ని వికాసశక్తి. సోముడు సంకోచశక్తి యందురు. బ్రహ్మాదిస్తంబపర్యంత మీ శక్తి పంచకములేని పదార్థములేదు. ప్రతి వస్తువును, తన కేంద్రమునుండి ప్రతి యారంభణ

ద్రవ్యమును బయటికి ద్రోసి వేయుచును. వెంటనే సూర్య చంద్ర పృధివీ వాయ్వాదులగు బాహ్య పదార్థముల రసములను తనలోని కాకర్షించు కొనుచు తన యందలి లోపమును పూరించు కొనుచుండును. ఇట్లు వచ్చుచు పోవుచునుండు పదార్థములను కొంత కాలము హృదయ గ్రంధి ద్వారా, ఒక నియత కేంద్రమున స్థిరముగ నుంచి యొక వస్తు పిండ స్వరూపమును నిర్మించు చుండుటయే ప్రతిష్ఠా తత్త్వమగు బ్రహ్మ పని.

విక్షేపణారంభము, ఆకర్షణ సమాప్తియు బ్రతిష్ఠా బిందువునందే, ఆ బ్రహ్మయే, తన మర్త్యరూపముం ధరించి యింద్రుని విక్షేపశక్తి ద్వారా పిండము నుండి బయటికి బోవునపు 'డగ్ని' యనబడును. బ్రహ్మయందలి హృదయ గ్రంధిం బట్టి యనంతబలము లొక బంధనముగనై వస్తు పిండము తయారగును. ఆ బలబంధనమే ఉన్ముక్తమై యా బలగ్రంధిం దెఱువనున్నపు డాయవస్థ పేరే 'అగ్ని'. గ్రంధి యంతయు నిశ్శేషముగ విడిపోయి బలము యొక్క ప్రత్యేక స్వరూపము వేర్వేరు కానంత వరకు విశకలన క్రియ (ప్రకాశము) సాగు చుండునంత వరకే అగ్ని యన్న పేరు. ఆ క్రియ సమాప్తి నొందగనే, అనగా, బలములు వేరగుటతో విశకలన - వికాస క్రియ ముగియగనే, అగ్ని స్వరూపమును నష్టమైపోవును. ఆ స్థితియందు, బలము లెల్లను ప్రతిమూర్ఛితములై యేరూపము నొందునో, దానిని సోమమందురు. (సోమము పలువిధములు) మూర్ఛితమగుట వలన సోమమందు స్వయముగా గ్రియ యుండదు. అది తన స్వాతంత్ర్యముం బోగొట్టుకొన్నది కనుక పరాశ్రితమైపోవును. ఇందువలననే యది యగ్నికి అన్నమై పోవుచున్నది. తనంతదానుగనో అగ్ని యొక్క యాకర్షణ వల్లనో, సోమము వికసితాగ్ని ముఖమందు, ప్రతి క్షణమును ప్రవిష్టమగుచుండును. ఎంత వరకు? అగ్ని యొక్క నిష్క్రమణస్థానము, అనగా వస్తువు యొక్క నాభివరకు జేరి, ఎంతగా సంకుచిత స్వరూపము నొందగలదో అంతవరకు బ్రవేశించును. వచ్చి వచ్చి, నాభికి (కేంద్రమునకు ) జెందిన ఒక బిందువుం జేరి, యిక సంకోచమునొందు నవకాశము కుదరక, విక్షోభ మొంది తనగతిని మార్చి వేయును. అనగా, సంకోచమునకు బదులు వికసితము గాదొడంగును. ఇందువలన నా

సోమమే తన సోమ ధర్మమును వీడి యగ్ని రూపమునకు వచ్చును. ఇట్లగ్నీ సోములు పరివర్తన మొందుచుండుటన్న దొక చక్రము. సంసార చక్ర మూలమీ చక్రమే.

ప్రతివస్తు శరీర నాభి బిందువునను, బ్రహ్మ - విష్ణు - ఇంద్రులు నియతముగ నుందురు. మఱి, నాభినుండి బయట నీ యగ్నికి రెండు చితులగును. ఒకటి శరీరమందురి దేయంతః పృష్టము ప్రథమచితి. ఏకవింశ (21) స్తోమము నాబడు ద్వితీయ పృష్టము రెండవచితి. ఇక నాపై 33 వ స్తోమము వరకు సోమ భాగము. ఇది చిత్యము - చితేనిధేయము నాబడు నా రెండగ్నులలోనికి వచ్చుచుండును. ఆ వచ్చుటనే యాహుతి యందురు. అగ్ని యందాహుతమై సోమ మగ్ని రూపమొందుటే యజ్ఞము నాబడును. ఈ యజ్ఞ క్రియ విష్ణు స్వరూపము నాభి యందలి విష్ణువు వలననే యీ యజ్ఞము సంపన్నమగును. విష్ణువును యజ్ఞము - యజ్ఞపతి - యజ్ఞాధిష్టాత యందురు.

ఈవిధముగా బ్రహ్మ - విష్ణు - ఇంద్రులు అను మూవురక్షరులు నాభిస్థ దేవతలు. అగ్నీషోములు పృష్ఠస్థ దేవతలు. ఏమన :- శరీరరూప పృష్టమందు చిత్యగ్నియు, ఏకవింశస్తోమమను ద్వితయపృష్టమందు చితేనిధేయాగ్నియు, మఱి, త్రయత్రింశ (33) స్తోమమను మూడవ పృష్టమందు సోమము నుండునుగదా!

బ్రహ్మ - విష్ణు - ఇంద్రులు అను మూవుర క్షరులు నొక నాభి - (హృదయము - కేంద్రము) యందుందు రంటిమి గాని, కొన్ని కొన్ని పదార్థములందట్లు గాక, స్థానాంతర ముండునని పరీక్షవలన దేలినది. ఒక వృక్షమూలమందీ మూవురును దగ్గర దగ్గరగ క్రిందు మీదుగ నుందురు. ఈ యశ్వత్థవర్ణన మరయుడు:-

"మూలతో బ్రహ్మరూపాయ, మధ్యతో విష్ణురూపిణే
అగ్రత, శివరూపాయ, అశ్వత్థాయ నమోనమః"

పురాణములందు శివుడన్నచో నింద్రుడని యనుకొనదగును.

మనుజ శరీరమందీ మూవురే వేర్వేరు కేంద్రములందుందురు. ఎట్లన :- ఉదర గుహయందలి నాభి యను కేంద్ర మందు విష్ణువును, ఉరోగుహయందలి హృదయమను కేంద్రమందు బ్రహ్మయు, శిరోగుహ యందలి మస్తిష్కమను కేంద్రమందు శివుడు (ఇంద్రుడు) నుందురు. ఈవిధముగనే,

ఈశ్వర శరీరమందీ పంచాక్షరులును, దహరోత్తరక్రమమున నొకనితరువాత నొకడు తమస్థితిం గుదుర్చుకొందురు. ఎట్లన :- సర్వకేంద్రమందున్న యవ్యయపురుషుని నాభి కెడముగా బ్రహ్మ తన మండలమును నిర్మించుకొనును. అతని నుండి మూడు వేదము లుత్పన్నములగును. ఈయననే 'అవరబ్రహ్మ' ప్రజాపతి బ్రహ్మ యందురు. ఈతని మండల మందు విష్ణువు తన కేంద్రమును నిర్మించుకొనును. ఆయనే పరమేష్ఠి యందురు. అతని నుండి ఆపస్సు - వాయువు - సోమము నుత్పన్నములగును. ఈ మూటిని 'భృగువు' లందురు. ఆ పరమేష్ఠి విష్ణు మండలమందింద్రుడు తన కేంద్రము నిర్మించు కొనును. ఆయనను 'సూర్యు'డందురు. అటనుండి జ్యోతి - గౌ - ఆయువులను మూడుత్పన్నములగును. ఆ మండలమందు, అగ్ని తన కేంద్రము నిర్మించుకొనగా, యది పృధ్వినాబడును. దాని నుండి వాక్ - గౌ - ద్యౌ అను మూడు తత్త్వములు వెలయును. ఆ పృథ్వీమండలమందు సోముడు తన కేంద్రము నిర్మించుకొనగా చంద్రుడు నాబడును.

ఈవిధముగ బ్రహ్మ - విష్ణు - ఇంద్ర - అగ్ని - సోములను పంచాక్షరులును క్రమముగ ప్రజాపతి - పరమేష్ఠి - సూర్య - పృథివి - చంద్ర అని యిట్లు ఒకరిలోనొక రంతర్గర్భితులై మహా విశాలమగు నీశ్వరావ్యయ మండలమందు, వేర్వేరుగ, దమ స్థానములను నిర్మించుకొని వేర్వేరు కార్యముల నొనర్చుచు నేకేశ్వర సంస్థను నిర్మించుచున్నారు. ఈ యందరిదగు వేరు వేరు కార్యకరణమే యేకేశ్వరుని కర్మ. ఇదే యతని స్వరూపము. ఈ కఠవచన మరయుడు:-

ఊర్ధ్వమూలోఽ వాక్శాఖ, ఏషోఽ శ్వత్థస్సనాతనః
తదేవశుక్రంతద్బ్రహ్మ తదేవామృత ముచ్చతే
తస్మిన్ లోకాః శ్రితాః సర్వేతదు నాత్యేతికశ్చన"

ఇది సనాతనాశ్వత్థ వర్ణనము. భగవద్గీతయందు -

"ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం
చందాంసి యస్యపర్ణానియస్తంవేద సవేదవిత్"

అని చెప్పబడిన అవ్యయాశ్వత్థము, ఈ యీశ్వర స్వరూపపరో రజోఽ వ్యయమే. దీని యొక్కొక్క శాఖయు బ్రహ్మాదిపంచ పర్వముగలది. పురాణమందు "మూలతో బ్రహ్మరూపాయ" అను మొదలగు నశ్వత్థపూజనమున, బ్రహ్మాదిగ మూడు ముఖ్యములగు పెద్దపర్వములే చెప్పబడినను, సూర్య రూపి యగు నింద్రుని యంతర్గతములుగ నగ్నీషోములను రెండు పర్వములను గూడ సంగ్రహించినట్లెరుంగ వలయును. ఏలయన :-

పరోరజసమగు నవ్యయాశ్వత్థము వేయి శాఖలుగలది. అందలి ప్రతి శాఖయు పంచపర్వములు గలది. ఇక నా యక్షరులతో పరోరజావ్యయుని ధ్యానమందుంచుకొనుచో, పై జెప్పబడిన దహరోత్తర క్రమమున (ఒక దాని గర్భమందొకటి చొప్పున) ఆరు విభాగములు సిద్ధములగును. (1) పరోరజా, (2) బ్రహ్మ, (3) విష్ణుపరమేష్ఠి (4) ఇంద్ర సూర్య (5) అగ్ని పృధివి (6) సోమ చంద్ర యని; ఇందలి చంద్రుని విడచి, తక్కిన అయిదిట నొక్కొక దానియందు మూడేసి భావముల సన్నివేశముండును గదా! ఎట్లన :- (1) పరోరజసునందు:- సత్తా - చేతనా - ఆనందములు. (2) బ్రహ్మయందు :- ఋక్ - యజుః - సామలు. (3) పరమేష్ఠియందు:- ఆపో - వాయు - సోమములు (4) సూర్యనందు :- జ్యోతి - గౌ - ఆయువులు (5) పృధివి యందు :- వాక్ - గౌ - ద్యౌ. ఇట్లయిన మొత్తము తత్త్వములు పదునైదు. శ్రుతియు :-

"యానిపంచధా త్రీణి త్రీణి తేభ్యోన జ్యాయః పరమన్యదస్తి
యస్తద్వేద సవేదసర్వం సర్వాదిశోబలి మస్మైహరంతి" అన్నది

జీవుడును ఈ పదునైదు కళలంగొని వెలయును. జీవుని ముఖ్యాత్మ పరోరజునికి బ్రతినిధి యన్నచో, దానికిని అంగ ప్రత్యంగ రూపములగు వేర్వేరాత్మలయిదు అనుయాయులుగ నీ శరీరమందుండును. అవియు వేర్వేరు కేంద్రములను నిర్మించు కొని యా యీశ్వరుని పదునైదు కళలను తమ పదునైదు కళలతో ప్రతిక్షణమును గ్రహించుచు తమ జీవనసత్తను ధరించుచుండును.

జీవునకు ముక్తి లేనంతవరకు, పరోరజుని ప్రతినిధి స్వరూపమగు నా ముఖ్యాత్మకు హృదయగ్రంధి యట్లే యుండును. దాని ద్వారా ఆ 15 కళల సంబంధము తప్పదు చావుపుట్టుక లెన్ని మార్లయినను, జీవషోడశియను నా ముఖ్యాత్మ యా పంచదశ కళావిముక్తి నొందదు. ఇక, ముక్తి లభించునపుడు, ఆ పదునైదు కళలును జీవాత్మనుండి వెడలి, తమకు బ్రతిష్ఠయగు నీశ్వరషోడశీ ఆత్మకు జెందిన పదునైదు కళలందు నేకీభవించిపోవును, పాత్రయందలి నీరు పారబోయగా, ప్రతిబింబజ్యోతి తన ప్రతిష్ఠయగు సూర్యజ్యోతి యందేకీభవించునట్లిచటను దెలియవలయును. శ్రుతియు నిట్లే యన్నది:-

"గతాః కలాః పంచదశ ప్రతిష్ఠాః దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు,
కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మాపరేఽ వ్యయేసర్వ ఏకీభవన్తి"

"ముక్తి కాలమందు జీవుని పదునైదు కళలును తమ తమ ప్రతిష్ఠలను జేరును, పంచాక్షర దేవత లీశ్వర పంచాక్షరులను జేరును. అక్షర కర్మలు - (జీవావ్యయుని) విజ్ఞానమయాత్మయు, (నదులన్నియు సముద్రమందువలె) పరావ్యయునందేకీభవించును.

ఈ యన్నిటికి మూల స్వరూపము పరోరజసుడు. అతడానంద చేతనాసత్తల గ్రంధిస్వరూపముగల బలఘనుడు ఇందు, సత్తయన మనః ప్రాణ వాక్కుల యేకరూపము. కనుక ఆనంద - చేతన - సత్తలు మూడే, అవ్యయుని పంచధాతు రూపములని

తేలును. ఇదే పరోరజుసుని ముఖ్య రూపము. ఇవి యతని హృదయ బిందువునుండి తమ రశ్మిచే వ్యాప్తి నొంది యేర్పరచు వర్తుల వృత్తమే యతని బ్రహ్మాండము. ఇదే యీశ్వర శరీరము. జగత్తు నాబడునదెల్ల నీ శరీరాంతర్గతము.

తక్కిన పంచాక్షరులును తమ 15 కళలంగొని అవ్యయాత్మ కేంద్రమాలంబనముగా నీ బ్రహ్మాండ మందుందురు కనుక, నా 15 కళలతో నవ్యయారూపముఖ్యాత్మ షోడశినాబడును. ఇందువలననే విగ్రహధారియగు నీశ్వరుని షోడశీ యందురు. (విశ్వమూర్తి యగు నీ యీశ్వర రూప మవధారణకు లొంగదు. "నవిశ్వమూర్తే రవధార్యతేవపుః" కాని భక్తితోడి ప్రతిమారాధనమువలన "యేయధామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం" అన్న భగవద్వచనముంబట్టి యీశ్వర కృపానుగ్రహముంబట్టి యుపలబ్ధి కలుగగలదు.) ఇక,

అవ్యయునందలి. ప్రథమాక్షరుడు బ్రహ్మ, ఋక్సామ యజస్సులను వేదత్రయ గ్రంథిరూపుడు కనుక నితని నుండి బ్రహ్మాండ చరనుసీమవరకు నా మూడు విధముల వాక్కును వ్యాప్తమగుచు, పరమేష్ఠ్యాది పిండములన్నిటను వేర్వేరుగ బ్రతిబింబ రూపమున వెలయుచు, వాని వాని నుండి ప్రతిఫలించి, ఈ పృథివి యందుగల చిన్న పెద్ద పిండములన్నిటను వేర్వేరుగ ప్రతిబింబించు చుండును. ఈ మూడు వేదములంబట్టియే, ప్రతి వస్తువును, భాసిల్లును, ఉనికిగలదగును. లేనిచో నంతయు నన్నియు నాస్తియే. ఈవిధముగా నా బ్రహ్మ, వస్తువునకు సత్తా - భావములను గూర్చుచు, జగదుపకారము సేయుచున్నాడు. ఈ వేదమండల మందలి, ద్వితీయాక్షరుడు పరమేష్ఠియను విష్ణువు. ఇతడాపోవాయు సోమముల యేకీభావమగు ఘనపిండ స్వరూపుడు. బ్రహ్మాది వేదమండలము గదా! ఇతని మండలము 'సముద్ర' మందురు: ఇందు జల - వాయు - సోమములు సమముగానున్నను వాయు - సోమములు సూక్ష్మములగుటచే వేద మధికముగా జలమందే సన్నివేశమగుట వలన 'అపోమయసముద్ర' మందురు. దీని కేంద్రమందు విష్ణువు నిత్యముండును. కనుక నతనిని 'సముద్రశాయి' 'నారాయణుడు'

అందురు. ఈ సముద్రమందుత్పన్నములయిన సూర్య - పృధివ్యాధి పిండములందెల్ల నాపోవాయు సోమములు మూడును ప్రతిక్షణమును భిన్నభిన్న రూపములతో నాశ్రయించుచుండును. సూర్యమండల మీ సముద్ర జలమందుండి, తన కిరణములద్వారా జలములను నల్గడలకు జిమ్మి వేయుచు, ప్రతిక్షణము సోమముం గ్రహించుచు, వాయువు ద్వారా అగ్ని నుత్పాదించు చుండును. సూర్యుని వలననే పృధివిని జలమాక్రమింపకున్నది. కానీ, సోమ - వాయువులు రెండును, పృధ్వికి నలువంకలను, అత్యంత బలమున దమ ప్రసారముం జూపుచు చుట్టుముట్టి యుండుచుండును. ఈవిధముగ బరమేష్ఠి యీ మూడు భావములచే, జగదుపకారము సేయుచున్నాడు. ఇక సముద్రమందలి,

తృతీయాక్షరుడు సూర్యుడను నింద్రుడు. “యధాగ్ని గర్భా పృధివీ తధా ద్యౌరింద్రేణ గర్భిణీ” అను శ్రుతింబట్టి పృధ్వి యగ్ని పిండము. సూర్యు డింద్రపిండము. ఈ సూర్యుడు, జ్యోతి - గౌ ఆయు’ వను మూడు తత్త్వముల బలగ్రంధి స్వరూపుడు. తన కిరణములద్వారా, ఆ మూడు తత్త్వములను బ్రహ్మాండమందంతటను వ్యాపింప జేయుచున్నాడు, జగద్వస్తువులందలి జ్యోతి - గౌ - ఆయువు లెల్ల నీ సూర్యుని నుండి వచ్చి ప్రతిఫలించునవే. ఇతని మండలము ‘రోదసి’ యందురు. ఇందలి,

నాల్గవ యక్షరుడు, పృధివియను నగ్ని, వాక్ - గౌ - ద్యౌ అను మూడు తత్త్వముల బలగ్రంధి రూపమిది. దీని నుండి యుత్పన్నములగు నా మూడు పదార్థములును సర్వ బ్రహ్మాండ వ్యాప్తములు. ఏదేని పదార్థమందు, సంయోగ - విభాగములవలన గల్గు శబ్ద మీ పృధ్వీ వాక్కే. ఏ ప్రాణి యందేని యగపడు, వాయు జలాది భూతములీ పృధ్వీ గౌ స్వరూపములే. ఘర్షణవలన బుట్టునగ్ని పృధ్వికి జెందిన ద్యౌ. ఈ పృధ్వీమండల మందలి

అయిదవ యక్షరుడు చంద్రుడనబడు సోమము. దీనికి విశేష భేదములు లేవు. తన సోమము ద్వారా యిది జగదుపకారకము.

ఇట్లీశ్వర శరీరమందలి ప్రాణము నాశ్రయించి - ఆ యీ పంచాక్షరులు నంతరాంతర భావమున వేర్వేరనుండి గావించు సర్వజగత్సృష్టి రచనయు నీశ్వరునిదందురు.

ఈ యీశ్వర షోడశీ మండలమందన్నిటికి లోపల ననగా కేంద్రమందు పరోరజాబిందువు. కాని, అది పిండ రూపము గాదు. దానికి నలువంకలను వేదమండలము - ప్రజాపతి యనబడు బ్రహ్మమండలము. ఇది పిండరూపమే కాని దృశ్యము కాదు. ఇది పరోరజాబిందువున కించుక దూరముననుండి, దానిం బరిక్రమించును. ఇదే కాక పరోరజాబిందువును పరిక్రమించు నదృశ్యపిండము లెన్నో యుండవచ్చును. కాని, మనకు వానితో బనిలేదు. మనము కేవలము వేదమయశాఖ యందున్నాము. కనుక, దానికి జెందిన ప్రతిశాఖా విచారణమునే చూచుకొందము.

ఈ బ్రహ్మ నలువంకల బరిక్రమించువారిలో మొదటి కక్ష, విద్యుత్స్వరూపుడగు నింద్రునిది. పిమ్మట పరమేష్ఠిది. ఆ పిమ్మటివింక నుండవచ్చును గాని వానితో మనకు బనిలేదు. ఇక, నా పరమేష్ఠిం బరిక్రమించు వానిలో మొదటి కక్ష భృగువుది. రెండవది అంగిరాబృహస్పతిది. మూడవది బ్రహ్మణస్పతిది. నాల్గవది విద్యుత్తుది. అయిదవది సూర్యునిది. ఈ సూర్య శాఖయందు మనమున్నాము. కనుక ఈయనకు బాహ్యములగు పిండము లుండవచ్చు నైనను వానిని వదలెదము. మఱి,

సూర్యుని బరిక్రమించువానిలో మొదటి కక్ష బుధునిది. రెండవ కక్ష వేనుడను భృగువుది. మూడవది పృధివిది. దీనికి బయటగూడ, నున్న కుజ - బృహస్పతి - యమా (శని) దులను వదలుదము, పిదప నీ పృధ్విని చంద్రుడు నల్గడ బరిక్రమించు చున్నాడు. ఇంకెవ్వరును బరిక్రమించునట్లు తోచదు.

ఇట్లు పరోరజనుని మొదలుకొని, చంద్రునివర కైదుప శాఖలుగల యొక శాఖ చూపబడినది. బహుశః నిట్టివి వేయి శాఖలుండును. ఆ యీ శాఖలతోడి విశాలమండల మీశ్వరుడందుము. అతని నశ్వత్థముగను ధ్యానింతుము. అతడనంత శక్తి ఘనుడు. కనుక సర్వశక్తి, అనంత విజ్ఞానఘనుడు కనుక సర్వజ్ఞుడు. అందురు.

# ఈశ్వరునందు క్షరుడు

అవ్యయుని ప్రాణభాగమును పంచవిధములగు నక్షరుడవలంబముగా గొని, వేర్వేరు కార్యము లాచరించునట్లే, అవ్యయునివాగ్భాగము నాలంబముగా గొని క్షరాత్మ తన వికారముల నుత్పన్నము గావించి వానిచే నా యవ్యయాక్షరుల నావరించు చుండును. నీటియందుత్పన్నమయిన నురువు నీటిని వలె క్షరవికారములా యిరువురం గప్పివేయును. మనకగపడునవి క్షరపిండములే. వానియందలి కర్మయంతయు నక్షరునిదే.

రథమందు స్వామి యిచ్ఛంగొన్న సారధి వ్యాపమున రథము నడచును. స్వామి సారధులు స్వయముగా నడువరు. కాని, వారి గమనము సిద్ధమగుచున్నది కదా. అట్లే శరీరరథ మందవ్యయేచ్ఛంగొన్న యక్షర వ్యాపారమున, బుట్టునట్టి గతింబట్టి అవ్యయాక్షరులు గతిమంతు లగుచున్నారు. రథమందశ్వముచే వలె శరీరమందు క్షరాత్మ యక్షరాత్మ ప్రేరణచే గతిమంతమగుచున్నది. శరీరము నడుచుచుండగా, కప్పుకొన్న వస్త్రమును నడచునట్లు, అక్షరుని క్రియంబట్టి యతనిం గప్పి యున్న క్షరభాగములందెల్ల క్రియలును జరుగునట్లగపడును. మన శరీరమున గప్పుకొన్న వస్త్రమును విడచినట్లక్షరుడును తన్నావరించు వికారములను విడచి వేరగుచుండును. కాని, ఇచట జ్ఞప్తి యందుంచదగిన దేమన, నాయెల్ల క్షర వికారములకు నుక్థము - (ఉపాదానస్వరూప) మగు నాత్మిక క్షరభాగమును మాత్రమక్షరాత్మ యెన్నడును విడువదు కనుక, అప్పటి వికారముల నది వీడినను, ఆ యాత్మిక క్షరభాగమునుండి, మున్పటివలెనే క్షరవికారము లుత్పన్నమై, అక్షరము గప్పుచుండును. ఇట్లీ క్రియ యనాది కాలమునుండి జరుగుచునే యున్నది.

అవిద్యా - కామ - కర్మలను నీమూటి బీజచితి, పంచదేవతల దేవచితి, పంచభూతముల భూతచితి, ప్రజా - విత్తములు అను నీ యైదు క్షరవికారములును కల్గి కల్గి యక్షరు నుండి వేరగుచు, మరల మరల యుత్పన్నములగుచుండునని మున్ననుకొంటిమి గదా!

ఇట్లయిదు క్షరములు, అయిదు అక్షరములు, అయిదవ్యయములు మొత్తము 15 కళలతోడి పరాత్పర కళయొకటి, యేకముగా నేర్పడు వర్తుల వృత్తరూప విశాలమండలమే, శరీరధారి, (విగ్రహవంతుడు) అగు నీశ్వరుడందురు. ఆ యీశ్వర శరీరమున కంగ ప్రత్యంగరూప సూర్యచంద్ర తారామండలములు వేయేల? మనకగపడు నేదేని యతని శరీరమునకు బాహ్యమందు లేదు. మనుజ శరీరమందలి మాంసాస్థి శోణితాది ధాతువు లాధారముగా స్రుమరములను ననంత జీవాణువు లుత్పన్న వినష్టములగునట్లే యీశ్వర శరీర ధాతురూప పృధివ్యాధి పిండము లాధారముగా, మన బోటి యనంత జీవు లుత్పన్న వినష్టములగు చున్నవి. ఈశ్వరునితో మనబోటి జీవులకు గల సంబంధము, మన శరీరముతో స్రుమరములకు గల సంబంధము వంటిది. ఈశ్వరాంగములగు మన మతనికి భిన్నులము, నభిన్నులము కూడను. జీవషోడశియందు వలెనే, ఈశ్వరషోడశి.

యందు ననేకాత్మలు :- (1) చిదాత్మ - (2) వేదాత్మ - (3) యజ్ఞాత్మ - (4) విజ్ఞానాత్మ - (5) సూత్రాత్మ - (6) మహదాత్మ - (7) భూతాత్మ యన్నవి భిన్న భిన్న హృదయములు గలవి యున్నవని మున్నె యెరింగితిమి. అనగా:- చిదాత్మకు పరోరజా, వేదాత్మకు బ్రహ్మ, యజ్ఞాత్మకు పరమేష్ఠి, విజ్ఞానాత్మకు సూర్యుడు, సూత్రాత్మ కంతరిక్షము (వాయువు), మహదాత్మకు చంద్రుడు, భూతాత్మకు పృధివి, హృదయస్థానములు. మఱియు, జీవ శరీరమందువలె నియతము లగు భిన్న భిన్న గుహాస్థానములగు, మూర్ధము - కంఠము - హృదయము - నాభి - యోని యనువాని నీశ్వర శరీరమందు నెఱుంగవలయును.

ఇక, 7వ భూతాత్మకు - విరాట్ - హిరణ్యగర్భ - సర్వజ్ఞులను మూడు రూపములు. ఈ మూడును వరుసగ, అగ్ని - వాయు - ఇంద్రుల పేర్లు. బ్రహ్మాండమందు ఎందున్న యగ్నియును, అన్ని యగ్ని భేదములును యగ్ని నిర్మిత పిండము లన్నియును, 'విరా'ట్టందురు. వాయు భేదములన్నియు హిరణ్య గర్భుడు. ఇంద్రభాగమేది యెందున్నది

జ్ఞాన ప్రధానము కనుక మొత్తముగా సర్వజ్ఞుడందురు. కాని, యీ మూడు నగ్ని భేదములే కనుక, మొత్తముగా భూతాత్మయందురు. ఇంతకు :-

దాత్పర్యమేమన :- పైనిజెప్పబడిన విధముగ నీశ్వర శరీరమందున్న యేడాత్మలు, వాని స్థూలపిండములతో నేర్పడిన యీ మహావిశాల బ్రహ్మాండ మీశ్వర శరీరము. ఆత్మ శరీరము కలసి యేకరూపమున నుండుచున్నది, ఇది మహా విశాలమైనను, మన శరీరమందలి సృమరకీటములు, మన శరీరమందలి కొలదియంశము (భాగము) ను జూచి యనుభవించునట్లు మనమును, ఈశ్వర శరీర సూక్ష్మాంశలపై, మిక్కిలి కొలదిమేర జూచి యనుభవించుచున్నాము. దీని వలన దేలిన

సారాంశము :- ఈ యనంత తారాపిండ సహితమగు మహావిశాల జగత్తు మనకెంత యనుభూతికి వచ్చునదియె, యీశ్వర సాక్షాత్స్వరూపము - దర్శనము. ప్రతి యొక చిన్న - పెద్ద ప్రాణుల యెడ సౌహార్దము గలిగి, అన్ని యాత్మలతో, తన యాత్మైకత నెఱపుచు, ఏకదృష్టి కలిగి, అందరి సుఖదుఃఖములతో సహాను భూతి కల్గియుండుటయే యీశ్వరారాధనము.

## జీవషోడశి

మన శరీరమందలి యుష్ణతంబట్టి శరీరమందనంత జీవాణువు లుప్పతిల్లునట్లు అనగా, భిన్న భిన్న వాయు ఖండముల విక్షేపణము వలన నగ్ని యనంత ఖండములు కాగా, ప్రతియొక ఖండమును, భిన్న భిన్న సోమము నావరణముగా గొని, వేర్వేర తన శరీరములను నిర్మించుకొనును. ఆ యొక్క శరీరమందును, బ్రహ్మ విష్ణు ఇంద్రులును, పంచధాతు మయావ్యయుడును స్వయముగ వ్యాపింతురు. సరిగా నిదేవిధమున,

మహా విశాలమగు బ్రహ్మాండ శరీరమందును, అగ్ని పై వాయు విక్షేపణవలన భిన్న భిన్న విధములగు నగ్ని ఖండములు కలుగగా నా యొక్కొక ఖండమును అవ్యయుడనబడు జీవాత్మగ నగును. సదా యనంత జీవుల యుత్పత్తి క్రమమిదే. ఆ

జీవుల కాధారభూతములగు పరమేష్ఠి - సూర్య చంద్రాది పిండముల యుత్పత్తి క్రమము నిట్లే. ఈశ్వర శరీరమందు బ్రహ్మ ప్రజాపతి వలన బ్రకటమగు ఋక్సామ వేదములందలి యజర్వేదము, ఆ యీశ్వర శరీరమందలి సంపూర్ణాకాశ వ్యాపియగు నొకవిధమయిన వాయువు. సహజ స్వభావముననది మర్త్యము - అమృతమునని రెండువిధములు. ఇందు మర్త్యము నుండి పరమేష్ఠి - సూర్య - పృధ్వీ - చంద్రాదులగు ననంతపిండములు వెలయును. ఆ పిండములందమృత వాయువు గూడ బ్రవేశించును. ప్రతి పిండమునందు నీ రెండు వాయువులును వేర్వేరు ప్రత్యేక యజుర్వేదములు. ఇట్లు ప్రతి యొక పిండమందలి ప్రాతిస్వికప్రత్యేక) వాయువులకునగు సంయోగముచే, ఘర్షణకలుగగా, ప్రతి పిండమందును భిన్నభిన్నమగు నగ్ని జనించును. ఈ యగ్నియే, ప్రతియొక పిండమునకును ప్రాతిస్వికమగు సంవత్సరాగ్ని, ఇది యన్నిటికంటె బ్రథమాగ్ని. ఎల్ల సృష్టులకు నిది మూలము.

వీనియందు పరమేష్ఠి పిండాగ్నిని, వరుణుడనియు, సూర్యాగ్నిని ఇంద్రుడనియు, పృథివీసంవత్సరాగ్నిని అంగిరయనియు నందురు. ప్రస్తుతమిట:- సూర్య సంవత్సరాగ్ని యింద్రునియొక్కయు, పృథివీ సంవత్సరాగ్ని అంగిర యొక్కయు సంయోగ ఘర్షణవలన బుట్టునొక నూతనాగ్ని క్రమమును చూతము. ఈ నూతనాగ్ని సూర్యునందు నుత్పన్నమగుచుండును గాని, దానిని వర్ణింపక, మన పృధ్వీపైననే దాని యుత్పత్తింగనుగొందము. తాత్పర్యమేమన :-

పృధివికొక వంక సూర్య ప్రకాశము రెండవ వైపున పృధివీచ్ఛాయ, ఈ రెంటికిని సంధిస్థానములు రెండు. సాయంసంధ్యయందు జ్యోతి స్థానమందు ఛాయయు, ప్రాతః సంధ్యయందు భూచ్ఛాయాస్థాన మందు, జ్యోతియు నాధానమగుచున్నది. ఈ యాధానమే సృష్టి మూలము. ప్రాతః సంధ్యయందు ఛాయ, వచ్చుచున్న సూర్యరశ్మితో ఘర్షణ సేయగా, కుమారాగ్ని యనునొక యగ్ని యుదయించును. సంవత్సరాగ్ని నుండియే యిది జనించును.

ఈ కుమారాగ్ని వాయువుయొక్క హెచ్చుతగ్గుల యాధానమునుబట్టి, న్యూనాధిక బలములనొంది, యా బలముల నట్లే బంధించి, భూతములు - పదార్థములు నాబడు భిన్న భిన్న ప్రకారములు గల యగ్నులం గల్గించును. వానిని క్రమముగ :- ఆత్మ - సూర్య - చంద్ర - ఆకాశ - వాయు - తేజ - జల - పృధువులందురు. ఇవి యెనిమిదియు కుమారాగ్ని వికారములు.

ఈ కుమారాగ్నినే రుద్రుడందురు, కనుక, రుద్రుడష్టమూర్తి, ఇట్లు ఎనిమిది వికారములొందుటవలన నీ యగ్నినే చిత్రాగ్ని యనియు బిల్తురు పరస్పరమేకమై యొక యగ్ని రూపమొందగా, నీ యగ్నినే పశువు - పాశుకాగ్ని యందురు. ఈ పాశుకాగ్ని (1) వైరాజము (2) వైశ్వానరము నని రెండు విధములు. శరీర పిండముంబుట్టించునది వైరాజము. ఇది మర్త్యము - చిత్రాగ్ని. దీనివలన శరీరమందలి యస్థిమాంసాది సప్తధాతువులును జనించును. (1) శరీర పిండమందు వేడిని నిల్పునది వైశ్వానరాగ్ని, ఇది యమృతము - చితేనిధేయాగ్ని శరీరకాగ్నియిదే. దీనివలననే అన్నజలములు పరిపక్వములగును. దీనిని వైశ్వానరాగ్ని యన గారణమేమన,

ఇది పృదివి - అంతరిక్షము - ద్యులోకము నను మూడు విశ్వములకు జెందిన, నర=మరుద్వాయువుచే నుత్పన్న మగుచున్నది. ఇక, వైరాజ మనుటేలయన :- విరాట్ = దశవిధాక్షరముల యోగమున నిది యుత్పన్నమగును గనుక. ఆ యీవర్ణనమంతయు విస్తరభయమున విడచెదము. మరొకచో నరయుదురు గాక!

ఇట్లు మూలమగు నొక యగ్నివలన (1) సంవత్సరాగ్ని (2) కుమారాగ్ని (3) చిత్రాగ్ని (4) పాశుకాగ్ని యను నాలుగగ్నులు వెలసినవి. ఇందు పాశుకాగ్నితోడనే జీవోత్పత్తి కెక్కుడు సంబంధము. విశేషించి, జీవుని భూతాత్మ యన్నది పాశుకాగ్నియే. మఱి, పృథివీ కేంద్రము నుండి, అంగిరా = అనగా పాశుకాగ్నియే, బయల్వెడలి త్రివృత్ (9) స్తోమము వరకు అగ్ని యనియు, పంచదశ (15) స్తోమము వరకు, వాయువనియు, ఏక వింశ (21) స్తోమము వరకు, సూర్యుడు = ఇంద్రుడు అనియు బిలువబడుచున్నది.

అగ్ని - వాయు - ఇంద్రులను నీ మూవురు దేవతలును ప్రాణస్వరూపులు. ఈ మూవురందును మూడు విధముల జీవులుత్పన్నులగుదురు. ఎట్లన:-

శరీరమందు కేవల మగ్ని ప్రాణమే ప్రవేశించి, హృదయ గ్రంధి స్థానమందు, వాయ్వింద్రుడు లేక యున్నపుడు, ముత్యము - రాయి - మొదలగు ధాతు = నిస్సంజ్ఞ జీవుడుత్పన్నుడగును ఇక, అగ్ని ప్రాణముతో వాయు ప్రాణముగూడ, నుండుచో, రెండాత్మలుగల వృక్షశాఖా ఫలాదులగు మూల = అంతః సంజ్ఞ జీవుడు వెలయును. మఱి వాయు ప్రాణముతో నింద్ర ప్రాణము కూడ నుండుచో, మూడాత్మలుగల క్రిమి - కీట - పశు - పక్షి - మనుష్యాదులగు చేతన = ససంజ్ఞ జీవులు జనింతురు.

ఈ మూడు జీవులందును, భూతాత్మ క్రమముగా వృద్ధి నొందును. కనుక, ఉత్తరోత్తర జీవుల తరగతి యుత్కృష్ట మగుచుండును. భూతాత్మయు (1) అగ్ని రూపము (2) వాయు రూపము (3) ఇంద్ర రూపము నని మూడు విధములు వీనిని వరుసగ (1) వైశ్వార (2) తైజస (3) ప్రాజ్ఞు లందురు. ఇట్లు భూతాత్మ రూపియగు నగ్ని మూడు విధములగుటకు గారణమేమన :-

(1) ఈ పాశుకాగ్ని యేదోయొక పిండము (రక్తమందనుడు, పృధ్వియందనుడు) నాశ్రయింపక యెన్నడును స్వతంత్ర రూపమున నుండదు. కనుక దానికి మూడవస్థలు కల్గుచున్నవి. ఇంతకును దాత్పర్యమేమన, పై జెప్పిన విధముగా మూడాత్మలు గల చేతన జీవులుత్పన్నులగుటతో, వాని యందు, క్షరాత్మ యొక్క పంచధాతువులు తమంత తామే వెలయును. అనగా, బీజ - దేవ - భూతచితులు. ప్రజా, విత్తములు నను నీ పంచధాతువులకును బ్రజ్ఞానాత్మతో సంబంధము. వైశ్వానర తైజసులతో సంబంధము లేదు. ఈ ప్రజ్ఞానాత్మ యన్నది భూతాత్మయందలి యింద్ర భాగము. ఇవి యుదయింపగనే, క్షరాత్మ యొక్క పంచావయవములు నుత్పన్నములగును; అవి దీనికి సంబంధించినవే యనుకొంటిమి గదా! ఇక,

(2) ఈ క్షరాత్మకు వెనువెంటనే స్వయముగా నక్షరాత్మయు వెలయును; ఏలయన:- భూతాత్మ స్వయముగ నగ్ని స్వరూపము. అది సోమము లేకుండ నుండదు. సోమావరణము వలననే పిండము తయారగును కదా! మఱియు, జీవవరీర మందుండు పాశుక రూపమగు నీయగ్ని బ్రహ్మయొక్క రూపాంతరము బ్రహ్మ కొకవంక, నగ్నీ షోమములవలె రెండవవంక నియమముగ, విష్ణు - ఇంద్రులుందురు కాగా, పంచాక్షరులందే యొక యక్షరుడు వచ్చినను, వెంటనే తక్కిన యక్షరులు నించుమించుగ తప్పక వెలయుదురు. మఱి.

(3) ఈ విధముగ అక్షర పంచధాతువులు రాగా, వానికాలంబన స్వరూపుడగు నవ్యయుని పంచధాతువులును వచ్చి వేయును. ఇక నిట్లు క్షరక్షరావ్యయ పంచ పంచకళల సమష్టి యేర్పడగా, తదాలంబనమగు పరాత్పర రూప షోడశ కళ యుండనే యుండును గనుక, షోడశీస్వరూపము సిద్ధించును ఇదే జీవషోడశిగా నెఱుంగదగును.

ఇందలి యవ్యయ పంచధాతువులన్నవే, ఆత్మల పంచకోశములు. వీనిలో నన్నిటికి బయట దన్నమయ కోశము ఇందు భౌతికాత్మ యుండును. ఇదే భూతచితి (1) దీని లోపలిది ప్రాణమయకోశము. ఇందింద్రాత్మ యనగా ప్రాణమయ ప్రజ్ఞాత్మ యుండును. ఇదే పంచదేవచితి యన్నదనుకొంటిమి. (2) దీనిలోపలిది మనోమయ కోశము. ఇందు మహదాత్మ యుండును. దీనికి బీజచితితో సంబంధము. (3) దీనిలోపలిది విజ్ఞానమయ కోశము. దీనియందు క్షేత్రజ్ఞాత్మ యుండును. (4) దీనికి లోపల దానందమయ కోశము ఇందు, శుద్ధ చిదాత్మ యుండును.

ఇట్లు అవ్యయ పంచధాతువులును, పంచకోశ రూపమున బరిణతినొంది, భిన్నభిన్నములగు నక్షరరూప పంచాత్మలను ధారణసేయును. ఆ పంచాక్షరాత్మలును, భిన్న భిన్న క్షర స్వరూపముల యుత్థాన - పతన - పరివర్తనములను గావింపుచు, సృష్టికి జెందిన యనేక విచిత్రములను జూపుచుండును. అక్షరుడు వికారముల నుత్పన్నము గావించి తన్నావరించు కొనుచు, నొకపుడు వీనిని విడచి శుద్ధస్వరూపము నొందుచుండును. ఇతిశ్రీ.

ఓం తత్సత్

ద్వితీయ ప్రసంగము సమాప్తము.

ఓన్నమః పురుషోత్తమాయ
గురవే మధుసూదనాయ

# శ్రీమద్బ్రహ్మ విజ్ఞాన పరిచయము



## తృతీయ ప్రసంగము

### "సర్వంఖల్విదంబ్రహ్మ"

ప్రత్యక్కు - పరాక్కునని బ్రహ్మ రెండు విధములు. ఇందు ప్రత్యక్కన్నది ఆత్మ పురుషుడు నందురు: పరాక్కన్నది విగ్రహము - పురము నందురు. ఈ రెంటియోగము వలన నీ సర్వ మాత్మన్వియందురు. ఇందు నాత్మ, (1) నిర్విశేష (2) పరాత్పర (3) ప్రజాపతియని మూడు సంస్థలు గలది. ఒక ప్రజాపతియగు నాత్మ దేనిచే నావరింపబడు నది (4) శరీరము - విగ్రహము. ఈవిధముగ నాల్గు పాదముల బ్రహ్మసిద్ధమయినది. క్రమముగ చూతము.

(1) నిర్విశేషము :- అమృతమృత్యువులగు సదసత్తు లేకముగా బ్రహ్మ. అమృతమగు రసము సత్తు. మృత్యువగు బలము అసత్తు ఉచ్ఛిత్తి - గతిలక్షణము గలది, అనంత భేదముగలది, ఖండఖండాయ మానమగునదియు బలము. అనుచ్ఛిత్తి - స్థితి లక్షణము గల్గి ఏకమేవాద్వితీయమై అఖండముగ నుండు బ్రహ్మరసము. క్షణికము, స్వలక్షణము, దుఃఖము, శూన్యమునగునది బలము. శాశ్వతికము, బల లక్షణము - ఆనందఘనమునగు పూర్ణము రసము. అణిమ బలము, భూమి రసము.

రసము నిర్విశేషము. విశేషకత్వమన్నది, అనువృత్తములో - వ్యావృత్తములో అగుధర్మములకే చెప్పవలయును. ఇక రసమన్ననో, నిర్ధర్మకము - అనవచ్ఛిన్నము కనుకనే విశేషమునకు యోగముండదు గదా! ఇట్లే బలమును నిర్విశేషమే. రసము నపేక్షింపని బలము శూన్యమగును. నిరుపాఖ్యమగు దానియందు విశేష వ్యవహార యోగముండదు గదా! ఇక,

రసము సర్వబలవిశిష్టమన్నను, బలము లనవరతము నుచ్ఛిత్తి రూపములు కనుక నసత్తులగుటవలన, జెప్పదలచినది సద్రూపమాత్రమే (కేవలరసమే) యగుచో, సర్వబలోపాధి వినిర్ముక్తము - అఖండము - నిర్ధర్మకము - దిగ్దేశకాలాద్యన వచ్ఛిన్నమునకు కేవలరసము నిర్విశేషమే. అది అనిర్వచనీయము ఏలయన,

ఏమైనను శబ్దశక్తి యన్నది యేదోకొంచెము ద్రవ్య - గుణ - కర్మాది ధర్మముంబట్టియేకదా కల్గును? అట్టి శక్యతకు ననువగు ధర్మమేమాత్రమును లేక, సజాతీయ - విజాతీయ - స్వగతభేద శూన్యమగు నారసమందొక్క శబ్ధమునకును బ్రవృత్తి యుండదుగదా! కనుకనే,

"సంవిదన్తి నయంవేదా విష్ణుర్వేద నవావిధిః
యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసాసహ".

"యస్యామతం తస్యమతం మతంయస్య నవేదసః
అవిజ్ఞాతం విజానతాం - విజ్ఞాత మవిజానతాం"

అని శ్రుతియందు, తదనిర్వచనీయత్వము, అవిజ్ఞేయత్వము వినబడుచున్నది. ఇందువలన,

రసమందు బలములున్నను, అవి రససత్తంబట్టియే సత్తావంతములగును గాన, నద్వైతమునకు వ్యాహతి లేదు. ఎందేని సంఖ్య, యన్నది సత్తనపేక్షించి యుండునుగాదా! ఇక, నేసత్త కేని స్వగతసత్తచే సద్వితీయత సంభావ్యము కాదుకదా!

(2) <u>పరాత్పరము</u> :- సర్వబల విశిష్టరసమగు నాత్మ, సర్వశక్తి మంతము, సర్వధర్మోపన్నము నగునది పరాత్పరము.

"సర్వాణిరూపాణి విచిత్య ధీరః నామానికృత్వాఽభి వదన్ యదాస్తే"
"యత్రనాన్య త్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్య ద్విజానాతి నభూమా"
"సర్వకర్మా - సర్వకామః - సర్వగంధః - సర్వరసః"

ఇత్యాది శృతులవలన, దిగ్దేశ కాలాద్యనవచ్ఛిన్నమగు రసము, బీజరూపాశేష బలవిశిష్టమని యెరుకపడుచున్నది. కనుక, నీ పరాత్పరమన్నది నిర్విశేష మయమగుటవలన, 'నిర్వికల్పక మనస్సు' అనియు నందురు.

నిర్విశేష పరాత్పరములకు, భేదాభేదములు :- సర్వబల విశిష్టమగు రసమందలి యన్నిబలముల కంటె వేరుగా, రస మాత్రము నెఱుంగనెంచునపుడా రసమందు 'నిర్విశేష' మని వాడుక. సర్వబల విశిష్టమేయని చెప్పదలచినపుడు 'పరాత్పర' శబ్ద ముండనేయున్నదిగదా! ఇట్లు భేదప్రతిపత్తి యున్నను, నిర్విశేషమునుండి యనవరతము నశేషబలోదయ విచ్ఛేదము లగుచుండుట తప్పదు కనుక, దాని బలవిశిష్టతకు వ్యభిచారము లేనందున, నిర్విశేష పరాత్పరము లుభయార్థమగు నొకేతత్త్వమని భావింపవలయును.

పరాత్పర ప్రజాపతులకు భేదాభేదములు :- చిన్నదో పెద్దదో వస్తువేదేని యొక్కడిదేని కానిండు, అన్నియు, నంతయు రసాలంబనముగల బల సంఘాతముగ దోచును. అయినను, రసమందు బలముల హెచ్చుతగ్గులంబట్టి వస్తుభేద జ్ఞానము కల్గుచున్నది కనుక నొక వస్తువునందేని, యవిశేషముగ సర్వబల విశిష్టత యన్నది యుండదు. అట్టిది సర్వవస్తు విలక్షణమును, ఈ యన్నిటికిని సమానరూపము నగునది ఆయొక్క పరాత్పరమే యనుకొందుము. ఇక, నందు బల తారతమ్యము బట్టి వేర్పడి యేర్పడు చిన్న పెద్ద రూపములు గల యీ యెల్ల యర్థములును త్రిపురుష ప్రజాపతులందుము. ఎట్లన:-

త్రిపురుష ప్రజాపతి :- బలము లనంతములయినను, సర్వబల ప్రధాన భూతము, అమితమును మితముగా జూపునదియు నగు ప్రథమబలము మాయ. దానిచే నపరిమితమగు నీ మనస్సు (పరాత్పరు) నందు మితి యేర్పడగా, దిగ్దేశ కాలాద్య వచ్ఛిద్య మానము పురుషుడను పేరుగల యొక యర్థమగును. మనకు వేర్వేరుగ నగపడుచున్న యెల్ల యర్థము లందొక్కొక్కటియు బ్రజాపతియని తెలియనగును. శ్రుతియు "యద్వైకించప్రాణి సప్రజాపతిః" అన్నది. ఆ పురుషునందు యోగమాయోదయ వశమున, అవ్యయ - అక్షర - క్షర యను మూడు వ్యక్తులుద్బుద్ధము లగుచున్నవి. వ్యక్తియన పురుషుడు. ఈ భగవద్వచనము లరయుడు:-

"ద్వావిమౌ పురుషౌలోకే క్షరశ్చాక్షర ఏవచ,
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే,
ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యోలోక త్రయమావిశ్య భిభర్త్యవ్య య ఈశ్వరః"

ఈశ్వరావ్యయుడు లోకత్రయవ్యాపి యన్న నిర్దేశము, శరీర వ్యాపియగు జీవావ్యయునకు నుపలక్షణము. మరియు, నా యవ్యయుడు పరిచ్ఛేదగ్రాహి అనుకొనుటకేగాని యది యతనికి లక్షణమనుకొనరాదు. ఇందుచే, సర్వ పరిచ్ఛేద శూన్యుడగు పరమేశ్వరావ్యయుని యవ్యయత్వమునకు వ్యాహతి యుండదు. ఇక, నానందాదు లవ్యయునకు లక్షణ భూతములగు ధర్మములగును. కనుక, అనవచ్ఛిన్నుడైనను అతనికి క్షరాక్షర సంబంధమునుబట్టి, యవిచ్ఛిన్నత యొప్పుచున్నది.

ఆ యీ మూవురు పురుషు లేకముగా, నొక పురుషుడు = 'ప్రజాపతి'. అవ్యయుని యభివ్యాప్తి యెంతో, అందక్షరుని వ్యాప్తియు, ఆ యక్షరునందు క్షరునివ్యాప్తియునంతంతే. క్షరమెన్నడు నక్షరమును అక్షర మవ్యయమును విడచియుండుట యుండదు. అవినాభూతము లీ మూడు నన్యోన్యసంబంధములుగ, నన్యోన్యముపకారకము లగుచునే యొక్కొక యర్థస్వరూపముగ నగును.

ఇందు, క్షరముపాదాన కారణము, కార్య ప్రపంచ భాగము(1). దానికి బ్రతిక్షణమును, వేర్వేరు వికారముల నుత్పాదించు నిమిత్తకారణభాగ మక్షరము(2). ఆ రెంటి కాలంబన భూతమై అంతరతమమై యుండి కార్య కారణములు లేక యుండునది యవ్యయ(3) మని ప్రతియర్థమందు నెఱుంగ వలయును.

(1) క్షరము :- మృత్యువు, అనృతము, దిక్కాలాది పరిచ్ఛేదములు కలది. పరిష్వంగి, (ససంగము) స్థానావరోధకము జ్ఞాన - క్రియాలంబనము. (2) అక్షరము :- అమృతము - సత్యము - మాత్రలుగలది - అసంగము - స్థానావరోధకము కానిది, జ్ఞానము నెడబాయనిది. కుర్వద్రూపము (3) అవ్యయము :- అభయామృతము, సత్యము. దిగ్దేశకాలాద్య నవచ్ఛిన్నము, అనాసంగి, స్థానానవరోధి, జ్ఞానము - నిష్క్రియము.

(1) క్షరమవరంబ్రహ్మ (2) అవ్యయము పరంబ్రహ్మ (3) అక్షరము పరావరంబ్రహ్మ.

"భిద్యతే హృదయగ్రంధిః - ఛిద్యంతే సర్వ సంశయాః
క్షీయంతేచాస్య కర్మాణి - తస్మిన్ దృష్టేపరావరే"

అని యక్షరము స్తుత్యమగుచున్నది. అక్షర ద్వారముననే యవరస్థములగు క్షరముల పరిశీలనము పరసారమగు నవ్యయమందు జరుగును. కనుక, శ్రుతియందక్షరమునకే సేతుత్వమును చెప్పబడినది.

అవ్యయ పంచపర్వములు :- పరాత్పరమగు మనస్సు నందు రెండు విధములగు నంతశ్చితివలనను, రెండు విధములగు బహిశ్చితివలనను, అవ్యయ స్వరూప మేర్పడును కనుక, నవ్యయాత్మ, ఆనంద - విజ్ఞాన - మనః - ప్రాణ - వాఙ్మయ మగుటవలన పాంక్తమని తెలియవలయును. (పాంక్తము = పంచావయవములు గలది) - శ్రుతియందును :-

"యః సర్వజ్ఞః సర్వవిద్యస్యైష మహిమాభువి,
దివ్యే బ్రహ్మపురే హ్యేషవ్యోమ్న్యాత్మా ప్రతిష్ఠితః"
మనోమయః ప్రాణశరీరనేతా ప్రతిష్ఠితోఽన్నే హృదయంసన్నిధాయ,
తద్విజ్ఞానేన పరిపశ్యన్తిధీరా, ఆనందరూప మమృతం యద్విభాతి"

అనుటచే, అన్న - ప్రాణ - మనో - విజ్ఞానా - నందములను పంచ కోశములచే నా యవ్యయాత్మ యుపలక్షితమగు చున్నది. దీనికంతకంటె ప్రాతిస్విక స్వరూపము లేదు.

ఇందు, ప్రాణ - వాక్కులను నవరార్థము సృష్టి సాక్షి, విజ్ఞా - నానందములను పదార్థము ముక్తి సాక్షి. మధ్యదగు మనస్సు పరాత్పర ప్రాయమది యవ్యయున కాత్మ, సర్వసాక్షి; కనుకనే అవ్యయము ద్వాదశ గుణమని భగవద్వచనము :-

"గతిర్భర్తా, ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయాం"

సర్వ ప్రథమావ్యయుని అద్వితీయత:- సజాతీయ నిజాతీయ భేదము లేనందువలన నీ యవ్యయ మొకటేయాత్మ. "క్షరాక్షరులచేతను, ఆనందాదులచేతను, భేదము తోచుచున్నదిగదా, కనుక ద్వైతప్రసక్తి రాదా" యన్నచో, రాదు. అవయవావయవుల కభేదము; స్వగత భేదముగల మనుష్య శరీరాదులందు ద్వైతోప పాదకత్వమున్నదా? ఇక, బ్రహ్మకు స్వగతభేదముంగూడ సహింపని వారి యభిప్రాయ మాత్మ నిర్విశేషమనియే. ఏలయన;

సర్వబల వైశిష్ట్యముచే పరాత్పరాది విశేషము లుత్పన్నములయినను, అసద్రూపమగు బలముకంటె వేరుగా, సద్రూప బ్రహ్మాభ్యుపపత్తి కల్గినప్పుడు, సర్వవిధములగు భేదములును నివృత్తములు = వ్యావర్తమానము లగు గదా! యని వారి మతము. ఇక :- సర్వ ధర్మోపపన్నమగు నీ యవ్యయాత్మకు, సవిశేషత యన్నది నియతము కనుక, స్వగతభేదమున్నను క్షతిలేదు. అంతమాత్రమున నద్వైతమునకు వ్యాహతి లేదుకదా!

అవ్యయమునకు, పురుషోత్తమత్వ, కారణత్వ - నిర్దోషత్వములు:-

ఈ యవ్యయమునందు, పురుష - అజ - మహాజన - పరశబ్దములు నిరూఢములు, ఉత్తమ పురుషత్వముంబట్టి పురుషోత్తమనామము.

"యస్మాత్ క్షరమతీతోఽ హమక్షరాదపి చోత్తమః
అతోఽస్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః" (గీత)

"తదవ్యయంతద్భూతయోనిం పరిపశ్యంతిధీరాః"

అను శ్రుతింబట్టి యీ యవ్యయ డక్షరావచ్ఛేదముచే సర్వ శక్తిమంతుడు కనుక సర్వకారణ భూతుడయినను, స్వరసభావమున, కార్య కారణాతిరిక్తుడనియే అరయదగును:-

"నతస్యకార్యం కరణంచ విద్యతే నతత్స మశ్చాభ్యధికశ్చదృశ్యతే
పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబల క్రియాచ"
దివ్యోహ్యమూర్తః పురుషః సబాహ్యో భ్యంతరోహ్యజః
అప్రాణోహ్యమనాః శుభ్రః అక్షరాత్పరతః పరః"
అశబ్ద మస్పర్శమరూప మవ్యయం, తథారసం నిత్య మగంధవచ్చయత్
అనాద్యనంతం మహతః పరంధ్రువంనిచాయ్యతం మృత్యుముఖా త్ప్రముచ్యతే

యఃసర్వజ్ఞః సర్వవిద్ యస్యజ్ఞానమయం తపః
తస్మాదేతద్బ్రహ్మ నామరూప మన్నంచ జాయతే॥
ఏకోదేవం సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సభూతాంతరాత్మ
కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః, సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ॥

ఇత్యాది శ్రుతులంబట్టి, సర్వవ్యాపి, నిరవచ్ఛిన్నమునగు పరాత్పరమునకే మాయా విశిష్టతవలన, నవ్యయుడను పేరు కల్గినది అతడకర్తయైనను, కూటస్థుడగు నక్షరునితో

గల నిత్య సంసర్గతచే, స్వరూప సత్తామాత్రముననే, ఆ యక్షర వ్యాపారములకు బ్రయోజకుడగుంగావున, కర్తయను కొందుము ఈ యభిప్రాయముంగొనియే, భగవద్గీతయందు :-

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మామబుద్ధయః
పరంభావ మజానన్తః మమావ్యయ మనుత్తమం"

అని యవ్యయాత్మకు గర్తృత్వము చెప్పబడినది.

ఈ యవ్యయాత్మ శరీర పరిచ్ఛిన్నతవలన, శరీరస్థుడైనను శరీర దోష యోగము నొందదు. శ్రుతియు నిట్లు వాకొనుచున్నది.

"ఏషత ఆత్మా సర్వాంతరో యోఽశనాయాపిపాసే
శోకమోహ జరామృత్యుమత్యేతి" "ఏషఆత్మాఽపహత
పాప్మా విజరోవిమృత్యుః విశోకో విజిఘిత్సోఽపిసః
సత్యకామః సత్యసంకల్పః"

కనుక నిది కామసంకల్ప సహితమయ్యును, క్షుధాది షడూర్ములు లేనివాడని తెలియనగును. ఆ విద్వత్కుల మాపామరం, ఆబాలవృద్ధం, ఆచేతన జడం అనగా, పండితుని మొదలు పామరునివరకు, బాలుని మొదలు వృద్ధునివరకు, చేతనము మొదలు జడము వరకు, నంతట నేకరూపము, శుద్ధమునని యెరుంగ వలయును. లింగ - వర్ణాది భేదములు లేనిది. పాపాత్ముడగు పురుషునకేని, యీ యాత్మ భాగమందు, అది యసంగమగుట వలన నేదోషము నంటదు.

అవ్యయ పరాత్పరులకు భేదాభేదములు:- మాయా పరవశత్వము (అవ్యయునకు) అపారవశ్యము (పరాత్పరునకు) నన్నదే భేదము ఎట్లన :- మొదట సర్వబల ప్రపంచకోశ రూపమగు మాయాబలము పరాత్పరు నాలంబముగా గొని యుండుటన్నది, సహచర భావముతోడనే కాని, చితిరూపముతో గాదు. కనుకనే, పరాత్పరునందు

మాయాసన్నిధానముంబట్టి ఆనంద, చేతనా, సత్తారూపములచే మూడు విధముల పరిచ్ఛేద ముండునన్నను, ఆ మూడును పరిచ్ఛిన్నములు గాక, యుండుటచే నన్యోన్యభేద మెఱుకపడదు కనుక, అస్తీత్యాకారోపలబ్ధి నాశవిరోధి యగుట వలన నానందమనునొకటియే, విశ్వార్థములకు సాధారణ ధర్మమగును. "అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే" "అస్యైవానంద స్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి" అని శ్రుతియు వక్కాణించుచున్నది. అనంతైకసత్తయే, బృహత్ - క్షుద్ర - అతిక్షుద్ర నానావిధ ప్రజాపతులందభి వ్యాపించుచు, ఆయా పరిమాణ యోగముంబట్టి పరిమితి గలదిగ భాసిల్లుచున్నది. చేతనానందములను గూడ నిట్లే యెరుంగవలయును.

పరాత్పరమన్నది మాయానిగీర్ణత లేనందుచే, పురుషులకంటె వేరైనది. అనగా పురుషు డనరానిదని భావము. శరీరావచ్ఛిన్నమగు నాత్మకే, పురిశయనమువలన, పురినివాసము వలన పురుషశబ్ద మొప్పును గాని, శరీరావచ్ఛేదము లేకున్నపుడు పురుషత్వ యోగమేది? కాని,

"గతాఃకలాఃపంచదశ ప్రతిష్ఠాః దేవాశ్చసర్వే ప్రతిదేవతాసు,
కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా, పరేవ్యయే సర్వఏకీభవన్తి॥
"యథానద్యఃస్యంద మానాః సముద్రేఽస్తంగచ్ఛన్తి నామరూపేవిహాయ
తథావిద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతిదివ్యం"

అనుచో, పురుష శబ్దము, పరాత్పరునకును జెల్లునన్నచో; కాదు, అచట, "అవ్యయపరాత్పరులతి సన్నిధానము గలవారు కనుక అవ్యయప్రాప్తి పరాత్పరప్రాప్తి కుపాయము," అని భావింపవలయును. లేదా, జీవునకు జెందిన 'పరు' డగు నవ్యయునితో సర్వము నేకీభవించిన యనంతర మంతకంటె బరుడును దివ్యుడు నగు నీశ్వరావ్యయ పురుషు నొందుననియైన మంత్రతాత్పర్య మరయనగును. ఆ యిరువురవ్యయులు నభిన్నులేకదా! కనుక విరోధము లేదు.

ఇక నాయీ నిరవచ్ఛిన్న పరాత్పర తత్త్వము మాయానిచయనము వలన, రెండు విధములుగ నిగీర్ణమగును (1) మహామాయచే (2) అవాంతరయగు యోగమాయచే. ఇందవాంతరయగు యోగమాయచే నీ పరాత్పర మనస్సు. పరిచ్ఛిన్నమై, అంతరమున, విజ్ఞానానందములను వానిచే రెండు విధములుగను, బాహ్యమున, ప్రాణవాక్కులను వానిచే రెండు విధములుగను, చితిభావమునొంది పాంక్తము (పంచావయవములు గలది) అగును. కాగా, ఆనంద విజ్ఞాన మనః ప్రాణవాక్కులను పంచావయవములుగయారూప 'మవ్యయ' మని పేరొందును. ఈ యవ్యయమునకు బరిచ్ఛిన్నతం గూరుచునది మహామాయ.

మహామాయా వేష్టనమున నేర్పడు రూప - నామ - కర్మలుగల భాగము ప్రజాపతి, ప్రాణావచ్ఛిన్నమగు నక్షరము, వాగవచ్ఛిన్నమగు క్షరమును, ఈ యవ్యయ మహామాయా వేష్టితములే యగుదురు కనుక, నవ్యయావచ్ఛేదముం జేసిన మహామాయయే ప్రజాపత్యవచ్ఛేదము గావించునదగును. క్షరాక్షర గర్భితావ్యయమే ప్రజాపతికదా: త్రిపురుష పురుషునందే ప్రజాపతి శబ్దము శ్రుతియు నంగీకరించు చున్నది. ప్రజా పతియగు నాత్మ, మాయావిశిష్టము కనుక, సవిశేషము, క్షరముతో నక్షరము, క్షరాక్షరులతో నవ్యయము. నెన్నడును వేర్పడవు. కనుకనే. ''తన్మధ్యపతితః తద్గ్రహణేన గృహ్యతే'' అను న్యాయముంబట్టి, క్షరగర్భుడక్షరుడక్షరుడనియు, క్షరా క్షరగర్భుడవ్యయు డవ్యయుడనియు నందురు. చివర కవ్యయునకే ఆత్మత్వ - ప్రజాపతిత్వములని, నిష్కర్షగ దేల్చబడుచున్నది దానింబట్టియే, ''తస్యకర్తారమపిమాం విద్ధ్య కర్తారమవ్యయం'' అన్న స్మృతియు సంగతమగుచున్నది. అక్షర విశిష్టావ్యయునకు గదా! సర్వశక్తి మత్త్వముంబట్టి కర్తృత్వ మన్నది కలుగును? విశుద్ధ స్వరూపమాత్రుడగు నవ్యయునకు నిష్క్రియతచే నకర్తృత్వమే కదా! విశుద్ధ - విశిష్టులకు భేదా భేదోపచారము వ్యవహార సిద్ధమే యని చెప్ప బనిలేదు:

ఇక, స్వయముగనో జ్ఞానాధిక్యము వలననో, మాయా బల వినాశము కాగా, ఘటధ్వంసముచే, ఘటాకాశమునకు మహాకాశత్వము వలె, ప్రజాపతికి పరాత్పరత్వము సంపన్నమగునని యెంచవలయును.

అవ్యయునకు, సచ్చిదానందత్వము:- ఆనందము - విజ్ఞానము - సత్త యని యవ్యయుని పరమరూపము. ఇందు, సత్త యన్నది, మనః ప్రాణ వాక్కుల, ముకుళిత - లేదా వికసితమగు నవస్థ. ఆ మూటిమొత్త మేకముగా - నొక శబ్దముగా - సత్త. మనస్సుచే విని యుక్తమగు ప్రాణము వాక్కు నధిష్ఠించుననుటయే, 'అస్తి' యన్నది. అర్థ - క్రియా - కారిత్వం సత్త్వమ్' అనువారు కూడ పై యర్థమునే చెప్పినట్లే. అర్థము = వాక్కు = క్రియ = ప్రాణము; కారిత్వమ్ = మనస్సు - మూటి సంఘాతము సత్త్వము, కనుక నవ్యయుడు సచ్చిదానందుడు.

అవ్యయున కశరీరత్వము, అనంతాయతన యోగిత్వమును:- అవ్యయునకు నియతాయతనము లేనందున, నశరిరియగుటచే, బిందు - తిల - హస్తి - పర్వతాది, క్షుద్ర - బృహన్నా నావిధ విషయావగాహియగు మనస్సునకు, విషయ పరిమాణ గ్రాహిత్వముంబట్టి క్షుద్ర బృహదాయ తనత్వముప పన్నమయినట్లే, యీయనకును, క్రిమి - కీట - పశు - పక్షి మనుష్యాది విగ్రహావగాహిత్వ స్వాభావ్యయముంబట్టి, ఆయా విగ్రహ పరిమాణావిచ్ఛిన్న ప్రతిపత్తి నంగీకరింతుము. శ్రుతియు వాకొనుచున్నది:-

> "అణోరణీయాన్ మహతోమహీయా నాత్మాస్యజంతోర్నిహితోగుహాయాం
> తమక్రతుఃపశ్యతి వీతశోకః ధాతుః ప్రసాదాన్మ హిమానమాత్మనః।"

> "ఏషమఆత్మాన్తర్హృదయేఽ ణీయాన్ వ్రీహేర్వా యవాద్వా సర్షపా
> ద్వా, శ్యామాకాద్వా, శ్యామాకతండులాద్వా, ఏష మ ఆత్మాన్తర్ హృద
> యే, జ్యాయాౝ పృథివ్యా, జ్యాయాసంతరిక్షాత్ జ్యాయాన్దివో,
> జ్యాయానేభ్యః - లోకేభ్యః - సర్వకర్మా - సర్వకామః - సర్వగంధః
> సర్వరసః - సర్వమిద మభ్యాత్తో, ఽ వాక్య నాదరః : ఏషమ ఆత్మా
> అంతర్హృదయే, ఏతద్రహ్మా - ఏతమితః ప్రేత్య - అభిసంభవ
> తాస్మీతి, యస్యస్యాదద్ధా - ననిచికిత్సా స్తీతిహస్మాహశాండిల్యః"

ఆ యొకే ఆత్మ, స్వయముగ ననవచ్ఛిన్నమయ్యు, మహద్విగ్రహమందు మహత్పరిమాణము గలదియు, అల్ప విగ్రహమందల్ప పరిమాణము గలదియు నగును. కాని, యదే సర్వ విగ్రహోపాధి రాహిత్యమున, విశుద్ధ స్వరూపమాత్రముగా జెప్పనెంచుచో, నిస్సీమము, పరాత్పరమట్లు నిరవచ్ఛిన్నము, పరమేశ్వరుడు అనవలయును.

త్రిపురుష ప్రజాపతికి విగ్రహాయ తనోపాధింబట్టి త్రైవిధ్యము. ఈ యవ్యయాత్మ స్వపరిగృహీత విగ్రహ పరిమాణోపాధి వశమున, మహీయసుడో, అణీయసుడో అగు గాక, అపుడు 'చిదాభాసు' డనిపించుకొనును. పెద్ద యద్దమందు సూర్య ప్రతిబింబము పెద్దదిగను, గోటియందు చిన్నది గను కన్పట్టును గదా! ఆయన, సర్వాధిక బృహత్సీమ కలవాడగుచో (నీశ్వరుడను) చిదాభాసు డనిపించుకొనును, అంతకంటె నల్పాల్ప సీమలు గలవారగుటవలన, తదంతర్గతులగు నెల్ల చిదాభాసులును, ప్రతిబింబత్వ - అర్ధేంద్రత్వ - అవిద్యా క్రాంతత్వములను బట్టియు, క్లేశ - కర్మ - విపాక - ఆశయములచే పరామర్శింపబడుటం బట్టియు, జీవులను మరొక పేరొందుదురు. ఈవిధముగ :-

అవ్యయునకు, నిస్సీమత్వ - బృహత్సీమత్వ - అల్పసీమత్వ భేదమున (1) పరమేశ్వరుడు (2) ఈశ్వరుడు (3) జీవుడు అని మూడు భేదము లేర్పడును. ఇందు, విగ్రహాభిమానము వలన, నీశ్వర - జీవులకు 'శారీరకు' లని పేరు. పరమేశ్వరావ్యయునకన్ననో, పరాత్పరునకువలె విగ్రహాభి మానముండదు కనుక, 'శారీరక' త్వము లేదు.

విగ్రహస్పర్శ లేనపుడు జీవేశ్వర పరమేశ్వరు లేక తత్త్వమే:- జీవేశ్వర విగ్రహములందు గొన్ని ధర్మములను బట్టి భేదమున్నను, ఆ శరీరాభిమానముగల, జీవాత్మ - ఈశ్వరాత్మలకు భేదము లేదు. క్షరాక్షరులతో నిత్యయుక్తుగడగు నవ్యయుని యానందాది ధాతుపంచకమున కుభయత్ర సామ్యమే కదా! ఈ శ్రుతివచనము లరయుడు:-

(1) "యదేవేహ తదముత్రయదముత్రతదన్విహ
మృత్యోఃసమృత్యు మాప్నోతి య ఇహనానేవ పశ్యతి"

(2) మనసైవేద మాప్తవ్యం, నేహనానాస్తికించన
మృత్యోఃసమృత్యుం గచ్ఛతి య ఇహనానేవ పశ్యతి

(3) అంగుష్ఠమాత్రః పురుషః జ్యోతిరివాధూమకః,
ఈశానోభూత భవ్యశ్యసఏవాద్యసఉశ్వః

(4) యధోదకం దుర్గేవృష్టం సర్వ తేషువిధావతి
ఏవంధర్మాన్ పృధక్పశ్య౯ తానేవాను విధావతి

(5) యధోదకంశుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి
ఏవంమునేర్వి జానత్వ ఆత్మాభవతి గౌతమ।

ఇందు (1) యత్ - తత్ అన్న వానిచే పురుష ధాతువులు చెప్పబడినవి కనుక అమృతమగు నాత్మ భాగమున కుభయత్ర భేదము లేదనియే యభిప్రాయము. మృత్యుమయ విగ్రహ భాగములందు, మృత్యు భేదముంబట్టి భేదములుండును. కనుకనే యిందు భేదముంజూచువాని, భేదదృష్టి, మృత్యువు వంక కీడ్చును. వాని యమృతాత్మ మృత్యువుచే గూడననువాసితమై మృత్యు సంబంధమునకు దగినదగును. కనుక, మనకు దోచు జీవేశ్వర భేదము, విగ్రహమునకు జెందినదియు, అమృతమగు నాత్మయందు లేనిదియు నగుటచే భేద భాగమందు దృష్టి యుంపక, జీవేశ్వరాత్మ లభేదములని యుపాసింపవలయును. ఇక, విగ్రహ భేదముంబట్టి భిన్నతనొప్పిన యాత్మల కభేదము నెంచ శక్యమగునా? యన్నచో

(2) మనసుచే నాయభేదము నొందవచ్చును. అనగా, విషయభేద భిన్నమగు మనోదృష్టాంతముచే నీయభిన్నతం బొంద శక్యమగునని భావము. ఆ దృష్టాంతముచే నాత్మ, భిన్నత యన్నదించుకయు మిగులదు. ఏమేని యున్ననది యనాత్మికమగు మృత్యు భాగ మాత్రమునకు జెందినదగుటచే పరిత్యాగమే. ప్రజాపతి, అమృత మృత్యుమయుడు గదా!

"ఉభయంహైతదగ్రే ప్రజాపతిరాస, మర్త్యంచైవామృతంచ,

తస్యప్రాణా ఏవామృతా ఆసుః శరీరమ్ మర్త్యమ్"

అని శ్రుతివచనము. అట్టి యీ ప్రజాపతిని నానాత్వమున జూచువాడు, మృత్యుమయ విగ్రహమునకు జెందిన ధర్మ భేదరూపమగు మృత్యువునే దృష్టిద్వారా యవగాహించు కొనును గాని, యమృతాత్మ నవగాహించుకోజాలడు. అమృతమగు నవ్యయాత్మ యన్ననో,

(3) పరజ్యోతి యగు నీశ్వరాంశ భూతము కనుక, నిర్ధూమజ్యోతివలె, నీ జీవ విగ్రహమందు ప్రతిష్ఠితిమై, అంగుష్ఠమాత్రమయ్యును, లోమములు మొదలుగ నఖాగ్రముల వరకు సర్వశరీర యష్టియందు నభివ్యాప్తి నొంది, భూత - భవిష్యత్, అద్యతన - శ్వస్తనములగు సర్వ ధర్మములను పాలించును. శరీరమునకు జెందిన, అన్నాదాన, మలవిసర్గములు, రస - ధాతు వికారములును, ఈ యాత్మ సత్తాధీనములు గదా! మఱి, అంగుష్ఠమాత్రమయ్యు, నీ సర్వ శరీర యష్టియందభి వ్యాపించు టెట్లన్నచో,

(4) పర్వతదుర్గమందు వర్షించిన జలము, పర్వతమునకు దూరముగానున్న శుష్కప్రదేశములం దార్ద్రత గూర్చుచు, సంస్రవించునట్లు, ఇటను, పరజ్యోతి యగు నీశ్వరునుండి యాహితమై హృదయమందుండు చైతన్యజ్యోతి యంగుష్ట మాత్రమే యైనను, శరీరమందలి యెల్ల యంగములందు నభివ్యాప్తి నొందుచు, జడములగుట వల్ల వేర్వేరు ధర్మములగు నీ శరీర ప్రదేశములం దనువ్యాప్తి నొంది, చేతనము గలవాని నొనర్చును. సరియే, ఇట్లు, ఈశ్వరాత్మకు జీవ విగ్రహమందు జీవాత్మ భావముచే నభివ్యాప్తి యుండును. కాని, ఇక :- జీవాత్మ జ్యోతికి, మరల నీశ్వరజ్యోతియందు సాయుజ్యమున, భేదోపపత్తి యట్లన్నచో,

(5) లవణ - సికతా - తైల - సిందూరాది ధర్మాంతరములచే గలుషితమయిన జలము, ధర్మాంతర కలుషితమో, విశుద్ధమో అగు జలమందు పోయుచో, నా రెంటి యోగఫలమగు వికారము స్పష్టముగా దెలియబడును. కాని, శుద్ధ జలమందు శుద్ధ జలమునే

పోయుచో నేకభూయమే యగును. ఇట్లే - అవిద్యా - కామ - కర్మ భేదాది మృత్యు ధర్మములచే గలుషితమగు జీవాత్మ విశుద్ధమగు నీశ్వరాత్మయందుపాసన క్రియచే సంయోజితమయ్యు నేకత్వము నొందజాలదు. కాని, మృత్యుధర్మములను వీడి విశుద్ధ విద్యచే నాక్రమించు జీవాత్మ బ్రహ్మభూయమునకు దగినదగును. శ్రుతియు "బ్రహ్మ విద్బ్రహ్మైవభవతి" యన్నది.

ఈవిధముగ జీవేశ్వరాత్మలకు విగ్రహరూపమగు నుపాధికి జెందిన భేదమున్నను, ఆ యుపాధి వ్యావృత్తము కాగా, నభేదమే పర్యవసించును, కనుకనే, నిరుపాధికుడగు పరమేశ్వరునితో గూడ నభేదము సిద్ధమగును. ఇట్లు త్రిపురుషకము, పంచధాతుకమునగు నాత్మ, పరమేశ్వరుడు, నీశ్వరుడు ననియు జీవుడనియు జెప్పబడును. విగ్రహస్పర్శ యున్నపుడు విగ్రహాయతనమూలకమగు నాయతన భేదమును బట్టి "విశేషణ ధర్మభేదమువలన విశిష్టభేద" మను న్యాయము చొప్పున, నాత్మకు త్రైవిద్య మేర్పడునని మున్నను కొంటిమి గదా! అట్లే, త్రిపురుష ప్రజాపతి, అనుపసర్గత్వ - సోపసర్గత్వములను బట్టి, (1) ఆత్మ - (2) ఆత్మన్వియనబరగును, క్షరాక్షర సహాయ మవ్యయ మాత్మ. దానికి నిస్సీమత్వ - బృహత్సీమత్వ - అల్పసీమత్వాదికమగు నౌపాధికానంతాయతనత్వ మున్నను; ఏకత్వ మునకు వ్యాహతి లేదు; ప్రతిబింబసూర్యు లెంతమందియైనను, సూర్యుని యేకత్వమునకు వ్యాహతి లేదుకదా! ఇక, విగ్రహ భేదమువలన, ఆత్మన్వులగు ప్రజాపతులన్నినో, - పరమేశ్వరుడు - ఈశ్వరుడు - జీవుడునని మూడు విధములగుదురు. విగ్రహ మున్నంత వరకు వారి కేకత్వ మొప్పదని తెలియనగును.

అక్షరపురుషుడు :- అన్యోన్య సంహిత క్షరాక్షరావ్యయము ఆత్మాయనియు, ఆత్మయు, విగ్రహము నేకముగా, నాత్మన్వియనియు నీవర కనుకొంటిమి గదా! ఇక భిన్నాత్మలగు క్షరములు విగ్రహము, ఆ యీ విగ్రహము అక్షరమువలన నుత్పన్నమగును. కనుక అక్షరమును గూర్చి తెలిసికొందము.

ఇది కర్మమయము, సర్వశక్తి ఘనము, సర్వ జగత్కారణ భూతము, కనుక, అనవరతకుర్వ ద్రూపముగ బ్రవర్తించును. అవస్థాభేదమున నిది ద్వివిధము. అనుద్భూద్ధ సర్వశక్తిగల యవ్యక్తావస్థ మొదటిది. దీనినే కొందరు ప్రధానమందురు. ఉద్బుద సర్వశక్తిగల వ్యక్తావస్థ నొందునిదే రెండవది. దీనినే కొందరు మహత్తందురు. ఇదే ఆకృతి; దీనినుండియే, సర్వభూతయోనులలందును, వేర్వేరు స్థూల శరీర రూపములుగల మూర్తులగపడుచున్నవి. ఇదే ప్రకృతి; దీనినుండియే, సర్వభూత యోనుల, భిన్న భిన్న సూక్ష్మశరీర రూపములు గల స్వభావము లగపడుచున్నవి. ఇదే అహంకృతి; దీనినుండియే సర్వభూత యోనుల, యనాద్య విద్యావాస నామయకారణ శరీర ముత్పన్నమగు చున్నది. ఎల్లప్రజల పుట్టుకయు నహంకారము నుండియే మహదక్షర కార్యవిశేషమే యహంకారము. ఆధి భౌతికాధ్యాత్మికాధి దైవికాధి యజ్ఞికములగు నెల్ల వికారములు నీ మహదక్షరము నుండియే. దీనికి గూడ, నవ్యయ నిత్యత్త్వము నవ్యయతాదాత్మ్యము గలదు. అందుచే నొక్కొకచో దీని నవ్యయమనుటయు గలదు. "తాత్స్థ్యాత్ తాచ్ఛబ్ద్యమ్" అను న్యాయము కలదు గదా! కనుకనే అవ్యయధర్మములగు విభుత్వాదులు దీనియందారోపింపను వచ్చును. ఈ శ్రుతులను వినుడు :-

"అదృశ్యమగ్రాహ్య మగోత్రవర్ణ మచక్షుః శ్రోత్రం తదపాణిపాదం
నిత్యం విభుంసర్వగతం సుసూక్ష్మంతద్భూతయోనిం పరిపశ్యన్తిధీరాః"
యస్తూర్ణనాభ ఇవతంతుభిః ప్రధానజైః స్వభావతః
దేవఏక ః స్వమావృణోతి సనోదధాతు బ్రహ్మావ్యయం
యథోర్ణనాభిః సృజతే గృహ్ణతేచ, యథాపృధివ్యా మోషధయః సంభవన్తి
యథాసతః పురుషాత్ కేశలోమాని, తథాక్షరాత్ సంభవతీ హవిశ్వం
యథాసుదీప్తా త్పావకాద్వి స్ఫులింగాః సహస్రశః ప్రభవన్తే సరూపాః
తథాక్షరాద్వివిధాః సోమ్యభావాః ప్రజాయన్తే తత్రచైవాపియన్తి
అగ్నిర్యథైకోభువనం ప్రవిష్టః రూపంరూపం ప్రతిరూపో బభూవ

ఏకస్తథా సర్వభూతాంతరాత్మరూపం రూపం ప్రతిరూపో బహిశ్చ
సూర్యోయథా సర్వలోకస్యచక్షుః నలిప్యతే చాక్షుషైః బాహ్యదోషైః
ఏకస్తథా సర్వభూతాంతరాత్మ నలిప్యతే లోకదుఃఖేన బాహ్యః
ఏకోవశీనిష్క్రియాణాం బహూనాం, ఏకంబీజం బహుధాయః కరోతి
తమాత్మస్థంయేఽ నుపశ్యన్తి ధీరాః, తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం
నిత్యోనిత్యానాం, చేతనశ్చేతనానాం, ఏకోబహూనాం యోవిదధాతి కామాన్
తత్కారణం సాంఖ్యయోగాధిగమ్యం, జ్ఞాత్వాదేవం ముచ్చతే సర్వపాశైః
యదర్చిర్మద్, యదణుభ్యోఽ ణు, యస్మిన్ లోకానిహితాలోకినశ్చ
తదేతదక్షరం బ్రహ్మ సప్రాణస్తదువాఙ్మనః

ఇందువలన, నిత్యానిత్య చేతనాచేతన సర్వవిధ ప్రాణి శరీరములందును, ఆయా యోని వైశేషిక మూర్త్యాకార సమర్పకత్వము అక్షరమునకు గలదని తెల్లమగుచున్నది. భగవంతుడు నిట్లు సెలవిచ్చుచున్నాడు:-

"మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భందధామ్యహం
సంభవః సర్వభూతానాం, తతోభవతి భారత
సర్వయోనిషుకౌంతేయ మూర్తయః సంభవన్తియా
తాసాం బ్రహ్మమహద్యోని రహంబీజప్రదః పితా"

కనుకనే, స్వగతభేద శూన్యమగు నవ్యయమునకు, అక్షర సంబంధ నిబంధన కర్మ విశేషతవలన, మనః ప్రాణ వాక్కులను మూడు భేదములు కల్గునని యక్షర శ్రుతియందు, "సప్రాణస్తదు వాఙ్మనః" అని వినియున్నాము. ఇంక నీ యక్షరస్తుతింగూడ నరయుడు:-

"యదూర్ధ్వందివః, యదర్వాక్, పృధివ్యాః, యదంత రాద్యావా పృధివీ, ఇమే, యద్భూతంచ - భవచ్చ - భవిష్యచ్చేత్యా చక్షతే. ఆకాశేయదోతంచ ప్రోతంచ॥ కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి? ఏతద్వై తదక్షరం బ్రాహ్మణా అభివదన్తి, అస్థూల, మనణు - అహ్రస్వ - మదీర్ఘ - మలోహిత - మస్నేహ - మచ్ఛాయ - మతమో - అవాయు -

అనాకాశ - మసంగ - మరస - మగంధ - మచక్షుష్క - మశ్రోత్ర - మవా - గమనో, అతేజస్క - మప్రాణ - మముఖ - మమాత్ర - మనంతర - మబాహ్యామ్, నతదశ్నాతి కించన, నత దశ్నాతి కశ్చన; ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే సూర్యా చంద్రమసౌ విధృతౌ తిష్టతః; ద్యావా పృధివ్యౌ విధృతౌ తిష్టతః; నిమేష - ముహూర్తా - అహోరాత్ర్యా ణ్యర్థమాసాః - మాసా - ఋతవః - సంవత్సరాః విధృతాస్తిష్ఠన్తి; ప్రాచ్యోన్యాఽ నద్యః స్యందన్తే, శ్వేతేభ్యః - పర్వతేభ్యః - ప్రతిచ్యోఽ న్యాః - ఏతస్మిన్ను ఖల్వక్ష రే - ఆకాశ - ఓతశ్చ ప్రోతశ్చ"

ఈశ్వర విగ్రహమందు 'బార్హ స్పత్య సాహస్ర' మను నాకాశమున్నది. అందీమన త్రైలోక్య మోతప్రోతముగ నున్నదని తెలియవలెను. మరల నా యాకాశము వారుణ సముద్ర సహితముగ, పరజ్యోతి యగు స్వయంభువు యొక్క అక్షర సాహస్రమందు పరిగృహీతమై - తదధీనపృత్తికమై నిత్య ప్రోతముగ నుండును. ఆ యొక్క యక్షరమే, అందరకు, నన్నిటికి సామాన్యమగు పరథామనియు, నంతకు బరమేమియు లేదనియు పై శ్రుతి తాత్పర్యము.

ఇట నక్షర మహిమ మాత్రమే ప్రదర్శింపబడినను, అది యవ్యయా వినాభూతము కనుకు త్రిపురుష ప్రజాపతి యందు వలె నీ త్రైలోక్యాదులకు నోత ప్రోత భావమని తెలియదగును. లేదా, ప్రజాపతి యందైనను. అవ్యయ ధాతువగు ప్రాణమునకు జెందిన యీ యక్షరుంబట్టియే, శాసన కర్మ సాగును గాన దాని (కర్మ) కుపాదాన మక్షరమనుట యుక్తము.

ఇంతకును జెప్పినది పరజ్యోతియగు నీశ్వరునకు జెందిన యక్షరకర్మ. ద్యావాపృథువుల, సూర్యా చంద్రాదుల విధరణమన్న దాయక్షరమందే యొప్పును. అయితే, మనయందును క్రిమికీట తృణలోష్ఠాదులందును ఈ యక్షర కర్మయనువర్తించుట లేకపోలేదు. కాని, ఒక జలబిందువు దప్పిక తీర్పజాలనట్లు, అల్ప మాత్రమగు మన యక్షరమున కాపాటి శక్తి యెక్కడిది? అయినను, సర్వోపాదానత్వ - సర్వ భోక్తృత్వములవలె నీ సర్వశాస్తృత్వమును అంతట నుండుననియే యెంచ వలయును. ఈ విషయము 'అక్షరత్రైధాతవ్య' మను శీర్షిక యందు తెలియగలము.

అక్షరమున కవ్యయ నిత్యత్వము :- అవ్యయభిన్నమయ్యు తదవినాభూతమగుటచే నక్షరము తదేక భావము గలదే కనుక, నా యవ్యయ ధాతువులగు మనః ప్రాణ వాక్కులచే రూపొందినదనియే తెలియనగును. అరయుడీ శ్రుతివచనములను :-

"తదేకమేవాక్షరం వౌగితి, తదేష సర్వోఽగ్ని రభి సంపద్యతే, తద్ధైతత్, పశ్యన్ ఋషి రభ్యనూవాద "భూతం భవిష్యత్ ప్రస్తౌమి మహద్బ్రహ్మైక మక్షరమ్" ఇతి. ఏతద్ధ్యేవాక్షరం సర్వేదేవాః సర్వాణి భూతాని అభిసంపద్యన్తే."

అనగా :- వౌక్ అను నక్షరము 'ఓ' గర్భితయగు వాక్కు, (వా + ఓ + అక్ = వౌక్) ఓ యన్నది (అ+ఉ) అకార ఉకారముల యేకరూపము. సాదృశ్యమును బట్టి యా రెండక్షరములచే మనః + ప్రాణములు లక్ష్యములగుచున్నవి. కాగా, మనః ప్రాణగర్భితయగు వాక్కే 'వౌక్' అను శబ్దముచే సూచింపబడుచున్నది. ఏకమగు నా యక్షర బ్రహ్మయే, యీ సర్వజగదర్ధరూపమగు నగ్నిగా వెలసినది. "భూతం భవిష్యదని మంత్రశ్రుతి యా యర్ధమునే యనువదించుచున్నది.

"ఇంత వరకు బుట్టిన, ముందు పుట్టనున్న వానింగూర్చి కారణరూపమున బ్రస్తావింతును. అదొకటే యక్షరము మహాద్బ్రహ్మ" అనగా, బ్రహ్మయగు మహదక్షర మొకటే అయినదియు కానున్నదియు నని భావము. దేవతలన్న వారందరు నమృతమగు చితేనిథేయాగ్ని. భూతములన్నవెల్ల మర్త్యమగు చిత్యాగ్ని. ఆ యీ జగత్తంతయు నగ్నిమయము. మహద్బ్రహ్మ యొక్క రూపము. సర్వ క్షర రూపములు నీ యొక యక్షరమేయని మంత్రశ్రుతి భావము.

అక్షర త్రైధాతవ్యము :- అనగా నక్షరుని మూడు ధాతువులను గూర్చి తెలిసికొందము:-

"భూతం భవిష్యత్ప్రస్తౌమి, మహద్బ్రహ్మై
కమక్షరం" "బహుబ్రహ్మైకమక్షరం"

అను మంత్రముం గూర్చి శ్రుతి వివరించుచున్నది :-

“తదేతద్బ్రహ్మ క్షత్రంచ; అగ్ని రేవ బ్రహ్మ-ఇంద్రః క్షత్రమ్; ఇంద్రా గ్నీవైవిశ్వేదేవాః; విడ్విశ్వేదేవాః; తదేతద్ ‘బ్రహ్మక్షత్రం విడ్’ ఇతి.

“ఏతద్ధస్మవైవిద్వాౕ‘శ్యాపర్ణఃసాయకాయన’ అహ:- సఏష ఏవశ్రీః - ఏషయశః- ఏషోఽన్నాదః;

ఏతద్ధస్మవైతత్ “శాండిల్యో వామక క్షాయణాయ” ప్రోచ్యోవాచ:- శ్రీమాౕ-యశస్వీ - అన్నాదో భవిష్యసీతి”

“ఆ యీ యక్షరము, బ్రహ్మ - క్షత్రములు ; అగ్నియే బ్రహ్మ; ఇంద్రుడు క్షత్రము; ఇంద్రాగ్నులు విశ్వేదేవులు. వైశ్యము విశ్వేదేవులు.

ఇది తెలిసిన సాయకాయన శ్యాపర్ణుడు; ఇదేశ్రీ, ఇదే యశము, ఇదే అన్నాదము అనగా, నీ విషయమును, శాండిల్యుడు వామ కక్షాయణునకు జెప్పి, శ్రీమంతుడవు, యశస్విని, అన్నాదుడవు నైతివనెను” ఇందు క్షత్రముశ్రీ; బ్రహ్మ యశస్సు; విడ్ అన్నాదము.

అక్షరత్రయ కర్మలు :- (1) శాంతి (2) ప్రతిష్ఠ, (3) విధరణము, (4) వికాసము, ఇవి బ్రహ్మ యొక్క యశఃకర్మలు. (2) పరాక్రమము - వృత్రవధ - శాసనము - విక్షేపణము, ఇవి యింద్రుని శ్రీ కర్మలు (3) విక్రమము అశనాయా, యజ్ఞము - ఆకర్షణము. ఇవి విష్ణుని యన్నాదకర్మలు.

(1) ఇంద్ర విష్ణువులు, అన్యప్రజాపతి నూతగా గొని కర్మ సేయుదురు. కనుక వారికర్మ క్షోభలక్షణము గలదగును. బ్రహ్మ యన్ననో, తన కర్మయందితరము నపేక్షింపదు గాన, శాంతము, (2) రసాత్మకములగు సత్తా - చేతనా - ఆనందములును బలాత్మకములగు నామరూప కర్మలును అన్యోన్య విధరణమున నుండుటన్నది ప్రతిష్ట. మఱియును, తనయందుంపబడిన యితరములు తన యంగములందంతర్భాగముచే సమీకృతములై ప్రచ్యవనము నొందకుండుట (స్థిరముగా నుండుటయు) బ్రతిష్ఠయే. (3) ధర్మముల యన్యోన్య సమన్వయము విధరణము (4) స్వరూప భ్రంశము లేక, అపూర్వార్థము

నుద్భావించుటో, ఉత్పాదించుటో చేయునట్టి యుద్బోధము వికాసము. అపూర్వములు, బల విశేషములు నగు నామరూప కర్మలు, బ్రహ్మరసమగు సత్తయందో, విజ్ఞానమందో ప్రవేశింపగా కల్గు నుపలంభన ముపలబ్ధియు వికాసమే. ఇవి బ్రహ్మ యొక్క కర్మలు ఇక:-

(1) పర ప్రజాపతిని తన బల ప్రసారమందంతర్భావము నొందజేసి, తన యధీనము గావించుకొను సాధనము పరాక్రమము. (2) స్వకీయబ్రహ్మ ప్రతిబంధి ధర్మములను ప్రతిషేధించుట, వృత్రవధ. (3) నిగ్రహాను గ్రహములచే పరిగ్రహింపబడిన పరబలమును తన బలమున కనుగామిగా జేసికొన, జేయు నియమనము శాసనము. (4) స్వకీయ బ్రహ్మప్రతిష్ఠకు భంగము లేకుండ నందలి ధర్మములను విస్రంసన మొందజేయననువగు వృత్తి, విక్షేపణము. ఇవి యింద్ర కర్మలు మఱి,

(1) తన చోటును విడువక ప్రదేశాంతరము నవగాహించుట, విక్రమణము. (2) స్వకీయ బ్రహ్మసాక్షిత్వమున బ్రవర్తిల్లు యజ్ఞమందాహుతి పరిక్షయము వలన నన్న గ్రహణమునకై యర్క (జ్వాల)ను నియోగించు మనోవృత్తి శాసనము. (3) బ్రహ్మాత్మకమగు నగ్నియం దాహూయమానమగు నన్నమునకు స్వరూప విధ్వంసము కాగా, ఊర్క్త్వము నొందు నగ్ని రూపము నాపాదించుట యజ్ఞము. ఇట, అగ్నీ షోములు బ్రహ్మ యొక్క రూప విశేషములు, వ్యూహాను వ్యూహ లక్షణము గల విగ్రహమందు సంభవించు వారయినను, త్రిపురుష విద్య యందుగూడ, నీ బ్రహ్మ యొక్క వాక్కు గలంతవర కగ్నియనియు, అది యన్యతః యాహరించు నన్నము సోమమనియు, నారోపితాగ్ని షోములుగా నెఱుంగదగును. "అగ్నిర్వై యోనిర్యజ్ఞస్య సతతః ప్రజాయతే" అను శ్రుతిచే అగ్ని లేని యజ్ఞ స్వరూపసిద్ధి లేదుగదా! బ్రహ్మ కగ్నిత్వము శ్రుతి చెప్పుచున్నది. "అథేంద్రాగ్నీవా అసృజ్యేతాం, బ్రహ్మ క్షత్రంచ, అగ్ని రేవ బ్రహ్మ - ఇంద్రః క్షత్రమ్; తౌ సృష్టౌనా నైవాస్తామ్, తావేకం రూపము భావ భవతామ్"

కనుక నగ్నియే, తపోలక్షణము, బ్రహ్మ వీర్యముగల బ్రహ్మ. ఈ యగ్నియే యజ్ఞమునకు యోనిగా నెఱుంగవలయును. (4) విరాట్టునుండి యగ్నిహోత్రము, పశువునుండి పశుబంధము; అంతరిక్షమునుండి దర్శపూర్ణమాసలు, దివము నుండి చాతుర్మాస్యములు, దిక్కుల నుండి సోమాధ్వరము, ప్రజాపతి నుండి యగ్నిచితి, ఇట్లు విరాట్ - పశు - అంతరిక్ష - దివి - దిక్ - స్వేతర ప్రజాపతులనుండి యనవరతముగ నన్నాహరణము ఆకర్షణము. ఇవి విష్ణుకర్మలు.

ప్రతియర్థమందు (వస్తువునందు) నిత్యము ననువర్తించు నీ వృత్తులు స్వేతరాక్షర బల తారతమ్య న్యూనాధిక భావముచే బ్రవర్తించును. ప్రతి వస్తువును, తన్ను ధరించు కొనుచు, ననవరతము నన్యమునుండి యాకర్షించుకొని కొంచెము గ్రహించుచు, తన యంశములను గొన్నింటిని విడచుచు, నుండుటయే వస్తుస్థితి యగును. తారతమ్యమున బ్రవర్తిల్లు నీ యాదాన విసర్గములవలననే, సత్త్వావచ్ఛేదముంబట్టి ప్రతి వస్తువు నందును, క్షుత్పిపాసలు, శోకమోహములు, జరామృత్యువులు నను షడూర్ములు కల్గుచున్నవి. పాప్మయగు మోహమన్నది స్వరూప ధర్మావరకమగు కషాయము. అది యావరింపగా, పరరూప సంక్రమణము కల్గును, దానితో నవివేకము, లేక స్వరూప వ్యామోహము కల్గును. ప్రాణోదానములు, ప్రాణాపానములు, ఉద్గ్రాభ నిగ్రాభములు మొదలుగాగల మిత్రావరుణ రూపములన్నియు, నీ యాదాన విసర్గములనుండి పుట్టిన వేయని తెలియవలయును. అక్షరోత్పాదితమగు నీ ధర్మము, అక్షరోత్పాదిత క్షరమును, సత్త్వలక్షణముగల పురుషునే యవలంబముగా గొనును గాని, అక్షరాశ్రయమగు నవ్యయము నీ యూర్మిధర్మము స్పృశింపదు. అది సత్యకామ సత్యసంకల్పము గలది కనుక షడూర్మి రహిత మనియే సిద్ధాంతముగదా!

అక్షరత్రయమహిమ - అగ్నీషోములు :- మూడక్షరములు మూడు ప్రాణములు. వాక్కు నందగు ప్రాణముల వైభవముంబట్టి అక్షరమహిమ యన్నది వాఙ్మయమగును. "వాగ్వా అస్యస్వోమహిమా" అనియు "స్వంమహిమాన మావహ" అనియు మంత్రవ్యాఖ్యాన

శ్రుతి చెప్పుచున్నది. ఆ మహిమయు మనఃప్రాణము లుదరమందుగల వాక్కుచే వెలసిన ఛాయామండలమగు నక్షరత్రయ పరిబృంహణమని తెలియనగును. అందును ఇంద్ర విష్ణువులను నక్షరముల వలన నది యుత్పన్నమగును. ఎట్లన :-

ఇంద్రుని కర్మలందు వృత్రవధ యన్నదొకటి కలదు గదా! స్వర్బ్రహ్మ ప్రతిబంధి ధర్మములు వృత్రులు, అసురములగువారుణ ప్రాణములు వికాసాది బ్రహ్మ ధర్మములను స్తంభింపజేయును గనుక వృత్రులు నాబడును. వికసించు నర్థములను జాడ్య ధర్మములచే నపవారించు స్తంభనమే వారుణ ధర్మము. ఈ శ్రుతివచన మరయుడు:-

"ఆస్తభ్నాద్ ద్యా మృషభో అంతరిక్షమమిమీత వరిమాణం పృధివ్యాః
ఆసీద్విశ్వాభువనాని సమ్రాట్ విశ్వేతాని వరుణస్యవ్రతాని॥

కనుక, వరుణునుండి ప్రసరించి, సోమవాయువు, ఆపస్సులు, భృగువులును, సూర్యజ్యోతులందు వ్యాపించి, ప్రతియర్థమును చుట్టుముట్టి సంవరణ మాచరింపగా, నాయావరించిన యాసురమగు నోజస్సును ప్రత్యాహతము సేయనై ప్రతియర్థము నలుగడలను, పరాక్రమించును. విష్ణు విక్రమణ ప్రదేశమందాసురవరుణుని ప్రత్యాహితుం జేసి ఆయా యర్థమును స్వరూపమున వికసిల్లజేయును. ఇట్లింద్ర విష్ణువులు అసురబల ప్రత్యాహతి గావించి విజయముం బ్రకటించుకొనునంత పట్టుగల త్రైలోక్య మాగ్నేయలోకములు. అందు అగ్ని యమాదిత్యు లసురవిరోధు లాంగిరసులు క్రమాభివ్యాప్తి నొందుదురు. ఇక :-

దానిపైని ఆపోమయము, సోమమయము, వాయుమయము నగు నాల్గవలోకము, అందసురుల కవిరోధులు సోమవాయు భృగువులు కలసిమెలసి వ్యాపించి యుందురు. ఆలోకమందర్థము యొక్క యశో మాత్రము మిగిలియుండుంగాని, ఆ యర్థ స్వరూపము భాసిల్లదు. వరుణావరణ ముండును గదా! ఈ మంత్ర బ్రాహ్మణవచనము లిట నవధేయములు :-

"ఉభాజిగ్యధుః నపరాజయేధేన పరాజిగ్యేకతరశ్చనై నోః, ఇంద్రశ్చ విష్ణో యదవస్పృదేధాం త్రేధా సహస్రం వితదైరయేధాం" ఇంద్రశ్చహవై విష్ణుశ్చాసురైర్యు యుధాతే, సోఽ బ్రవీదింద్రః యావదేవాయం విష్ణుః త్రిర్విక్రమతే, తావదస్మాకమధ, యుష్మాకమితరదితి, సఇమాన్‌లోకాన్విచక్రమే; అధోవేదా౯ అధోవాచం" ఇతి (ఐతరేయము)

శంక :- "సహస్రధా పంచ దశాన్యుక్థా, యావత్ ద్యావా పృధివీ తావదిత్తత్, సహస్రధామహిమానః సహస్రం యావద్బ్రహ్మవిష్ఠితం తావతీవాక్" అను మంత్రవర్ణములను బట్టి ముల్లోకములు వాక్కే

"తిస్రోవాచ ఈరయతి ప్రవహ్ని రృతస్క ధీతిం బ్రహ్మణః మనీషాం
గావోయంతి గోపతిం పృచ్ఛమానాః సోమ యన్తి మతయోవావశానాః"
"ఏతద్వై సహస్రం వాచః ప్రజాతం యదేతేత్రయోవేదాః"

ఈ మంత్ర బ్రాహ్మణ వచనములను బట్టి మూడు వేదములును వాక్కులే కాగా, ఇక వాక్కులకంటె వేరుగా వాని నిర్దేశమేల?

సమాధానము :- ఆపృథఙ్నిర్దేశమును బ్రాహ్మణవసిష్ఠ న్యాయమున, జూడవలయును, లోక - వేదముల కంటె వాక్కును వేరుగా గ్రహించుట వేర్వేరు దేవతలను భూతములను పూర్తిగా సంగ్రహించుటకు, సర్వ భూతములు నయిన అగ్నియందు వాక్శబ్దమును, "తస్యవా ఏతస్యాగ్నేర్వాగేవోపనిషత్" అని శ్రుతి వాకొన్నది మఱియు శతపథమందు:-

"వృత్రేహవాహనా ఇదమగ్రే సర్వమాస, యదృచో, యద్యజూంషి, యత్సామాని, తస్మా ఇంద్రో వజ్రం ప్రాజిహీర్షత్, సహవిష్ణుమువాచ, వృత్రాయవై వజ్రం ప్రహరిష్యామి అనుమాతిష్ఠస్వేతి, సఉద్యతాద్ వజ్రాత్ వృత్రః విభయాంచకార, సహోవాచ, ఆస్తివా ఇదంవీర్యం తన్నుతే ప్రయచ్ఛాని, మాతుమే ప్రహర్షీరితి, తస్మై యజూంషి ప్రాయచ్ఛత్,

ఋచః ప్రయాచ్ఛత్, సామాని ప్రాయచ్ఛత్, తస్యయో యోనిరాశయ ఆస, తమను పరామృశ్య, సంలుప్యాచ్ఛినత్, సైషేష్ఠి రభవత్, యదేతస్మి న్నాశయే, త్రిధాతురి వైషా విద్యాశేత, తస్మాత్ త్రైధాతవీనామ; ఏతావాణ్ వైసర్వోయజ్ఞః యావానేష త్రయోవేదః; ఏష యోనిరాశాయః ఏతద్వై సహస్రం వాచః, ప్రజాతం యదేష త్రయోవేదః" అని చెప్పబడినది. ఇందు ఇంద్ర విష్ణువుల విభాగమును వినబడుచున్నది:-

"త్రయీవై విద్యా ఋచో యజూంషిసామాని, తద్వా ఏతత్సహ స్రంవాచః ప్రజాతంద్వే ఇంద్రస్తృతీయే, తృతీయం విష్ణుః, ఇతి," "ఋచశ్చ సామానిచేంద్రో, యజూంషి విష్ణుః" అని కౌషితకీశ్రుతి.

ఇట్లు విష్ణుసహాయు డింద్రుడు స్వచ్ఛాయా సూత్రమున, మూడు విధములగు (సహైవ సరణాత్) సహస్రమను ఐంద్రావైష్ణవమును, త్రైధాతవ్యమునగు వాఙ్మయమండలముంగల్పించి, తన్మహిమచే తన్నావరించుకొని స్వరూపధారణ సేయుచున్నాడు. ఆ యీ సహస్ర మైతరేయ శ్రుతియందు:- "కింతత్సాహస్రమితి, ఇమేలోకా, ఇమేవేదాః, అథోవాగితి బ్రూయాత్" అని వ్యాఖ్యానింపబడినది.

ఆగ్నేయమగు వేదత్రయమందను స్యూతములగు, నాథర్వణాంశములు లోకములు, కాగా, (1) అపోమయ వాగవచ్ఛేదకము లయిన సహస్రములు లోక సహస్రము, (2) రస - వితాన - ఛందోమయ వాగవచ్ఛేదము లయిన సహస్రములు వేదసహస్రము (3) ఋషి - పితృ - దేవ - భూతాది సృష్టి పరిణత వాగవచ్ఛేదములయిన సహస్రములు దేవసహస్రము. అని యిట్లు మూడువిధములుగ వితతమయిన సహస్రమే అక్షరమహిమగా నెరుంగవలయును.

ఆ యీ సహస్రత్రయమక్షరము నుండి వెల్వడిన దగుటచే నదియు నక్షరమే యగునని, శ్రుతియు "తదేతదేక మేవాక్షరం వాగితి" "తదేష సర్వోఽగ్నిరభి సంపద్యతే, ఏతద్ధేవాక్షరం సర్వేదేవాః, సర్వాణిభూతా న్యభిసంపద్యంతే" అన్నది. ఇందు భూతములన్ని

యక్షర మనుకొనవలెను, అక్షరమునుండి క్షరణము నొందిన = వెలువడిన యదియగ్ని. అది క్షరమయ్యును క్షరణము నొందునది = క్షీణించునది కాదు. కనుక నది సోమము; అగ్నీ షోమములు మహిమ. ఇట్లు ఈ త్ర్యక్షరము, మహిమచే పంచాక్షరమగుచున్నది. ఈ విధముగ హృదయ- మహిమలచే రెండుగా విభక్తమయిన యక్షరము, పంచ సప్తకమని తెలియనగును.

బ్రహ్మయొక్క అగ్నీషోములచే క్షరవిరాడుత్పత్తి:-

విష్ణువగు యజ్ఞము విక్రమించును. అన్నాదమగు నర్క ప్రాణమందు; హవిస్సు - పశువు - సోమము - చిత్యాగ్ని యనువానిలో దేని యాధానము వలననేని, యాహితాన్నమునకు ఊర్క్యము కలుగగా, ప్రాణరూపత నొందుట, యజ్ఞము. బ్రహ్మ స్వప్రతిమచే నగ్నియను మరొక బ్రహ్మను యజ్ఞార్థము కల్పించెను. ఆ యజ్ఞాగ్ని మూడువిధముల విక్రమింపగా, నాల్గవలోకమునుండి యాహూయమానమగు సోమముచే, యజ్ఞము ప్రవర్తిల్లుచుండ, నాయన్నాదాగ్ని భర్గః - మహః యశః - సర్వం అను నాల్గు ముఖములు గల బ్రహ్మ యయ్యెను. (1) సాంద్రతంబట్టి స్థూలమగు వాఙ్మయ బ్రహ్మ రూపము భర్గ. (2) విరాళావయతగల సూక్ష్మరూపము మహః (3) విరళత యధికముగాగల యతి సూక్ష్మరూపము యశః (4) ఈఅన్నిటనను స్యూతమై నిర్విశేష సామాన్య రూపము సర్వమ్.

ఇందలి మూడు ముఖములచే పృథ్వీ - అంతరిక్షము - ద్యౌ, అని మూడు లోకములు. నాల్గవదగు నాపస్సు నాల్గవ లోకము. దీనియందా మూడు లోకములు నంతర్భావములు. ఇట్లు, మూడు ముఖములచే ఋగ్యజుస్సామములను మూడు వేదములు. నాల్గవదానిచే నథర్వ నాల్గవ వేదము. దాని యందీ మూడు వేదములు నంతర్భావములు. ఇట్లే, మూడు ముఖములచే నగ్ని వాయ్వాదిత్యులు మూవురు దేవతలు,

నాల్గవ దానిచే చంద్రుడు నాల్గవదేవుడు. అందీ మూవురు దేవతలకు నంతర్భావము. "సర్వంవై సహస్రమ్ చతుష్టయం వా ఇదంసర్వం" అన్న కౌషీతకీశ్రుతి చొప్పున, నీలోక - వేద - దేవచాతుర్విధ్యమందు 'సహస్ర' మను శబ్దమునకు వాడుక. సహస్రశ్రుతి యందు 'దేవ' యనుటకు బదులుగ 'అధోవాగితి బ్రూయాత్' అని వాక్కును చెప్పుట, దేవభక్తి (భాగ) సముచ్చయార్థము. దేవభాగము లనగా :- దిక్ - ఋతు - ఛందః స్తోమాదులు పది విధములు, అధిదైవతము, అధిభూతము - అధ్యాత్మము - అధియజ్ఞము నన్యాన్యరూపములు, సామాన్యరూపములు నని తెలియనగును. కనుకనే

వాజసనేయ బ్రాహ్మణమందలి చితి ప్రకరణమందు అధిదైవికములయు, గోపథ పంచమ ప్రపాఠకమందు ఆధియజ్ఞి కాధ్యాత్మికములయు, నుపపాదన సేయుటయందు. పరస్పర భేదము లటనట నున్నను, విరోధము లేదని యెంచనగును. ఆ యీ విషయము బ్రహ్మ విజ్ఞానమందు విశదముగా నరయనగును. కానిండు.

బ్రహ్మనుండి కల్గినదియు దశావయవములు గలదియు నగు నీ చతుష్పద విరాట్టు నలువది యక్షరములు గలదగును. అధర్వణమందిట్లున్నది:- "సవాఏష దశధా చతుః సంపద్యతే, దశచహవై చతుర్విరాజోఽ క్షరాణి, తం గర్భా ఉపజీవన్తి, శ్రీర్వైవిరాట్, యశోఽ న్నాద్యం, శ్రియమేవ తద్విరాజం యస సాన్నాద్యే, ప్రతిష్ఠాపయతి, ప్రతిష్ఠాప యన్తీరిదం సర్వమను ప్రతితిష్ఠతి"

ఈవిధముగ, యజ్ఞమయుడగు విష్ణువు నాభినుండి ప్రాదుర్భూతమయిన యీ విరాట్టు బ్రహ్మప్రతిమ యగుటవల్ల శ్రీః బ్రహ్మ శ్రీః విరాట్ అని కొందరందురు. లేదా, అన్నం విరాట్, యజ్ఞమే దేవతల యన్నము, కనుక యజ్ఞమయమగుట వలన విష్ణువే యీ విరాట్టని కొందరందురు. ఆ యీ విరాట్టుగాని, సహస్రము గాని క్షరపురుషుడు.

సహస్రమునకు జెందిన పంచదేవతలు:-

"దశ వాఏతానగ్నీన్‌శ్చినుతే అష్టాధిష్ణ్యానాహవనీ యంచ, గార్హపత్యంచ, తస్మాదాహుః - విరాడగ్నిరితి - దశాక్షరాహి విరాట్ - తాౕ ను. సర్వానేక మివైవాచక్ష తేఽ గ్నిరితి, ఏతస్యహ్యే వైతాని సర్వాణిరూపాణి" అని శతపథమును, "అగ్ని స్సహస్ర మవుష్యత్" అని తైత్తిరీయమును చెప్పుటచే, ఈ సహస్రము సర్వము నగ్నినుండి రూపొందినది. దానికి బైనర్థయశః సోమరూపమని యెరుంగనగును. ఆ యీ సోమము సహస్ర బహిర్భూతమయ్యు నవవరతము నీసహస్ర మందను స్రవించుచున్నది. అది లేనినాడగ్నికి జీవనమే లేదు గదా!

ఇట్లే యీ క్షరపురుష సహస్రమందు త్రిమూర్తియగు నక్షరుడు సంస్రవించును. (1) ఇంద్ర శాసనము గలంతవరకు, విజ్ఞానాత్మ యది అంతర్యామి. (2) అన్నాదమగు యజ్ఞాత్మ గలంతవరకు, విష్ణువది విరాట్టు (3) సర్వమునందను స్యూతమును బ్రహ్మాగ్ని సోమములచే రూపొందినదియునగు వాయువు సూత్రము. ఈ వాయు సూత్రముచే, సహస్రంభరులగు దేవత లెల్లరును, హృద్యమగు నక్షరముచే, విధృతులు, స్తబ్ధులు, సందృద్ధులునై పరస్పర మోతప్రోతముగ నుందురు, సూర్యాదులను బరిక్రమించు గ్రహములెల్ల నీ వాయు గృహీతములయియే పరిక్రమించును. ఈ సూత్ర పాశబద్ధములే పశుపతి గృహీతులగు జీవాఖ్య పశువు లన్నియును. కషాయావరణములచే నాత్మను బంధించునదీ మాయాపాశమే. ఈ యజ్ఞ సూత్రముచేతనే యొక ప్రజాపతి పర ప్రజాపతితో సంబంధపడి యాకర్షించును.

ఇక, నవ్యయాలంబనము గల్గి సహస్రాలంబన భూతుడుగ నాభియందు మున్ను చెప్పబడిన యక్షరుడు తురీయుడు. ఎట్లన, ఇప్పటివరకు జెప్పబడిన అంతర్యామి, విరాట్టు, సూత్రాత్మయను నక్షరులు మూవురును హృద్యులే అయినను, వీరిని వేరుగా లెక్కించునపుడా మొదటి యక్షరుడు తురీయుడగునని తెలియదగును. ఈవిధముగ నేయర్థమైనను (వస్తువైనను) బ్రహ్మ - విష్ణు - ఇంద్ర - అగ్ని - సోమ, యను పంచ దేవతలు గలదని యెరుంగవలయును. ఇది త్రిపురుష ప్రజాపతి వ్యాఖ్యానము.

విగ్రహసృష్టి:- పరమేశ్వరుడనుకొన్న, యేకము, ప్రజాపతియు, నగు నవ్యయమునకగు, నీశ్వరత్వ - జీవాత్మాద్యౌపాధిక నానాత్వము నుపపాదించు విగ్రహ సృష్టింగూర్చి తెలిసికొందము. వివిధములగు క్షరము లక్షరముచే గ్రహింప బడుట యన్నది విగ్రహము. క్షరమన్నది (1) ఉపష్టంభనము (2) ఉపజనము (3) కషాయము (4) ఆత్మ త్యక్తము (5) తాత్కాలికము నని యైదు విధములు. అవ్యయ పంచ ధాతువులందలి ప్రాణము బలముల గ్రంధి హేతువు. బలములకు బలముతో పరివేష్టనము గ్రంధనము. హృద్గ్రంధనము వలన, పరస్పరము బద్ధములగు బలములు, సత్తారస యోగము వలన స్థిరతకు వచ్చి, కల్పించునట్టి రూపము వాక్కు. వాక్స్వరూప సంపత్తికొరకు, అన్యోన్యము గూడు, బద్ధములగు, సంసర్గమునొందు, గ్రంధనము నొందు, బలములందన్యోన్య బలములు మరల మరల సంసర్గపడి, గ్రంధిపై గ్రంధిని కల్గించునపుడు, బలసృష్టి పరివర్ధనము వలన వేర్వేరు సృష్టులు కలుగుచుండును. అట్టి సృష్టులు బలముల భూయస్త్వము (ఆధిక్యము)ను బట్టి భూతములందురు. భూధాతువు బహుత్వమందు నిరూఢము.

బహుశబ్ధమునందు, బకార అకారమునకు, ప్రయత్న దోషముంబట్టి క్రమస్థానముల విపర్యయము వలన, హకార ఉకారోత్తరత్వము చేతను, ఓష్ఠ్యత్వముచేతను, విపరిణామము వలన, భూశబ్దము నిరుక్తి యేర్పడినది కనుక, 'సంసృష్ట బహు బలత్వము భూతత్వ' మను వ్యుత్పత్తిచే, బలముల కాపేక్షిక న్యూనాధికత్వ మున్నను, సాధారణముగా, భూతశబ్దము ప్రవర్తిల్లును.

భూతముల యొక్క ప్రాధమిక రూపమందు వాక్శబ్దము వాడుదురు. అందితర భూతములకంటె బలము లత్యల్పములుగ సంసర్గము నొందును. ఆ యీ వాక్కు అమృతము - మర్త్యము నని రెండు విధములు. అమృతవాక్కు సహస్రరూప మగు వేదత్రయి, యది, నిత్యము నవ్యయు ననువర్తించునది, యెల్ల భూతములకు నావపనమగునది కనుక, నాకాశమని చెప్పబడును. ఈ యాకాశమందహరహమును

వికారము నొందుచు మర్త్యవాక్కు పరివర్తిల్లును. బలగ్రంధి తారతమ్యమున నది, ఋషులు - పితరులు - నాభసులు - భూతములు నని నాల్గు విధములగును.

జాత్యంతర సంస్పర్శ లేని మౌలిక ప్రాణాకారముగల ఋషులు అనంత విధములు గలవారు. వేర్వేరు జాతులుగల ఋషులయొక్క సంస్పృష్టిచే నుప్పతిల్లువారు పితరులు. బహు జాతీయులగు పితరుల సంస్పృష్టిచే వెలయువారు నాభసులు వీరు దేవతలు - అసురులు - గంధర్వులు - మనుష్యులు నని నాల్గు తెరగులు. ఇందలి మనుష్యులు తైత్తిరీయమందు పితరులనియు జెప్పబడిరి. కారణము, చంద్రునందుండుటయు, పితృసాన్నిధ్య ముండుటయు నగును: అంభశ్శబ్దముచే గూడ నీ నల్వురను వ్యపదేశింతురు. ఋషి - పితృ - నాభాసులు - మూవురును, ఆకాశ సంచారి భావములు, కనుక వాయుశబ్దమునను జెప్పబడుదురు.

ఈ దేవాసురాదుల, పరస్పర సంఘాతము వలన భూతము వెలయును. అవి, తేజస్సులు, ఆపస్సులు, అన్నములు నని మూడు విధములు. వీనియందలి పరమరూపమును భూమి యందురు. దానియందితర భూతము లన్నిటియందు కంటె నధికబలములు సంసర్గము నొందును. ఆకాశ వాయువులందు నపేక్షాకృత బలగ్రంధుల యాధిక్యముంబట్టి భూతశబ్ద మనువర్తించును. వాక్కు - భూమి మధ్యగల భూతములందు తారతమ్య మున్నదికదా!

మొదటిదగు వాగ్రూపమునకు, దన తరువాతివగువాని యందనువర్తన యుండును గనుక నన్నిభూతములకు వాక్త్వము తప్పదనియే శ్రుతి. "అధోవాగే వేదం సర్వమ్" అన్నది బలముల యన్యోన్య సంస్పృష్టియే, భూతోత్పత్తి యగుంగాన భూతోత్పత్తిని సృష్టి యందురు. రసము సత్త. గ్రంధియందు సత్తానుగ్రహణము వలన నుచ్ఛిత్తి స్వభావముగల, క్షణికము లయ్యు గ్రంధమానములగు, (కూడబడు) బలములకు చ్ఛిత్తి యుండమిచే, నగపడునను వృత్తియందు 'అస్' ధాతువు వ్యుత్పన్నమయినది. కాగా, 'అస్తి' నాబడు బలసృష్టి యందనుచ్ఛిత్తి తోచుచున్నదని తెలియనగును. బల సంస్పృష్టి హేతువులగు ప్రాణము లనంత విధములని యీ మంత్రశ్రుతి యెరుకపరచుచున్నది:-

"విరూపాస ఇదృషయః తఇద్ గంభీర వేపసః
తేఆంగిరసః సూసవఃతే అగ్నేః పరిజజ్ఞిరే"

కనుక నిట్లు, సృష్టిహేతువు ప్రాణమనియు, సృష్టి ఫలరూప వాక్కనియు జెప్పెదము. ఇక:-

ఇంతకును వ్యతిరేకముగ, నీసృజ్యమాన, గ్రధ్యమాన, బలముల కుద్బంధనమున, నుద్గ్రథనమున, నుత్సర్జనమున, రసము నుండి విడువడుట, యుచ్ఛిన్నత కల్గుట, వినాశము నొందుట కల్గించి, రస కైవల్య మవశేషముగా జేయునది విజ్ఞానమను రసము. విజ్ఞానమన్నను విద్యయన్న నొకటే. విద్య చేతనే, బంధమోక్షము - హృద్గ్రంధి మోక్షము - సృష్టి మోక్షము - కర్మ మోక్షము నగుంగాన విజ్ఞానము మోక్ష హేతువు. విజ్ఞానముచేతనే రసమునుండి బలముల యాత్యంతిక నివృత్తి కలుగగా నిర్వాణ మందురు. ఇట్లు బల నిర్వాణము మోక్ష హేతువు కర్మ ప్రవృత్తి కనుకూలమగు ప్రాణమవ్యయరసము, అట్లే, కర్మనివృత్తి కనుకూలమగు విజ్ఞానము నవ్యయ రసమే, దీనివలన, బలసంపర్గ జనితమయిన క్షోభ నివృత్తి నొందగా, పరమశాంతియు నానందము నీవిజ్ఞానమునకు ఫలము. ఈ ప్రకార, మక్షర సహాయముగల యవ్యయమే; సృష్టి మోక్షహేతువుకాగా, అనవరతము ననువర్తించు నీ సర్గమోక్ష పరంపరలే జగద్రూపముగా గనుచున్నాము. విజ్ఞాన - ప్రాణముల తారతమ్యముంబట్టి యనువృత్తి నివృత్తులచే ప్రతి యర్థమునందు నీ సర్గమోక్ష ద్వైవిధ్య మవయవతః. గాని సముదాయతః గాని ప్రవర్తిల్లుచు, నీ జగద్వైచిత్ర్యముం బరిశీలింప జేయుచున్నది. ఇతిశ్రీ.

ఓం తత్సత్

తృతీయ ప్రసంగము సమాప్తము.



ఓన్నమః పురుషోత్తమాయ

గురవే మధుసూదనాయ

# శ్రీమద్బ్రహ్మ విజ్ఞాన పరిచయము

## చతుర్థ ప్రసంగము

### "సఏవేదం సర్వమ్"

"ప్రజాపత్తిస్త్వే వేదం సర్వమసృజత యదిదంకించ"

"తథాక్షరాద్వివిధాః సోమ్యభావాః ప్రజాయంతే తత్ర చైవాపియన్తి"

ఇత్యాది శ్రుతివచనములు బ్రహ్మను విశ్వమూల కారణముగా నంగీకరించుచున్నవి. ఈ సృష్టి విద్యకు జెందిన బ్రహ్మస్వరూపమేమి? ఆయన ప్రజానిర్మాణ మెట్లు సేయును? అందుకాలంబనమేది? సృష్టి ఎందుకు? ఎప్పుడు? ఉత్పన్నమయిన విశ్వమునకు - ప్రజకు, స్వరూపమేమి? అని యనేక ప్రశ్నలు కల్గుచున్నవి. వీనికి సమాధానములు కూడ గర్భమందిడుకొన్న యీ శ్రౌతవచనముల నరయుడు.

"కింస్విదాసీ దధిష్ఠాన మారంభణం కతమస్విత్ కధాసీత్

యతోభూమిం జనయ౯ విశ్వకర్మా విద్యా మౌర్ణాన్మహినా విశ్వచక్షాః"

సర్వద్రష్టము, సర్వకర్మయునగు ప్రజాపతి దేనియాలంబనమున? నే యుపాదనమున? నీ భూమి నుత్పన్నము గావించుచు, తన మహిమచే ద్యులోకమును చాల దూరము వరకు వ్యాపింప జేసెను?

"కింస్విద్వనం? కఉ సవృక్షఅస? యత్యోద్యావా పృధివీనిష్టతక్షుః
మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్య తిష్ఠద్ భువనాని ధారయ౯ ?

ప్రజాపతి, ఏవనములందలి యే వృక్షముం జెక్కి ద్యావా పృధివులను జేసెను? విశ్వమును ధరించుచు నతడు దాని నధిష్ఠించుచున్నాడు గదా! మనీషులారా! మనసార ప్రశ్నింప బడుచున్నదిసుడీ!

"ఆచికిత్వాన్ చికితుషశ్చిదత్రకవీ౯ పృచ్ఛామి విద్మనేన విద్యా౯
వియస్త స్తంభషడిమారజాంసి అజస్వరూపే కిమపిస్విదేకమ్"

ఎఱుగని వాడను, తెలియగోరి, తెలిసిన పారంగతుల నడుగుచున్నాను. ఈ యారు రజస్సులు (లోకములు) ఏ యజరూప స్తంభము నాధారము గొనియున్నవి? ఆయజస్తంభ రూపమేమి?

"బ్రహ్మ నుండి విశ్వ ముత్పన్నమయినదని వేదనిశ్చిత సిద్ధాంతము. దీనిపై సృష్టివేత్తలగు నాప్తమహర్షుల పూర్వ పక్షములు సాగుచున్నవి. లోకమందు ప్రజాపతి (కుమ్మరి) ఘటనిర్మాణము సేయును. ఇందుకు విధాత కుమ్మరియే. భూమండల మితని కాధారము. కాష్ఠదండము నిమిత్త (అసమవాయి) కారణము. మట్టి ఉపాదాన (సమవాయి) కారణము. ఇంతకు,

కుమ్మరి భూమిపై గూర్చుండి, స్వకీయ వ్యాపారమున దిరుగుచున్న చక్రముపై దండము ద్వారా నాపోమయ మృత్తికను ఘటరూప పరిణతి నొందించి, సూత్రము ద్వారా చక్రము నుండి వేర్పరచి, పరిపాకార్థము నియతస్థానమున నుంచుచున్నాడు. ఈ కారణములెల్ల లేకుండ ఘటకార్యము సంభవింపదు. కార్యమునకు కారణ సముదాయమే కారణత్వము వహించును. మహాసృష్టి విషయమున నిదే పరిస్థితి.

సృష్టి యన్నదొక కార్యము "యద్యత్ కార్యం, తత్తత్ కర్తృజన్యం, కార్యత్వాత్, ఘటవత్" (ఏదేది కార్యమో, అది కర్తృజన్యము, ఏమి? కార్యము కనుక, ఘటమువలె)

ఈ న్యాయము చొప్పున సృష్టికొక కర్త తప్పని సరిగా నుండవలయును. అయినచో, నాకర్త స్వరూపమేమి? దేనిపై గూర్చుండి యతడు సృష్టినిర్మితి గావించును? ఉపాదాన మేమి? వ్యాపారమేమి? అను జిజ్ఞాస కల్గుచున్నది.

పరమార్థతః, ప్రజాపతి దుర్బోధ సృష్టికి జెందిన యిట్టి కుతర్కముల కొక విలువ యుండునా? యన్నను, వీనికి సమాధానము కుదరకున్నచో నీశ్వర విముఖుడగు నాస్తికుడీశ్వరసత్త నోర్చునా? భక్తి మార్గానుయాయి యగు పుష్పదంతుడు.

"కిమీహః? కింకాయః? సఖలు కిముపాయః? త్రిభువనం
కిమాధారో ధాతా సృజతి? కిముపాధాన? ఇతిచ
అతర్క్యైశ్వర్యేత్వ య్యనవసరదుఃస్థో హతధియః
కుతర్కోయం కాంశ్చిన్ముఖరయతి మోహాయజగతాం"

అని ప్రశ్న కర్తను 'హతధీ' (చచ్చుబుద్ధి గలవాడు) అని తిట్టనిండు, కాని యా ప్రశ్నలే రూపాంతరమున మన యెదుటికి రాక మానవు. విజ్ఞానము నెరుంగని వారికా ప్రశ్నలు దుర్బుద్ధికి గారణములయినను, విజ్ఞాన పారంగతులగు మహర్షుల దృష్టికవి సర్వథా సముచితములె. వీనికి సమాధానమును సముచితమె.

వేద విజ్ఞానమందలి 'యుపనిషత్తు లందేమికలదు' అను ప్రకరణ మొకపరి యాద్యంతము బఠింపుడు. సర్వ జగన్మూలాధారము, అమృత మృత్యుమయ సర్వబల విశిష్టరస స్వరూపము, అనంతేశ్వరులు గర్భమందు గల సర్వ వ్యాపకము, పరమేశ్వర నామ ప్రసిద్ధమగు పరాత్పరతత్త్వ మొకటి లభించును. ఈ రసబల మూర్తియగు పరాత్పరుని యొక ప్రదేశము మాయాబలముచే సీమితముకాగా, తదవచ్ఛిన్న భాగ మవ్యయరూపమున బ్రాప్తించును. ఆ యవ్యయ హృదయ రూపాక్షర కృప వలన, ఆనంద విజ్ఞాన మనః ప్రాణ వాక్కులను నైదు కళలుపలబ్ధములగును. ఇందలి, ఆనంద విజ్ఞాన మనస్సులు స్థితి భావాపన్నములనియు, మనః ప్రాణ వాక్కులు గతిభావాపన్నములనియు నుపలబ్ధి

కల్గును కల్గగా, నీ స్థితి - గత్యాత్మ పంచకళావ్యయుడు జగదాలంబన రూపమున నెదుటికి వచ్చును. ఆయనతో, హృదయ బలరూప పంచ కళాక్షరుడు, ఆ యక్షరుని నిత్యము నంటియుండి పంచ కళక్షరుడు గూడ దర్శన మొసంగ సౌభాగ్యమబ్బును. ఇక,

అవ్యయ నాలంబన రూపమున జూచునపు డక్షరు నసమవాయి (నిమిత్త) కారణముగను, క్షరుని సమవాయి (ఉపాదాన) కారణత్వ యుక్తునిగను గుర్తింతురు. ఇంతటితో, పై ప్రశ్నలన్నియు గతార్థములైపోవును.

"కింస్విదాసీ దధిష్ఠానం" ఆలంబనమేది? యనుదాని కుత్తర మవ్యయపురుషుడు. ఆనంద విజ్ఞాన మనోమయ స్థితి మూర్తి యగు నవ్యయుడు, స్థిరధరాతలము మనః ప్రాణ వాఙ్మయగతి మూర్తి యగు నవ్యయుడు, తిరుగుచున్న చక్రము. ఆ యీ రెండు నాలంబనము విశ్వాధిష్టాన మిదే 'ఆరంభణం కతమస్విత్" ఉపాదాన కారణమేమి? యనుదాని కుత్తరము, పంచకళ క్షరపురుషుడు. విశ్వమున కంతటికి నుపాదానమతడే. ఇక మధ్య పతితుడగు పంచ కళాక్షరుడు నిమిత్త కారణము; సృష్టికర్త;

"హృత్ప్రతిష్ఠం యదజిరం జదిష్ఠం తన్మే మనః శివ సంకల్పమస్తు" అను శ్రుతి చొప్పున, అవ్యయుని శ్వోవసీయ మనస్సు, అక్షరరూప హృదయమందు ప్రతిష్ఠితము, మనస్సుతో ప్రాణమునకును, ప్రాణముతో వాక్కునకును నిత్య సంబంధము. కనుక అక్షరునకు మనః ప్రాణ వాక్సంబంధము సిద్ధము; కాగా నతడు, అవ్యయుని మనోభాగముచే సర్వజ్ఞుడు, ప్రాణభాగముచే సర్వశక్తి, వాగ్భాగముచే సర్వ విత్, అగుచు, నంతటను నియతిరూపమున, నుండి, నియతిదండముచే నందరను భయభీతుల గావింపుచు సర్వశాస్త, విశ్వకర్త యగుచున్నాడు. అవ్యయ మనోకామనయే అక్షరకామన, ప్రాణ వ్యాపార మీహ, వాగ్వ్యాపారమే ఉపాయము. ఇట్లు స్థితిభావము గల యవ్యయ ధరాతలముపై నున్న జ్ఞాన క్రియార్థ కాయుడగు, నక్షరపురుషుడు, మనః ప్రాణ వాఙ్మయమై గతి భావము నొందిన యవ్యయ చక్రముపై క్షరరూపోదానముచే, సర్వ విశ్వమును సృజించుచుండును.

పిమ్మట, ఏ వృక్షముంజెక్కి యీ విశ్వరూప స్తంభము నిలువంబెట్టబడియెనో, ఆ వృక్షమేమి? ఆ వృక్షముగలవనమేమి? యని ఋషి ప్రశ్నింపగా, సమాధానముగా, మహర్షి తిత్తిరి చెప్పుచున్నాడు:-

"బ్రహ్మవనం బ్రహ్మ సవృక్షఆస యతోద్యావా పృధివీనిష్టతక్షుః
మనీషిణో మనసావి బ్రలీమి, వో, బ్రహ్మోధ్యతిష్టద్ భువనాని ధారయన్"

పైని జెప్పబడిన రసబలాత్మక - సర్వ ధర్మోపన్న పరాత్పరుడు బ్రహ్మవనము, బ్రహ్మయన్నది సచ్చిదానందావ్యయుడు. ఒక్కొక మాయచే నొక్కక బ్రహ్మోవ్యయుడు వెలయును. సర్వవ్యాపక పరాత్పరునందనంత మాయాబలములు. మాయాబలము లెన్నో అవ్యయ బ్రహ్మలన్ని, కనుక పరాత్పరుని బ్రహ్మవన మనదగును. ఇందొక మహావృక్ష మా యవ్యయబ్రహ్మ. ఆ వృక్షమందు వేయి శాఖలు. ప్రతి శాఖకును, స్వయంభూ - పరమేష్ఠి - సూర్య - చంద్ర - పృధువులను పంచ పుండీరములు (ఉపశాఖలు). కనుక నా శాఖను, "పంచపుండీరా ప్రాజాపత్య బల్శా" అందురు.

ఈ మహావృక్ష మశ్వత్థమువలె నిలబడియున్నదగుటచే - లేదా అశ్వమువలె నిలబడియుండుటచే నశ్వత్థమందురు. ఈ మహాశ్వత్థ నిరూపణమున నీ శ్రుతివచన మవధేయము:-

"ఊర్ధ్వమూలోఽ వాక్శాఖ ఏషోశ్వత్థః సనాతనః
తదేవశుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే"
తస్మిన్ లోకాః శ్రితా ః సర్వేతదు నాత్యేతి కశ్చన, ఏతద్వైతత్
"ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం.
ఛందాంసి యస్య పర్ణానియస్తం వేదస వేదవిత్" (గీత॥)

అనంతమాయలను బట్టి పరాత్పరునందనంత వృక్ష సత్తసిద్ధ మగుచున్నది. కనుక నతడు వనమనుకొంటిమి గదా!

ఆ యశ్వత్థ వృక్షమునకు జెందిన క్షరభాగముంజెక్కి ద్యావా పృధ్వీరూప విశ్వము నిర్మింపబడినది "తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్" (అది సృష్టించి యందే యనుప్రవేశము సేసెను) అను శ్రుతి వచనము చొప్పున, అక్షరుద్వారా క్షరోపాదానమున విశ్వమంతటిని నిర్మించి, యా యవ్యయుడాలంబన రూపమున బ్రతిష్ఠితుడయ్యెను. ఈ యభిప్రాయము తోనే, "బ్రహ్మోధ్య తిష్టత్ భువనాని ధారయ౯" అని చెప్పబడినది. అవ్యయు నీయాలంబనతను నిరూపించుచు, పురుషోత్తము డనుచున్నాడు :-

"ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యోలోకత్రయ మావిశ్యభి భర్త్యవ్యయ ఈశ్వరః"

కేనోపనిషత్తు పరాత్పర రూప బ్రహ్మవనముం గూర్చి "తద్ధ తద్వనం నామ తద్వన మిత్యు పాసితవ్యం" అన్నది. ఆ వనమందొక్కొక వృక్షమును, భూరాది సప్త వ్యాహృత్యాత్మక లోకత్రయము. దాని నధిష్ఠించియుండు వాడవ్యయ పురుషుడు. త్రివృద్భావము నొందిన భూః (రోదసి) భువః (క్రందసి) సువః (సంయతి) యను మూడు త్రైలోక్యముల తోడి యొక్కొక విశ్వమునకు గతి - భర్త - ప్రభువు - సాక్షి - నివాసము - శరణము - సహృత్ - ప్రభవము - ప్రళయము - స్థానము, నిదానము, బీజము, ఒక్కొక అవ్యయ పురుషుడే, పరాత్పర బ్రహ్మకొక్కొక మాయాబలమొక్కొక రోమ కూపము. ఒక్కొకరోమకూప మొక్కొక బ్రహ్మాండము. ఒక్కొక బ్రహ్మాండమునందవ్యయ పూర్ణతచే మరల నవాంతర సూర్య - పరమేష్ఠ్యాద్యనంత బ్రహ్మాండములు సమావిష్టములై యుండును.

అవ్యయ వృక్షమంతయు విశ్వముగా గాదు, అవ్యయునపరా ప్రకృతి రూపక్షరభాగమే అక్షరుని వ్యాపారముంబట్టి క్షరితమై విశ్వముగ నగును. ఈ విజ్ఞానముం దెలుపనే "యతో ద్యావా పృధివీ నిష్టతక్షుః" అని శ్రుతి యన్నది. అధర్వ వేదీయ స్కంభ విద్యానుసారము, విశ్వ మొక స్కంభము. "స్కంభేసర్వం ప్రతిష్ఠితం" సంపూర్ణ స్థావర జంగమ ప్రపంచమీ విశ్వస్కంభముపై బ్రతిష్ఠితము. అశ్వత్థ వృక్షమునుండి చెక్కబడిన భాగమిది. క్షరరూపమున నిదే స్కంభము, అక్షరరూపమున నిదే నిర్మాత,

అవ్యయ రూపమున నిదే యాలంబనము "యోలోకత్రయ మావిశ్వభి భర్త్యవ్యయ ఈశ్వరః "

"బ్రహ్మోధ్యతిష్ఠద్ భువనాని ధారయన్" అను రెండు వచనములును సమాన తాత్పర్యముల గలవి.

"ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి" (గీత) అను వచనానుసారము, అవ్యయ పురుషుడు తన స్వభావ భూతమును, అంతరంగ ప్రకృతి స్వరూపమునగు నక్షర - క్షరమును వీడియుండడు. అవ్యయాక్షర క్షరములు మూడును పంచ పంచ కళలు గలవి, కాగా, నీ పదునైదు కళలకు బైని పరమార్థతః 'అకళ' మును, వ్యవహార దృష్టితో "నేకకళ" మునగు పదునారవ కళ పరాత్పరుడు. మొత్త మీ షోడశకళల ప్రజాపతియే విశ్వప్రజల కధిపతి. "త్రీణిజ్యోతీంషి సచతేస షోడశీ" షోడశి విశ్వమున కాత్మ, అది నిత్యము, అమృతము; క్షరము విశ్వ విపరిణామి కనుక అనిత్యము - మర్త్యమునగును ఇట్టి మర్త్యభూతమయ విశ్వమందంతర్నిగూఢుడు కనుకనే శ్రుతి, షోడశియగు నాత్మగూర్చి 'గూఢోత్మా' యను చున్నది. వినుడు; కనుడు:-

"ఏష సర్వేషు భూతేషు గూఢోత్మాన ప్రకాశతే
దృశ్యతే త్వగ్ర్యాబుద్ధ్యా సూక్షయా సూక్ష్మ దర్శిభిః"

ఆ యీ జ్ఞానజ్యోతిర్మయ తత్త్వము నావరించునదొక మాయాబలమే, అసీముని ససీమునిగా జేసి విశ్వము ద్వారా తిరోహితుం జేసివై చునదదే. కనుకనే సర్వవ్యాప్త మయ్యు నా తత్వము మనకు కృష్ణమయినది. ఈ యవ్యయ కృష్ణతత్త్వమును లక్ష్యమందుంచుకొని, కృష్ణావతారుడు భగవంతుడు కృష్ణుడు, "నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః " అనియెను. ఇది విశ్వాధిష్ఠాత యగు నీశ్వర ప్రజా పతి యొక్క సంక్షిప్త నిదర్శనము. ఇదే అమృతాత్మ - గూఢోత్మ, షోడశీ ప్రజాపతి. పరాత్పర బ్రహ్మకిది ప్రధమావతారము. ఈ క్రింది పరిలేఖ నరయుడు :-

౦ శుద్ధ రసస్వరూప - నిష్కల - నిరంజన 'నిర్విశేషుడు'

1 = 1 = సర్వబల విశిష్ట రస రూప వ్యాపక పరాత్పర బ్రహ్మ = బ్రహ్మవనము

5 = 2 = మాయాబలావచ్ఛిన్న రస బలాత్మకావ్యయ పురుషుడు = (బ్రహ్మ వృక్షము)

5 - 3 = అక్షరపురుషుడు = పరాప్రకృతి = (అమృత బ్రహ్మ - విష్ణు - ఇంద్ర - అగ్ని - సోమ భేదముచే పంచకళుడు)

5 = 4 = క్షరపురుషుడు = అపరాప్రకృతి = (మర్త్య బ్రహ్మ - విష్ణు - ఇంద్ర - అగ్ని - సోమ భేదముచే పంచకళుడు)

"షోడశ కళంవా ఇదం సర్వం" - "చతుష్టయంవా ఇదంసర్వం"

పైవానియందలి క్షరునివంక కొకపరి చూడుడు, అతని పంచకళల నుండి వరుసగ ప్రాణ - అప - వాక్ - అన్నాద - అన్న - అను పంచ వికారములు జనించును. వీనిని 'వికార' క్షరము లందురు. ఇవి వైకారికమగు విశ్వమున కాధారములు; కనుక వికృతులైనను విశ్వముంబట్టి వీనిని ప్రకృతులేయందుము.

అవ్యయుడు పురుషుడు, అక్షర - క్షరు లేకముగా ప్రకృతి. పై జెప్పబడిన వికారక్షర, మక్షరక్షరముల కంటె వికృతియు, విశ్వముంబట్టి ప్రకృతియు గనుక, 'ప్రకృతి వికృతి' యందురు. వికారము లైదును ప్రాణాత్మకములు. శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములు లేక, ధామచ్ఛదము కాని (చోటు నావరింపని) తత్వము ప్రాణము. ప్రాకృతములగు నీ ప్రాణము లైదును మృద్ఘటమునట్లు, ఆ యమృతాత్మ స్వరూపము - మనోగమ్యము, నగు షోడశియందు ప్రతిష్ఠితములై యున్నవి. మనోగమ్య షోడశియణవు. దాని యందు ప్రాణ - ఆప - వాగాది ప్రాణము లైదును నిత్య ప్రతిష్ఠతములన్న యభిప్రాయముతోడనే శ్రుతి:-

ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ
ప్రాణైః చిత్తం సర్వమోతంప్రజానాం, యస్మి౯ విశుద్ధే విభవత్యేషఆత్మా

ఆ పంచ వికారక్షరములును పంచీకరణము ద్వారా క్రమముగ, విశ్వసృ - ట్ప్రంచజన - పురంజన రూపమున పరిణతములై చివరకు పురస్వరూపమున బరిణతములగును. పంచీకృత, ప్రాణమయ పురము స్వయంభువు; అపోమయ పురము పరమేష్ఠీ, వాఙ్మయపురము సూర్యుడు, అన్నాదమయ పురము పృధివి. అన్నమయ పురుము చంద్రుడు. ఈ పురము లైదును పిండాత్మకములు, సహృదయములు; సహృదయము - సశరీరమునగు పదార్థము సత్యమని వైజ్ఞానిక పరిభాష.

ఉపాదాన కారణము తన కార్యమునకు బ్రతిష్ఠ. అభిన్న సత్తాకములగు కార్య కారణ భావములందు, కారణ సత్తయందు కార్యసత్త యనుస్యూతయై యుండును. అనగా, కారణ సత్తయే, కార్యసత్త. కారణమే కార్యముందన యందు ప్రతిష్టించుకొని యుండును. కనుక, కారణతత్త్వమును 'భిభర్తికార్యం' అను చొప్పున 'బ్రహ్మ' యందురు.

పరంపరగా క్షర ప్రాదుర్భావ మక్షరునుండి కాగా, క్షరుడు బ్రహ్మ, కనుకనే "బ్రహ్మాక్షర సముద్భవమ్" అని గీత వచించెను. ఈ స్థితింబట్టి పంచకళలు గల వికార క్షరమును బ్రహ్మ యనవచ్చును. బ్రహ్మ వికారభూత, ప్రాణమయ స్వయంభువు మొదటి బ్రహ్మ. విష్ణు వికార భూత, ఆపోమయ పరమేష్ఠి రెండవ బ్రహ్మ. ఇంద్ర వికారభూత - వాఙ్మయ సూర్యుడు మూడవ బ్రహ్మ. అగ్ని వికారభూత - అన్నాదమయ పృధ్వీ నాల్గవ బ్రహ్మ. సోమ వికారభూత - అన్నమయ చంద్రుడు అయిదవ బ్రహ్మ. ఈ బ్రహ్మలైదును సహృదయ - సశరీరములగుటచే, సత్యములు. కనుక నమృతాత్మ యగు షోడశి యందుండు వీనిని బ్రహ్మ సత్యము లనెదము.

ఈ సత్యము లయిదిటికి క్రమావతరణముంబట్టి దహరోత్తర సంబంధము. పూర్వా పూర్వోదరమున నుత్తరోత్తర మిముడుట దహరోత్తర సంబంధమందురు. స్వయంభూ మహిమా మండలమందు పరమేష్ఠి తన్మహిమా మండలమందు, సూర్యుడు, అతని

మహిమా మండలమునందు పృధివి, తన్మహిమా మండలమందు జంద్రుడు. పూర్వ మండలము కంటె నుత్తర మండలము చిన్నదని వేరుగ జెప్ప బనిలేదు.

పరాత్పరుని ప్రధమావతారము షోడశి, రెండవ యవతారము బ్రహ్మసత్యము. దాని నుండి పిదప శుక్రావతారము; ఇట్లు ఆ పరాత్పర బ్రహ్మయే మాయాబల కృపచే క్రమముగ నమృతము (షోడశి) బ్రహ్మ (స్వయంభ్వాది) శుక్రమునను మూడు స్వరూపములను ధరించును. మూడు నొకదాని వివర్తములే, కనుకనే శ్రుతి:-

"తదేవశుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే
తస్మిన్ లోకాః శ్రితాస్సర్వే తదునాత్యేతి కశ్చన" అన్నది.

ఈ మూట నొకమాటు బ్రహ్మసత్యము వంకకు జూతము, సృష్టి క్రమానుసారము నిధన బ్రహ్మ మూలక చంద్ర బ్రహ్మ యే చిట్టచివరిదైనను, మన స్థితి క్రమముంబట్టి పృధివీ బ్రహ్మయే చిట్ట చివరిది. చంద్ర పృధువులన్నది స్థితి క్రమము, పృధివీ చంద్రులనుట సృష్టిక్రమము. పృధివియను బ్రహ్మ సత్య ప్రాణము ప్రాణాపోవాగన్నా న్నాదక్రమమున, నన్నాదమయము. అన్నాదమగ్ని 'అగ్నిర్భూస్థానః' అని నిరుక్తానుసారము పృధ్వి అగ్నిమయి.

అగ్నితత్త్వ మమృత - మర్త్య భేదమున రెండు భాగములు, యజ్ఞ పరిభాషానుసార మిందలి మర్త్యాగ్ని "చిత్యాగ్ని" యందురు. అమృతాగ్నిని 'చితేనిధేయాగ్ని' యందురు. చిత్యాగ్నిచే పృధివీపిండ మేర్పడును; అనగా, పృధివీపిండము చిత్యాగ్నిమయము. ఇది బ్రహ్మ సత్యము; ఈ అన్నాదమయ బ్రహ్మ సత్యము నుండి పిదప 'యజ్ఞమాత్రిక' యను వేదసత్య మవతరించును. (చూ:-కర్మయోగ విజ్ఞానము) పృధివీ కేంద్రమునుండి ప్రాణాగ్ని బయలు దేరి, భూపిండమునకు బయట చాలా దూరము వరకు దన మండలము నేర్పరుచుకొనును. ఈ ప్రాణాగ్ని యమృతాగ్ని. బహిర్మండలావచ్ఛిన్నమగు నిది అగ్ని - వాయు - ఆదిత్యులను మూడు రూపములొందును. ఈ మూడు నొకదానియందొకటి

యాహూత మగుచుండును. అందువలన గ్రమముగ, అగ్ని ప్రధాన వైశ్వానరుడు, వాయు ప్రధాన హిరణ్య గర్భుడు, ఆదిత్య ప్రధాన సర్వజ్ఞుడు జనింతురు. ఇందు, వైశ్వానరాగ్ని దేవతా వ్యాప్తి త్రివృత్ (9) స్తోమము వరకు, హిరణ్య గర్భ దేవతా వ్యాప్తి పంచదశ (15) స్తోమమువరకు, సర్వజ్ఞ వ్యాప్తి, ఏకవింశస్తోమము (21) వరకు, ఇట్లు, అన్నమయ చంద్రుడను బ్రహ్మ సత్యమునకును, అన్నాదమయ పృధివీ పిండమునకును మధ్య ప్రాణాగ్నిమయి యగు అమృత పృధివ్యాధారమున, అగ్ని వాయ్వాదిత్య మూర్తలగు, వైశ్వానర హిరణ్యగర్భ సర్వజ్ఞులను మూడు దేవసత్యముల సత్త సిద్ధమగుచున్నది.

ఈ మూడు దేవసత్యములనుబట్టి యాధిదైవిక మండలాధిష్టాత యగు నీశ్వరుని యమృతాత్మ; స్వయంభూ పరమేష్ఠి - సూర్య చంద్ర - వైశ్వానర - హిరణ్యగర్భ - సర్వజ్ఞ - పృధివి యను వానితో తొమ్మిది కళలు గలదగును. దశాక్షర ఛందస్సునకు విరాట్ఛందమని పేరు. "నవైఏకే నాక్షరేణ ఛందాంసి వియన్తి నద్వాభ్యాం" అని యుండుటచే, నొక యక్షరము తక్కువయినంతనే ఛందస్వరూపమునకు భంగమురాదు కనుక, ఒక యక్షరము తక్కువయిన న్యూన విరాట్టును విరాట్టే యగును. కాగా, "న్యూనాద్వై ప్రజాః ప్రజాయన్తే" అని యున్నందున, పై జెప్పబడిన నవాక్షరమూర్తి యగు న్యూన విరాణ్మూర్తి యగు నీశ్వరుడే 'ఇదంసర్వం' ఈ యంతయును, అతడే ఆధ్యాత్మము; ఆది భూతము నతడే, అంతటను బూర్ణేశుని పూర్ణతా సామ్రాజ్యమే.

అధ్యాత్మమందలి నవాక్షరములును వరుసగ, అమృత - అవ్యక్త - మహత్ - విజ్ఞాన (బుద్ధి) - ప్రజ్ఞాన (మనస్సు) - వైశ్వానర - తైజస - ప్రాజ్ఞ - శరీరములని పరగుచున్నవి. పేరులందు భేదమే గాని, పదార్థమట నేదో ఇటను నదియే. ఈ తొమ్మిది కళ కతిరిక్తముగా, పరాత్పరుడన్నది యఖండాత్మ.

"సంవిదన్తి నయంవేదా, విష్ణుర్వేదనవా విధిః
యతోవాచో నివర్తన్తే అప్రాప్యమన సాసహ"

అను చెప్పున, నా పరాత్పర తత్త్వము శాస్త్ర మర్యాదకు సర్వథా బహిర్భూతము. శబ్ద శాస్త్ర నిరూపణము, పై జెప్పబడిన ఖండాత్మలగూర్చి మాత్రమే. ఆయీ యాత్మలం గూర్చిన సువిశద నిరూపణముకెల్ల మా ఈశోపనిషద్విజ్ఞాన మందరయగలరు.

| ఈశ్వరుడు<br>అదిదైవతము | <u>ఇదం సర్వం</u> | జీవుడు<br>అధ్యాత్మము |
|---|---|---|
| న్యూనవిరాట్, న్యూనాద్వై ప్రజాః ప్రజాయన్తే | 1. షోడశి | షోడశి - అమృతాత్మ |
| | 2. స్వయంభూ | అవ్యక్తాత్మా } బ్రహ్మ సత్యము |
| | 3. పరమేష్ఠి | మహదాత్మ } బ్రహ్మ సత్యము |
| | 4. సూర్య | విజ్ఞానాత్మ } బ్రహ్మ సత్యము |
| | 5. చంద్ర | ప్రజ్ఞానాత్మ |
| | 6. సర్వజ్ఞ | ప్రాజ్ఞాత్మ } దేవ సత్యము |
| | 7. హిరణ్యగర్భ | తైజసాత్మ } దేవ సత్యము |
| | 8. వైశ్వనర | వైశ్వానరాత్మ } దేవ సత్యము |
| | 9. పృధివి | శరీరము = బ్రహ్మాసత్యం |

బ్రహ్మశ్రీ చల్లా సుబ్బాంబా సుబ్బారాయ తనూజ

న్మనః, అనుశ్రుత వైజ్ఞానికస్య, కృష్ణమూర్తిశర్మణః,

కృతిషు బ్రహ్మ విజ్ఞాన పరిచయే చతుష్పాద్బ్రహ్మ

నిరూపక ప్రసంగ చతుష్టయం

సమాప్తం.

ఓన్నమః పురుషోత్తమాయ

గురవే మధుసూదనాయ

# శ్రీమద్బ్రహ్మ విజ్ఞాన పరిచయము

## పంచమ ప్రసంగము

(మాండూక్యోపనిషత్)

“త్రిస్థానంచ త్రిమాత్రంచ త్రిబ్రహ్మచ త్రయాక్షరం
త్రిమాత్ర మర్థమాత్రంవా, యస్తం వేదస వేదవిత్” (ధ్యానటందు)
“త్రయోఽగ్నయశ్చ త్రిగుణాః స్థితాః సర్వే త్రయాక్షరే
త్రయాణా మక్షరాణాంచయోఽధీతే ఽప్యర్థ మక్షరమ్
తేనసర్వ మిదం ప్రోతం తత్సత్యం తత్ పరమంపదమ్” (యోగతత్వము)

ఓంకారము ద్వారా చతుష్పాత్ ప్రజ్ఞాన బ్రహ్మ నిరూపణము.

(ప్రజ్ఞానోంకార నిరూపణము)

అధ్యక్షరమ్ . . . . . . . . . . . . . . . . . . . . . . అధిమాత్రమ్

1. ప్రజ్ఞానాక్షరమ్ (1) ఓంకారము, అర్థమాత్ర

} పాదములు } మాత్రలు

పరబ్రహ్మ శబ్దబ్రహ్మ

## (ప్రజ్ఞానోంకార నిరూపణము)

### భోక్త్రాత్మద్వారా, అక్షరపురుష నిరూపణము.

ఓమ్

"భద్రంకర్ణేభిః శ్రణుయామదేవాః భద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః
స్థిరైరంగైస్తుష్టు వాంసస్తనూభిః వ్యశేమదేవహితం యదాయుః
స్వస్తిన ఇంద్రోవృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తినస్తార్క్ష్య అరిష్టనేమిః స్వస్తినో బ్రుహస్పతిర్ధథాతు"

ఓమ్ శాంతిశ్శాంతిశ్శాంతిః

ఈ శాంతిమంత్రార్థ విశదీకరణముపనిషద్విజ్ఞాన మందరయదగును.

ఉపనిషత్తులన్నిట నీ మాండుక్యము జిన్నదయినను దీనిపై పూజ్య పాద శ్రీమచ్ఛంకరాచార్యులు, విస్తృత భాష్యము రచించిరి. వారి పరమ గురువిరచిత కారికలపై గూడ భాష్యమును వెలయించిరి. కాగా, అత్యల్ప కాయము గలదయ్యు నీ యుపనిషత్తు, ఇతరోపనిషత్తులను బట్టి బృహత్కాయము కలదె అయ్యెను. వ్యాఖ్యాతలందఱకు ప్రధాన స్తంభమగు దీనిపై నెంతగా జెప్పినను తీరదు. ఋషి కొలది యక్షరము లందాత్మ విద్యయంతయు కాదు, విశ్వరూపమంతయు, నిమిడ్చి వైచిన యుపనిషత్తిది.

కానిండు, ఈ యుపనిషదర్థ సంగతికొరకు ముందుగ గొన్ని విషయముల పరిచయ మెంతయు నావశ్యకమై యున్నది. అది లేనిచో దీని యర్థ మెరుంగుట కఠినమే కాదు, అసంభవమే.

## ఉపక్రమము

సృష్టి మూలమేమి? యన్నపుడు, "ఆనంద - విజ్ఞాన ఘన, మనోమయ ప్రాణగర్భిత, వాక్కు" అని సమాధానము. సృష్టికి బ్రధానాధిష్ఠాత వాక్కే, సంపూర్ణ విశ్వమును తన ధరాతలము నందిమిడ్చికొన్నదీ వాక్కే. ఈ వాక్కులోపల ప్రాణము, ప్రాణములోపల

మనస్సు, మనస్సులోపల విజ్ఞానము, విజ్ఞానములోపల నానందము. ఇది సర్వాంతర తమము.

ఈ యైదిటిలో, ఆనంద విజ్ఞానములు సహకారులు - గౌణకారణములు. మనః ప్రాణ - వాక్కులు ప్రధానములు - ముఖ్య కారణములు. ఇక :-

ముక్తి మూలమేమి? యన్నపుడు, "వాక్ప్రాణ మనోమయ, ప్రాణగర్భితమగు నానందము" అని సమాధానము. ముక్తియందు మనః ప్రాణవాక్కులు సహకారులు - గౌణములు. విజ్ఞానానందములు ప్రధానములు - ముఖ్యములు.

సృష్టి మార్గము 'సంచరము'. ముక్తి మార్గము 'ప్రతి సంచరము'. సంచరము విజ్ఞాన మార్గము. ప్రతి సంచరము జ్ఞాన మార్గము. "బ్రహ్మై వేదం సర్వం" అన్నది సృష్టిరూప విజ్ఞాన మార్గము. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నది ముక్తి రూప జ్ఞానమార్గము. జ్ఞానము లేని విజ్ఞానము, విజ్ఞానము లేని జ్ఞానమును వ్యర్థములు. రెంటి సమన్వయమువలననే బ్రహ్మ జ్ఞానము పూర్ణమగును. బ్రహ్మయన జ్ఞానవిజ్ఞానమే. "సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ" "నిత్యం విజ్ఞాన మానందంబ్రహ్మ".

భారతవర్షము విజ్ఞానయుక్త జ్ఞానోపాసకముగ నున్నంత వరకభ్యుదయ పూర్ణముగనే యుండెను. ఔన్నత్య సంపన్నముగనే యుండెను. కాని, కొందరు వ్యాఖ్యాతల వాగ్జాలము లందు జిక్కుకొని విజ్ఞానము నుపేక్షించి, కేవలము జ్ఞానమునే - భక్తినే - కర్మనే - శరణముగా గొనగా, నధఃపతనము నొంద నారంభించెను.

జ్ఞానమున కాలంబనము విజ్ఞానము. దాని నుపేక్షింపగా భారత మిందుకు నందుకుగాని స్థితిలో బడినది. ఔన్నత్యము నొందితి ననుకొను నేటి పాశ్చాత్యలోకమును, ఈ ప్రమాదావస్థయందే మునిగి తేలుచున్నది. ఈ రెంటికిని గ్రామమునందు మాత్రమే వ్యత్యాసము. ఎట్లన :-

భారతీయులు విజ్ఞానముం దిరస్కరించి, అనగా, సాంసారిక (ప్రాపంచిక) విజ్ఞానముం దిరస్కరించి, కేవలాత్మ జ్ఞానమునే ప్రధానముగ నెంచిరి. మఱి, పాశ్చాత్యులన్ననో, జ్ఞానముం దిరస్కరించి, కేవల విజ్ఞానోపాసనను వరించిరి. వారి దృష్టియందాత్మజ్ఞాన మొక వస్తువే కాదు. భౌతిక విజ్ఞానమే వారి కారాధ్యదైవము. కానిండు, ఫలము? 'పశ్యన్నపిచనపశ్యతి'

కేవల జ్ఞానము బనిసేయదు, కేవల విజ్ఞానమును శోభకు గాదు. రెంటి సమిష్టి - ఉపాసనయునే కల్యాణ మార్గము. కనుకనే

"జ్ఞానం విజ్ఞానసహితమిదం వక్ష్యా మ్యశేషతః
యద్జ్ఞాత్వానేహ భూయోఽ న్యద్ జ్ఞాతవ్యమవ శిష్యతే"

అని భగవంతుడు సెలవిచ్చెను. సరి, ఆ యీ కారణము లన్నిటింబట్టియే, జ్ఞానము ప్రధానముగాగల యుపనిషత్తులందు, విజ్ఞానమునకు స్థానముండునన సాహసించుచున్నాము. కనుకనే సృష్టిమూలమేమి? యారంభ మొనర్చితిమి. అటనే యుత్తర మిచ్చుచు, ఆనంద విజ్ఞానములు సహకారులనియు, సృష్టియందు ప్రధానత మనః ప్రాణవాక్కులదే యనియు గూడ వక్కాణించితిమి. కనుక, నా మూటివంకకే యొకమారు చూతము.

మనస్సు - ప్రాణము - వాక్కు - అను నీ మూడు తత్త్వములును: వరుసగ అఖండ - ఖండాఖండ - సఖండములు. మనస్సు సర్వధా అఖండము. అనగా, అవ్యయుని 'శ్వోవసీయ మనస్సే' - దానికి వాక్సంబంధమున్నను లేకున్నను, అఖండ మని జ్ఞప్తియందుంచుకొనవలెను. ఇట్లు, ప్రాణమును, శుద్ధ రూపమున నఖండమయ్యును, సఖండమగు వాక్తత్త్వముతో గూడి సఖండమగు చుండుంగాన, దీనిని 'ఖండాఖండ' మందుము. ఇక మూడవదగు వాక్తత్త్వము :- పంచభూతాత్మకోపాదానమునకు; వాక్కన్నది వైదిక సంజ్ఞ. అది సర్వధా సఖండమే. దాని సఖండతయే సృష్టికి బీజము.

సృష్టియన్నది నానాభావాపన్నము. అది వాక్తత్వము నుండి యగును. మనః ప్రాణములును ఆనంద విజ్ఞానములవలె నొక విధముగ సహకారులే. ఉపాధానము కేవలముగ వాక్కే. సఖండ సృష్టి కుపాదానము సఖండవాక్కే కావలయును గదా! ఈ వాక్ప్రధానతం గురించియే "అథోవాగే వేదం సర్వం" "వాచీమా విశ్వాభువనాన్యర్పితా" ఇత్యాది శ్రుతివచనములు వెలసినవి. కాని,

"తత్తు సమన్వయాత్" అన్న దార్శనిక సిద్ధాంతానుసారము, మనః ప్రాణ వాక్కులకు సమన్వయము లేకుండ సృష్టి కాజాలదు. కనుక, మనోమయ ప్రాణగర్భిత వాక్కు సృష్టిమూల మనుకొంటిమి. విజ్ఞానము లేకుండ మనస్సు, ఆనందము లేకుండ విజ్ఞానము నుండవు. కాగా, నిట్లు సృష్టి కుపాదాన భూతమగు, వాక్తత్త్వముతో, ఆనంద - విజ్ఞాన - మనః - ప్రాణములు నాల్గును, సహకారులుగ నుండునని తేలుచుననది. ఈ స్థితిలో జివరకు :- పై జెప్పినయట్లు, ఆనంద విజ్ఞాన ఘన మనోమయ ప్రాణగర్భిత వాక్కు సృష్టి మూలమను లక్షణముపై విశ్రాంతి నొందవలసి వచ్చును.

మనస్సు నుండి కామన యుదయించును. దాని కవ్యవహితోత్తర కాలమునందె ప్రాణవ్యాపారము జరుగును. దానితో స్థిరశాంత వాక్సముద్రమందు క్షోభ పుట్టును. ఆ క్షోభయే వాక్కును సృష్టిరూపముగా పరిణమిల్ల జేయును. ప్రాణ సంబంధమునకు జెందిన తారతమ్యముంబట్టి యా వాక్సముద్రమందు, కంపము - చితి యను రెండు భావములు జనించును. కంపమునుండి శబ్దసృష్టి, చితినుండి యర్థ సృష్టి యగును. - శబ్దార్థములు రెంటికి నుపాదాన మావాక్కే. కనుకనే, శబ్దజ్ఞానముచే, అర్థబ్రహ్మ జ్ఞానమును, అర్థబ్రహ్మ వలన, శబ్దజ్ఞానమును కల్గుచున్నవి.

ప్రాణపుదెబ్బ తగులగనే నిండియున్న వాక్సముద్రము నుండి లేచినతరంగములు మనకర్ణేంద్రియమునకు దగులుటయు, నటనుండు ప్రజ్ఞారూపేంద్రునిచే నవి బద్ధములు కాగా, పరిణతములగు వాక్ఖండములే, క - చ - ట - తపాది వర్ణములకు జననులగును. ఇది కంపము యొక్క కథ. ఇక,

ప్రాణము యొక్క ప్రబలాఘాతము తగులుచో, రెండో, ఇంక నెక్కుడుగనో వాక్ఖండములు పరస్పర మిళితములైపోవును. ఆ మేళనము అయిదు విధములు. విజ్ఞానజగత్తునందా పంచ సంబంధములనే (1) అంతర్యామ (2) బహిర్యామ (3) ఉపయామ (4) యాతయామ (5) ఉద్యామములని పిల్తురు.

(1) జలమును తరళము గావించునది, తన యుష్ణతం బోగొట్టుకొని జలమున కాత్మ యగునదియు నగు నగ్ని అంతర్యామ సంబంధమున జలమందు బ్రవేశించును. (2) వేడినీటి యందలి యగ్ని సంబంధము బహిర్యామము (3) పాత్రయందలి (కుంపటి యందలి) అగ్ని సంబంధ ముపయామము (4) కుంపటి నుండి పెటిలిపడిన యగ్ని కా పాత్రతోడి సంబంధము యాతయామము (5) ఈ నాల్గు సంబంధములకును జెందక వేరుగానుండు నగ్ని సంబంధ ముద్యామము.

ఇందు సృష్టియన్నది కేవల మంతర్యామ సంబంధమునకు జెందినది. చితియన్న దాసంబంధమందె యగును. చితియందు రెండు వస్తువులకు రాసాయనిక సంబంధము కుదురును. కాగా, నా రెండు వస్తువులను స్వరూప నాశము కాగా, తన్మిథున భావముచే విజాతీయమగు నొక మూడవ వస్తువు జనించును. "అవ్యయుడాలంబన" మని "తదీయ వాగ్భాగము నుపాదానము" గా జెప్పుట యిట విరోధ మనుకొనరాదు. ఎట్లన :-

సృష్టి మూలవాక్కన్నది స్వయంభువు యొక్క వాక్కు. ఇది యా అవ్యయుని వాక్కునకు వికాస మాత్రము. అవ్యయ వాక్కు స్వయంభువునందు ప్రాదర్భవించును. ఈ స్వాయంభువ వాక్కే అనాదినిధనా, సత్యా - వేద - ఇత్యాది నామములంబ్రసిద్ధమైనది. ఈ వేదవాక్కునకు ఋగ్యజుస్సామములని మూడు భేదములు ఇందు ఋక్సామములు స్వతంత్రములు. యజస్సునందు యత్ - జూ అని రెండు భాగములు. ఇందు, 'యత్' ప్రాణము. 'జూ' భాగము వాక్కు. ఈ వాగ్భాగము నుండియే ప్రాణ వ్యాపారము ద్వారా; "సోఽ పోఽ సృజతవాచ ఏవలోకాత్" అన్న చొప్పున, "ఆపస్సు" జనించును. ఇదే అపోమయ పరమేష్ఠి నాబడును.

ఆస్వాయంభువీ వాక్కే ఆపోరూప పరిణతి నొంది భార్గవి - అంగిరసీ యను రెండు పేర్లొందును. "ఆపోభృగ్వంగి రోరూపం" అనుటచే, పారమేష్ఠ్యాపస్సు భృంగ్వంగి రాత్మకము. భృగువు సోమము. అంగిర యగ్ని. రెండు నాపోమయములు, ఏక జాతీయ తత్త్వములు. ఇందు, భృగుధార సౌమ్యవాక్కు, అంగిరాధార ఆగ్నేయీవాక్కు. మొదటి దాంభృణీవాక్కు. ఇది యర్థసృష్టికి జనని. రెండవది సరస్వతీ వాక్కు. ఇది శబ్ద సృష్టికి జనని, సరస్వాన్నామక వాక్సముద్రము, ఇదే వీచీ తరంగన్యాయమున శబ్దజనని యగుచు, 'సరస్వతి' యను పేర బరగుచున్నది. ఇట్లు శబ్దార్థసృష్టికి సమానోపాదానత్వము చక్కగా సిద్ధమగుచున్నది.

పృధివీ - జల - తేజో - వాయు - రాకాశములయిదు నర్థశబ్ధమయములు. శబ్దార్థముల యభిన్నత కింతకంటె ప్రమాణమేముండగలదు? ఇంతకును జెప్పదలచిన దేమన:- అవ్యయవాక్కు ఆలంబన మాత్రము. ఉపాదానమన్ననో, స్వాయంభువ సత్య వాగ్గర్భిత - పారమేష్ఠ్య పోమయీ వాక్కనియే. దీనినే అనగా బ్రహ్మ - సుబ్రహ్మ సమష్టినే, శుక్రమందుము. శుక్రమునే సృష్టి కుపాదానమందుము. కానీ, ఇంతయున్నను, ఈ వాక్ప్రపంచమున కాధార మా యవ్యయ వాక్కే గదా! అదిలేనిదిది లేదు. ఈ యభిన్నతం గుర్తించియే దానిని నుపాదానమని చెప్పివేయుచుందుము. ఇందుకే.

వాక్కు యొక్క విశుద్ధ రూపమును లక్ష్యముగాగొని ''నతస్యకార్యం, కరణంచవిద్యతే'' ''నకరోతి నలిప్యతే'' అనియును, ప్రకృతిరూప వాక్కు యొక్క యవినాభావమును లక్ష్యముగా గొని,

''మత్తః పరతరంనాన్యత్ కించిదస్తి ధనంజయ
మయిసర్వమిదం ప్రోతంసూత్రే మణిగణాఇవ''

అనియును జెప్పబడినది. దృష్టి భేదముంబట్టి అవ్యయ వాక్కు ఆలంబనము - ఉపాదానము - నిమిత్తము గూడనగును. కానిండు, ప్రకృతము :- ఆనంద విజ్ఞానఘన

మనోమయ ప్రాణగర్భిత వాక్కు సృష్టి కుపాదానమనియే. ఇందు ప్రాణ వ్యాపారము వలన గంపముపుట్టెనా; శబ్ద సృష్టియగును. అంతర్యామమను ఖండాఖండ రూపమున, బరిణతములయిన విజాతీయ వాక్కుల, రాసాయనిక సంయోగము కల్గెనా? అర్థసృష్టి యగును. ఈ రెంట నొకదాని జ్ఞానము రెండవదాని ప్రాప్తికి సహాయకమగును. ఈ విజ్ఞానమును గుఱిగాగొనియే,

"ద్వేబ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మ పరంచయత్
శాబ్దేబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధి గచ్ఛతి"

అను వాక్యము వెలసినది. అందు శబ్దబ్రహ్మ నటుంచి పరబ్రహ్మ వంకకు జూతము. ఇది ధర్మశూన్యము - ధర్మయుక్తమునని రెండు విధములు. ధర్మ శూన్యమన్నది శాస్త్రములందు, నిరంజన - నిష్కల - ద్వంద్వాతీత - అఖండ - నిర్ధర్మక - అశేష భేదశూన్య ఇత్యాది నామములచే బ్రసిద్ధ మయినది. శుద్ధరసము పేరే నిర్విశేష నిర్ధర్మక బ్రహ్మ. ఇది సర్వధా శాస్త్రానధికృతము. ఇక,

రెండవది సర్వ ధర్మోపపన్న బ్రహ్మ. ఇది విశ్వము - విశ్వచరము - విశ్వాతీతము - నని మూడు విధములు. సర్వబల విశిష్టమగు పరాత్పరము సర్వ ధర్మోపపన్నము; ఇదే అభయమను బ్రహ్మ. ఇది విశ్వాతీతమగుటచే నవాఙ్మానస గోచరము, కనుక నిర్విశేషమువలె, శాస్త్రానధికృతమే. షోడశీ పురుషుని పేరే విశ్వచరబ్రహ్మ. స్వయంభూ - పరమేష్ఠి - సూర్య - చంద్ర - పృథ్వీ - యమ నైదు ప్రాకృతాత్మల సమష్ఠియు విశ్వము, ససీమతచే, విశ్వ - విశ్వచర బ్రహ్మలు శాస్త్రాధికృతములు. ఈవిధముగ:-

"చతుష్టయంవా ఇదం సర్వమ్"

అను వచనానుసారము, ఒకే బ్రహ్మకు, (1) నిర్విశేష (2) పరాత్పర (3) షోడశి (4) విశ్వమునని నాలుగు వికృతపరిణామములు. ఇందు మొదటి రెండును పూర్తిగా జర్చింపరానివి. శాస్త్రము వీనిని స్పృశింపజాలదు. శబ్దశక్తియన్నది యత్కించి త్పదార్థతావచ్ఛేదకావచ్ఛిన్నత యున్నపుడు గదా, ప్రవర్తించును. పై జెప్పబడిన యా

రెండును పదార్థాతీతములు. శబ్దార్థ సృష్టులు రెండిటికి నావలివి. కనుక నట శబ్దమునకు గతి లేనందువలననే, శ్రుత్యాదులు.

"యస్యామతం తస్యమతం మతం యశ్య నవేదసః
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతాం
యతో వాచోనివర్తంతే అప్రాప్య మనసాసహ
సకస్యస్తోతవ్యః కతివిధగుణః కస్యవిషయః"

అని తదవిజ్ఞేయతను చాటి ధన్యతం గాంచియున్నది ఇక :-

మిగిలినవి విశ్వచర విశ్వములు. ఈ రెండును జక్కగా శాస్త్రములందు ప్రతిపాదింపబడినవి. సంహితా - బ్రాహ్మణములు విశ్వ బ్రహ్మను, అరణ్యకోపనిషత్తులు విశ్వచర బ్రహ్మను నిరూపించు చున్నవి. విశ్వము - విశ్వాత్మయు నవినాభూతులు. "తత్ సృష్ట్వాతదేవాను ప్రావిశత్" అను చొప్పున బ్రవిష్టాత్మ సృష్ట విశ్వమందు బ్రవిష్టమగును. కనుకనే విశ్వబ్రహ్మం బ్రతిపాదించు సంహితా బ్రాహ్మణములు, ఆత్మయందును; ప్రవిష్ట బ్రహ్మం బ్రతిపాదించు నారణ్యకోపనిషత్తులు విశ్వమందును లక్ష్యముంపవలసివచ్చెను. రెంటికి రెంటను ప్రధానతా ప్రధానతలందే తారతమ్యము. ఒక భాగము కర్మమయ విశ్వమునకు బ్రాధాన్యమునిచ్చును. రెండవ భాగము జ్ఞానమయాత్మకు బ్రాధాన్యమిచ్చును.

కర్మమయ విశ్వము త్రిగుణ భావాపన్నము. సంహితా బ్రాహ్మణము లీ త్రిగుణ భావయుక్తములే. త్రైగుణ్య రూపాశక్తి కర్మచే బంధన మేర్పడును కనుకనే భగవంతుడు ప్రవృత్తి కర్మమయ వేదముం గూర్చి, "త్రైగుణ్య విషయావేదా నిస్త్రైగుణ్యో భవార్జున" అనియెను. కానిండాకర్మభాగ చర్చయిపుడు ప్రస్తుతము కాదు. ఆత్మ విద్యా ప్రతిపాదములగు, అనగా, ప్రవిష్ట బ్రహ్మ ప్రతిపాదకములగు నుపనిషత్తులవంక కరుగుట గదా! ప్రస్తుతము?

ఉపనిషత్తులలం దేమియున్నదన్న ప్రశ్న కీశోపనిషదారంభమందె "ఆత్మ విద్యాస్వరూప నిరూపణమ్" అని చెప్పి యుంటిమి. ఆత్మ శబ్దము సాపేక్షికము. తల్లి - తండ్రి - పుత్రుడు - గురువు రాజు అనగానే ఎవనితల్లి, ఎవని తండ్రి యని ప్రశ్నలు పుట్టి రాముని తల్లి - కృష్ణుని తండ్రి మొదలగు సమాధానము వలన శాంతినొందునట్లే ఆత్మయనగనే యెవని ? దేని? యని ప్రశ్నలు వెలువడినపుడు విశ్వమున కాత్మ యనవలసి యుండును. ఇంతకు జెప్పదలచిన దేమన:- పుత్రుడు లేని, శిష్యుడు లేని, తండ్రి, గురుశబ్దములవలె విశ్వము లేని యాత్మశబ్దము ననుపపన్నమనియే. కనుకనే , యుపనిషత్తులందాత్మ నిరూపణావసరము, గౌణరూపముగ విశ్వముంగూడ నెదుట బెట్టవలసి వచ్చుచున్నది.

ఉపనిషత్తు విశ్వముంజూపి, నీవారాధింపదగిన దిదికాదు విశ్వాధారమగు విశ్వాత్మ నారాధింపు మనుచున్నది. ఆత్మనుండి విశ్వము వంకకు గొనిపోవుట వేదమందలి కర్మకాండ పని. విశ్వమునుండి యాత్మవంకకు గొంపోవుట యుపనిషత్తుపని. ఆ యీ విషయము మరొకచో విమృష్టమయినది.

<table>
<tr><td>(1) నిర్విశేషము - రసరూపము - నిర్ధర్మకము</td><td></td><td rowspan="2">శాస్త్రానధికృత</td></tr>
<tr><td>(2) పరాత్పరము - సర్వబలం విశిష్టరసము - పరమేశ్వరుడు</td><td rowspan="3">సర్వధర్మోపన్న</td></tr>
<tr><td>(3) ప్రవిష్ఠాత్మ - యీశ్వరుడు</td><td rowspan="2">శాస్త్రాధికృత</td></tr>
<tr><td>(4) ప్రవిష్టంబ్రహ్మ - జగత్తు</td></tr>
</table>

ఉపనిషత్తు ప్రవిష్టాత్మనిరూపణ సేయుననుటకు సందియము లేదు. ప్రవిష్ట బ్రహ్మ రెండు విధములు. (1) విశ్వాపేక్షంబట్టి సర్వ వ్యాపక, విశ్వశరీరావచ్ఛిన్నుడగు నీశ్వరుడొక విధము. ఇదే సర్వ భూతాంతరాత్మ యనబరగు ప్రవిష్ట బ్రహ్మ. (2) విశ్వాపేక్షంబట్టి పరిచ్ఛిన్నమును, శరీరాపేక్షంబట్టి సర్వ వ్యాపక శరీర విశ్వావచ్ఛిన్నము నగు జీవుడు - భూతాత్మ నాబరగు ప్రవిష్ట బ్రహ్మ.

ఈ రెంటిలో నుపనిషత్తు ఏ ప్రవిష్ట బ్రహ్మం గూర్చి నిరూపణ మొనర్చును? అన్నచో, జీవుడను ప్రవిష్ట బ్రహ్మను లక్ష్యముగా గొని నిరూపణ సేయననవచ్చును. ఉపనిషత్తు లందు ప్రధానత జీవాత్మకే. ఏలయన:- ఉపనిషత్తె కేవలము నిరూపించు నర్థము “నీవు నీ స్వరూపమును మరచితివి. దానిం గుర్తింపుము. ఆత్మయాజివికమ్ము. విశ్వయాజివికావలదు. నీ సృష్టమును ప్రవిష్టమునకు గొనిపొమ్ము” అని మాత్రమే.

ఇంత యున్నను, ఉపనిషత్తులు విభిన్నార్థ ప్రతిపాదకములనియు జెప్పెదము. ఉపనిషత్తు లన్నియు నాత్మ ప్రాప్తికుపాయములనే చెప్పుచున్నవి కాని, తదుపక్రమము లనేకములు. నానోపక్రమము లగుటచే వాని వాని నిరూపణీయ విషయములును వేర్వేరే. అయినను, నిధనము (పర్యవసానము) అన్నిటికి నేకమగుటచే నన్నిటి నిరూపణీయ విషయ మొకటే యందుము.

ఎట్లన :- ఉపనిషత్తునకు బ్రధానలక్ష్యము జీవాత్మ. కనుక, దీనికే తదీయ విశ్వస్వరూపమును తేటపరచి ప్రకృతానుసరణము సేయింపబడును. అవ్యయ - అక్షర - క్షర సమష్టి యీశ్వరుడు. స్వయంభూ - పరమేష్ఠి - సూర్య - చంద్ర - పృధువుల సమష్టి విశ్వము. ఈయైదే, జీవజగత్తు నందు, అవ్యక్త - మహాన్ -విజ్ఞాన - ప్రజ్ఞాన - భోక్త్రాత్మలు నాబరగుచున్నవి. ఈ యైదిటి కాధారము ‘చిత్య’ శరీరము. శరీర పిండమందు, వైశ్వానర - తైజస - ప్రాజ్ఞ రూప భోక్త్రాత్మ యున్నాడు. దానిపై వరుసగ, విజ్ఞానము, అవ్యక్త గర్భిత మహత్తు - షోడశీ పురుషుడు నున్నారు. షోడశి కమృతాత్మయని పేరు. అవ్యక్తాది పంచకము పేరు ‘బ్రహ్మసత్యము’. శరీరము యజ్ఞసత్యము. యజ్ఞసత్యము బ్రహ్మ సత్యముపైని, అది యమృత సత్యముపైని, ప్రతిష్ఠితములు.

అమృతమాత్మ. ఇదే ప్రాప్తవ్యము. (1) బ్రహ్మసత్య రూపములగు నవ్యక్తాది పంచక్షర భాగములను. (2) శరీరమును (2) విశ్వములు వీని నమృతము మీదికి జేర్చుట. యుపనిషత్తుల పని. విశ్వమున కనేకము లవయవములు అన్ని యుపనిషత్తులు నా యన్నిటికి నమృతాత్మతో సంబంధముంజెప్పవు.

ఒక యుపనిషత్తు భోక్త్రాత్మతో, వేరొకటి విజ్ఞానాత్మతో మరొకటి ప్రజ్ఞానాత్మతో, ఇంకొకటి మహదాత్మతో, లేదా, శరీరమందలి యీశ్వరాత్మతో నుపక్రమించును. చూడుడు, ఈశోపనిషత్తు ఈశ్వరాత్మతో, కేనోపనిషత్తు ప్రజ్ఞానాత్మతో, కఠోపనిషత్తు భోక్త్రాత్మతో, ప్రశ్నోపనిషత్తు పంచాత్మలతో, ముండకోపనిషత్తు విజ్ఞానాత్మతో నుపక్రమించినవి. ఏది దేనితోనుపక్రమించినను ప్రాప్తి స్థాన మొకటే యమృతాత్మ. మార్గములు భిన్నములు. దేని నేయుపనిషత్తు ప్రధానముగా గొనునో, అది దానికి నిరూపణీయాంశ మగుంగాన దానిం దానికి నిరూపక మందుము.

ప్రస్తుతము మన యీ మాండూక్యము భోక్త్రాత్మతో నుపక్రమించి దాని నమృతాత్మ కడకు గొంపోవుచున్నది. కనుక కఠోపనిషత్తువలె దీనింగూడ భోక్త్రాత్మనిరూపకమందుము. ఇంకను సూక్ష్మముగా జూచినచో నీ యుపనిషత్తునందు సర్వ ప్రపంచము నిండి యున్నట్లు గోచరించును. దీని యుపక్రమోప సంహారముల నరయుచో దీనిని సర్వోపనిషత్తన్నను సత్య దూరము కాదని, వక్ష్యమాణ గ్రంథమువలన తెల్లమగును. ఇంతటితో దొలిపలుకులు సమాప్తములైనవి. **ఇత్యుపక్రమః**

ఇక నుపనిషత్తు నారంభింతము. దీని సర్వవ్యాపకత జూపుచు నీ మంత్రము మొదట నెదుటికి వచ్చుచున్నది:-

"ఓమిత్యే తదక్షర మిదం సర్వంః తస్యోప వ్యాఖ్యానం భూతం -
-భవద్ - భవిష్యదితి సర్వమోంకార ఏవ; యచ్చాన్యత్ త్రి కాలాతీతం, తదపి, ఓంకార ఏవ"

"ఓమ్ అను నీయక్షర మీ సర్వము, భూత - భవద్ (వర్తమాన) భవిష్యత్తులు దానికి ఉపవ్యాఖ్యానము కనుక సర్వము ఓమ్‌కారమే. మఱియు, త్రికాలాతీతమగునదియును ఓంకారమే," అని యక్షరార్థము. ఇక దీని తత్త్వవివరణమునకై ప్రయత్నింతము:-

ఉపనిషత్తు ఆత్మనిరూపణ సేయును, షోడశీ పురుషుని పేరు ఆత్మ యనుకొంటిమి. వాస్తవమున కమృతమను పేరు మధ్యనున్న యక్షరునిది. అవికారియగు నవ్యయుడుగాని, వికారియగు క్షరుడుగాని సృష్టికర్తలు గారుకదా! ఇక, కుర్వాణుడగు నక్షరుడే సృష్టికి మూలము. అతడు లేనిచో క్షరుడారంభణ (ఉపాదాన) మగుట, అవ్యయుడధిష్ఠాన (ఆలంబన) మగుటయు నేది? అవ్యయాలంబనమున, క్షరోపాదనముచే విశ్వమును వెలయించుటన్నది మధ్యనుండు, పంచకళ, కుర్వాణాక్షరుని మహిమయే. కనుకనే క్షరోపాదానత నటుంచి, ఋషిస్పష్ట శబ్దములతో

"తథాఽ క్షరాద్వివిధాః సోమ్యభావాః ప్రజాయంతే తత్రచైవాపియన్తి" అనవలసి వచ్చెను. విశ్వమంతయు 'ఇదం సర్వమ్'. దీనికుపాదానము క్షరుడు. ఆలంబనమవ్యయుడు. ఈ స్థితిలో "అవ్యయయుక్తం క్షరమిదం సర్వమ్" అనవలసినది, కాని ఋషి "అక్షరమిదం సర్వం" అనుచున్నాడు. కారణము?

మధ్యనుండు నక్షరుడే అవ్యయాత్మ క్షరమును, సృష్ట (విశ్వ) మందు ప్రవిష్టము గావించుచున్నాడు. అక్షరబ్రహ్మ యన గేవల మక్షరమే కాదు, షోడశీ ప్రజాపతి యని భావము. ఈ షోడశికి బేరు ఓమ్. ఇది యభిధానమయినను, ఈ యేకాక్షరబ్రహ్మ (ఓమ్ అన్నది) శబ్దబ్రహ్మ. ఇది యా పరబ్రహ్మ కేకదేశము? ఇట్టిచో పరబ్రహ్మను "ఓమ్" అనవచ్చునా? కూడదు; కాని, అభిధానాభిధేయములకు, అభేదము చెప్పనెంచినపుడట్లే చెప్పక తీరదు గదా!

ఈ యమృతాత్మ (అక్షరాత్మయగు షోడశి) ఆత్మయోని (ప్రవేశ నిర్గమస్థానము యోని) భూతాత్మ - ప్రజ్ఞానము - విజ్ఞానము; మహత్తు మొదలగునవి యీ యక్షర సంబంధముంబట్టియే, యాత్మలనిపించుకొనుచున్నవి. అమృతాత్మకు, మొదట మహత్తుతో, పిదప తద్ద్వారా విజ్ఞానముతో, పిమ్మట తద్ద్వారా ప్రజ్ఞానముతో, తరువాత తద్ద్వారా భూతాత్మతో సంబంధము కల్గును. ఈవిధముగ "ఏకంవా ఇదం విబభూవసర్వమ్" అనుచొప్పున, ఒకే యమృతాత్మ, అంతటను వ్యాప్తమగుచున్నది.

శ్రుతికి ఆత్మ సామాన్యముం గ్రహించుటిష్టము కనుక నాయీ యే పేరు నెత్తక, అక్షరనామము జెప్పినది. ఏమి? అక్షరసంబంధ మన్నిటితో గలదు గదా! ఈ యక్షర బ్రహ్మయే ఆత్మ - ప్రవిష్ట బ్రహ్మ. ఆత్మయన్నది సాపేక్షమనుకొంటిమి గదా! ఆత్మయన్నంతనే విశ్వముంగూడ, గ్రహించి తీరవలయును. ఓమ్ రూపమగు నక్షరముచే ఆత్మ - విశ్వములు రెంటిని గ్రహింపవలయును విశ్వమన్నది అంగము. అందు ప్రవేశించిన యాత్మ అంగి అంగవిశ్వము త్రికాలము. ఈ ప్రపంచము, మొదట లేదు - ఇపుడున్నది - ముందుండబోదు. భూతమయమగు విశ్వమంతయును,

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారతః
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా?

అనుచొప్పున, అవ్యక్త - వ్యక్త - అవ్యక్త రూపము. విశ్వమందు, విశ్వాంతర్గతమగు ప్రతియొక పదార్థమందును, భూత - వర్తమాన - భవిష్యత్తులను మూడు కళల సంబంధమునుండును. ఈ మూడు కళలును మర్త్యములు. వీని కాధారము తురీయమగు విశ్వాత్మ. అది త్రికాలాతీతము, త్రికాలాబాధితము, నిత్యము.

విశ్వమనిత్యము కనుక త్రికాల భావాపన్నము, త్రైకాలిక విశ్వము, త్రికాలాతీతమగు నాత్మ, ఈ రెండు నొక యక్షరము. ఆత్మ యొక్క క్షరభాగము విపరిణామ స్వభావము గలది కనుక విశ్వముగనైనది. అదే క్షరరూపముచే విశ్వమై అక్షర రూపముచే నందు బ్రవేశించి దానికాత్మ యగుచున్నది. అదే విశ్వము, అదే విశ్వప్రవిష్టము అ - ఉ - మ్ - అను మూడు కళలు విశ్వము, నాల్గవదగు నర్ధమాత్ర యాత్మ, ఆ యీ రెంటి సమష్టియు, ఓంకారము.

(1) అర్ధమాత్ర - ప్రవిష్టాత్మ - త్రికాలాతీతము

} విశ్వము-త్రైకాలికము

"భూతం-భవత్-భవిష్యత్ యచ్చాన్యత్-త్రికాలాతీతం సర్వ మోంకారఏవ"

## ఓంకార మైదు విధములు

ప్రవిష్టాత్మకు, అవ్యక్తాత్మ - మహదాత్మ - విజ్ఞానాత్మ - ప్రజ్ఞనాత్మ - భూతాత్మ యని పంచవివర్తములు. సృష్ట విశ్వమునకు; స్వయంభూ. పరమేష్ఠి - సూర్య - చంద్ర పృధ్వులని యైదు వివర్తములు. ప్రథమ మంత్రమందు శ్రుతి, సమష్టిరూపమున నన్నిటి నొకమారే నిరూపించుచున్నది. ఇందుచే వ్యష్టినిరూపణ గూడ చేసినదే యగుచున్నది. సమష్టింబట్టి యొక యోంకారము, వ్యష్టింబట్టి అయిదు ఓంకారములు. చూడుడు:-

అవ్యక్తోంకారము (1)

(1) షోడశీగర్భితావ్యక్తాత్మ - అర్ధమాత్ర - త్రికాలాతీతము

(2) మహదా

(3) విజ్ఞానా

(4) భూతాత్మ – ఒ

} త్రైకాలికము

మహాదోంకారము (2)

(1) షోడశీ అవ్యక్త గర్భిత మహదాత్మ - అర్ధమాత్ర - త్రికాలాతీతము

} త్రైకాలికము

విజ్ఞానోంకారము (3)

(1) షోడశీ అవ్యక్త మహద్గర్భిత విజ్ఞానాత్మ అర్ధమాత్ర త్రికాలాతీతము

} త్రైకాలికము

## ప్రజ్ఞానోంకారము (4)

(1) షోడశీ అవ్యక్త మహద్విజ్ఞాన గర్భిత ప్రజ్ఞానాత్మ - అర్ధమాత్ర - త్రికాలాతీతము

} త్రైకాలికము

## భోక్తాత్మోంకారము (5)

(1) షోడశీ అవ్యక్త మహద్విజ్ఞాన ప్రజ్ఞాన గర్భిత భోక్తాత్మ - అర్థమాత్ర - త్రికాలాతీతము

(2) ఇంద్రియ

(3) భోగము

(4) భోగాయ

} త్రైకాలికము

అవ్యక్త - మహత్ - విజ్ఞాన - ప్రజ్ఞాన భోక్తలు పంచబ్రహ్మలు. ప్రతియొక బ్రహ్మకును నాల్గు పాదములు. మూడు పాదము లంగము, ఒక పాదమంగి, మూడు మర్త్య కళలు. ఒకటి యమృతము. ఆ యీ రెండిటి సమష్టియు నోంకారము. ఈ యంతయు నుదాహరణ మాత్రము.

ఇట్టి యోంకారములు అనంతములగును. ప్రతియొక పరమాణువు నొక్కొక బ్రహ్మ - ప్రతి బ్రహ్మకును నాల్గు పాదములు - అందు మూడంగములు - ఒకటి అంగి. "ఇదం సర్వమ్" అనుటచే ఋషి యభీష్టమంతయు గ్రహింపవలయుననియేకదా తేలును? కనుకనే యేపేరును బెట్టక, ఆత్మకక్షర మనియు, విశ్వమునకు భూత - భవత్ - భవిష్యత్తులనియు నిర్దేశించెను. అవ్యక్తాదులందే బ్రహ్మకేని తత్తన్మర్త్యపాదములు మూడు మూడును త్రికాల భావమునకు లోనగునవి యగుచు, ఆత్మ భావ మక్షరునకు జెందినదగుచుండును. ఈ సామాన్య విజ్ఞానముం గుఱిగా గొనియే, శ్రుతి "ఓమిత్యే తదక్షర మిదం సర్వ" మన్నది.

ప్రజ్ఞాన - విజ్ఞాన - మహత్తులన్నియు నక్షరమే. అక్షరమే అంతయు నైనది. దీనింబట్టి శ్రుతి "నీవు సర్వజ్ఞుడవు కాగోరి యాత్మజ్ఞానము బడయనెంతువా? అక్షరోపాసన సేయుము. అక్షర మన్ని రూపముల బరిణతమయ్యు నన్నిటికి వేరుగ నున్నట్లే, దానింగుర్తించిన పిదప నీవు నన్నియు జేయుచున్నను బంధములకు వేరుగనుందువు" అని యుపదేశించుచున్నది. ఇదే ఆ యక్షరమున కుపవ్యాఖ్యానము. = స్వరూప పరిచయము.

ఆ యీ పై విషయములను సృష్టికరించుచు ఋషి చెప్పుచున్నాడు;-

"సర్వం హ్యేతద్బ్రహ్మ; అయమాత్మా బ్రహ్మ;
సోయమాత్మా చతుష్పాత్"

ఆత్మ బ్రహ్మ యొక్క చతుష్పాద్భావము రెండు విధములుగ నెఱుంగవలయునని పైని జెప్పియుంటిమి. సృష్ట (విశ్వ) యుక్త ప్రవిష్టాత్మ బ్రహ్మ నాల్గుపాదములు కలది. విశ్వము త్రిపాది. ఆత్మయొక పాదము. రెండిటి మొత్తము చతుష్పాద్బ్రహ్మ యనుకొంటిమిగదా!

ప్రస్తుతము విశ్వమును విడువుడు కేవలము ప్రవిష్టబ్రహ్మనే చూతము. అదియు స్వయముగ నాల్గు పాదములు కలదే. అవ్యయుడు ప్రధమ పాదము. అక్షరుడు ద్వితీయ పాదము. ఇక మిగిలిన ఆత్మక్షర మన్నదానికి, బ్రహ్మ - సుబ్రహ్మ యని రెండు భేదములు. ఆత్మక్షరమునకు జెందిన ప్రాణభాగము వేదత్రయీ రూపమున బరిణతమగుచున్నది. దాని పేరు బ్రహ్మ. దాని ప్రాణభాగము నుండి 'సుబ్రహ్మ' ప్రాదుర్భవించుచున్నది. బ్రహ్మగర్భిత సుబ్రహ్మయే శుక్రము. ఇది సృష్టికి మూలము. దీనినే అవ్యక్తమందురు. విజ్ఞాన సంబంధము లేనిచో నీ శుక్రము ఘోరతమోరూపము. "తమ ఆసీత్ తమసాగూఢమగ్రే" "ఆశీవిదంతమో భూత మప్రజ్ఞాతమలక్షణమ్" అను మొదలగు వచనము లీ యవ్యక్త తమోమయ శుక్ర నిరూపణ సేయుచున్నవి.

శుద్ధ బ్రహ్మ భావము సృష్టి కుపాదానము. బ్రహ్మ గర్భిత సుబ్రహ్మ శుక్రము - మైధునీసృష్టికి గారణము. ఈ శుక్రమే విజ్ఞానసంబంధమున మహత్తని పేరొందుచున్నది త్రిగుణ భావాపన్నమగుచున్నది. ( ఆ యీ విషయ మన్యత్ర వివృతము) ఇంతకును:-

విశ్వ ప్రవిష్టమయిన యాత్మ యొక్క క్షరభాగము బ్రహ్మ - సుబ్రహ్మ యను రెండు భాగములుగ బరిణతమై సృష్టి కుపాదాన మగుననియే చెప్పదలచినది. కాగా, నా రెండును, ఆ ప్రవిష్టమున కవయవములు. ఈ రెంటివలన, విశ్వోపహిత శుద్ధ ప్రవిష్టాత్మయు, నాల్గు పాదములు గలదగుచున్నది. ఆత్మ యొక కళ - విశ్వము త్రికళము. రెంటి మొత్తమొక యోంకారము.




అక్షరు నమృతమన్నట్లే క్షరుని “బ్రహ్మాక్షర సముద్భవమ్” అను చొప్పున బ్రహ్మయందురు. మంత్రమందు ఋషి, “అక్షరమిదం సర్వం” అనియెను. కాని, యదార్థముగ, ‘ఇదం సర్వ’మునకు గారణము (ఉపాదాన కారణము) విపరిణామియగు క్షర బ్రహ్మగాని, యక్షరుడు కాడు. బ్రహ్మ, ఇదం సర్వం గాని అక్షరుడా? కనునే ఋషి రెండవ మంత్రమందు ‘సర్వం హ్యేత ద్బ్రహ్మ’ అనియెను. కాని అక్షరుడును ఇదం సర్వ

మయిన యాక్షరబ్రహ్మకు వేరుగనుండునా? ఎన్నడును గాదు. మార్గములు భిన్నములు. సత్త యొకటే, ఆ యక్షరాత్మయే క్షరబ్రహ్మ. అతని యమృతభాగమక్షరము, మర్త్యభాగము క్షరము, రెంటి మొత్త మొక ప్రజాపతి, మాటవరుస కాత్మ (అక్షరము) బ్రహ్మ (క్షరము) భిన్నములు. వస్తుతః ఆత్మయే - (అక్షరుడే) బ్రహ్మ. బ్రహ్మయే అంతయును. ఈ యభిప్రాయముతోడనే "అయమాత్మా- బ్రహ్మ" అక్షర - క్షరములనియెను. ఆ యొకటే ఉపాదానము - నిమిత్తము - ఆలంబనమును.

ఇదెట్లు? అన్నచో ప్రత్యుత్తరముగనే ఋషి పిదప 'సోఽ యమాత్మా చతుష్పాత్' అనియెను. ఒక యాత్మకే అవ్యయ - అక్షర - బ్రహ్మ -- సుబ్రహ్మలన్నవి నాల్గు పాదములు. ఆ యీయేకాత్మ యొక్క యొక పాదము, అవ్యయము సృష్టి కాలంబనము. రెండవదగు నక్షరపాదము నిమిత్తము మూడు - నాల్గవ పాదములగు బ్రహ్మ - సుబ్రహ్మ లుపాదానములు. క్షరుంబట్టి విశ్వమంతయు నాత్మ - అక్షరముంబట్టి యాత్మ విశ్వకర్త. అవ్యయముంబట్టి యాత్మ విశ్వాధారము, మఱియు నవ్యయుంబట్టి యాత్మ కర్తయు గాదు కారణమును గాదు ఉపాధానమును గాదు. అక్షరుంబట్టి ఆత్మ కర్త అయ్యునకర్తయే, క్షరాపేక్షతో, 'బ్రహ్మైవేదం సర్వమ్'.

అధవా, ఈ రెండవ మంత్రము ప్రతి సంచరక్రమమును నిరూపించుచునన వచ్చును. ప్రకరణారంభమందె, ఆత్మ (ఏకము) నుండి విశ్వము (నానా) వంకకు వచ్చుట సంచరమనియు విజ్ఞాన పక్షమనియు, ననుకొంటిమి. ప్రధమమంత్రము దీని నిరూపణ గావించుచున్నది. 'అక్షరమిదంసర్వం' అనుచో అక్షరముద్దేశ్యము - సర్వము విధేయము. అక్షరుచే నంతయు నయ్యెను. ఒకటి నుండి - నేకము వెలసెను. ఇదే సంచర పక్షము విశ్వము (నానా) నుండి ఆత్మ (ఏకము) వంకకుబోవుట ప్రతి సంచరము, జ్ఞానపక్షము. దీని నిరూపణ రెండవ మంత్రము సేయుచున్నది. "సర్వంహ్యేతద్బృహ్మ" యనుచో సర్వముద్దేశ్యము బ్రహ్మత్వము విధేయము. సర్వమన్నది క్షరవిశ్వము. దీని కంతిమగతి బ్రహ్మయను క్షరము. దానికి బైని ఆత్మ (అక్షరము) అదే చతుష్పాదమై; సంచర - ప్రతిసంచరముల కధిష్ఠాత యగుచు, నంతయు నైనది.

నానాత్వ భేదకారణము. భేదమన్నదే అంతరము "యదుదర మంతరం కురుతే అథభయం భవతి" అనుచొప్పున, అంతరమన్నది భయ కారణము. భయము క్షోభరూపము - అశాంతి మూలము. "అశాంతస్య కుతః సుఖం" అశాంతునకు సుఖమెక్కడ? ఇక, ఏకత్వ మద్వైతకారణము, అది యంతరము లేనిది - భేదసూన్యము. సంచర - ప్రతిసంచరములు జూపుచు, శ్రుతి, "నీకగపడు నానాత్వమందు నానాత్వమన్నదించుకయు లేదు. ఒకేతత్త్వ మంతటను వ్యాప్తమై యున్నది. సంచర - ప్రతిసంచరముల ద్వారా, ఏనాడాతత్త్వముం గుర్తింతువో ఆనాడా యేక స్వరూపాభయపదము నొందుదువని వక్కాణించు చున్నది. ఇది రెండవ మంత్రవివరణము ఇక :-

సృష్టోపహిత ప్రవిష్టబ్రహ్మయు, సృష్టి విశిష్ట ప్రవిష్ట బ్రహ్మయు, నాల్గు పాదములు కలవే, యనుకొంటిమి. ఉదాహరణముగ నొక బ్రహ్మయొక్క చతుష్పాత్త్వముం జూపి యీ ప్రకరణమును ముగించెదము. అన్నిటికంటె దగ్గరది భోక్తాత్మ. దానిపై బ్రజ్ఞానము, దానికి మీద విజ్ఞానము, అంతకుబైని మహత్తు, ఆ మీద నవ్యక్తము, ఆ పైని షోడశి, సామాన్య మానవులు భోక్తాత్మ ప్రజ్ఞానములను గుర్తింతురు. ప్రజ్ఞాన మనస్సు పని నందరును జూతురు. భోక్తాత్మ ప్రత్యక్షము 'అహమస్మి' రూపమున నందరకు గల్గుచున్నది. కనుకనే స్థూలారుంధతీ న్యాయమున, ఋషి మిక్కిలి సన్నిహితము, నందరకు బరిచితము నగు, భోక్తాత్మ తోడి ప్రజ్ఞానబ్రహ్మ నుదాహరణార్థము మనయెదుట బెట్టుచున్నాడు. ప్రజ్ఞానము బ్రహ్మ. దీనితో భోక్త కళలు మూడున్నవి. భోక్తాత్మయన, చితేనిధేయాగ్నిచే వెలసిన, వైశ్వానర, తైజస - ప్రాజ్ఞుల సమష్టి. దీనిని దేవసత్య మందురు. దీనిందనపై ధారణసేయు నా బ్రహ్మ సత్యమున కవశ్యరూపము బ్రజ్ఞానబ్రహ్మ. తదాంతర సంబంధముననే, ప్రజ్ఞానాత్మ యాత్మ యనబరగుచున్నది. ప్రజ్ఞానమనగనే విజ్ఞానము, మహత్తు, అవ్యక్తము, షోడశీ రూపముల మొత్తము గ్రహింపబడును. ఏమియన:--

సంస్థా విభాగముంబట్టి యుత్తరోత్తరాత్మయందు పూర్వ పూర్వాత్మల సంబంధముండక తీరదని నిశ్చితార్థము కదా! సరియే,

వైశ్వానరు డగ్ని, అర్థశక్తి కధిష్ఠాత; తైజసుడు వాయువు, క్రియాశక్తి కధిష్ఠాత; ప్రాజ్ఞు డింద్రుడు, జ్ఞానశక్తి కధిష్ఠాత, ఇట్లు స్థూలదృష్టింజూచినను, ఈ శరీరమందు జ్ఞాన క్రియార్థమూలకులగు నగ్ని వాయ్వింద్రులను మూడు దేవతల సామ్రాజ్యము కన్పట్టును. కాని, యీ మూవురును ఏ బ్రహ్మ యొక్క మహిమచే మహిమావంతులగు చున్నారో, ఏవంగుణ విశిష్టము, అక్షర రూపమునగు, నా బ్రహ్మ నుపాసింపవలయును. కేనోపనిషత్తు విస్తరించిన యీ విషయ మిట బెంచదలపు లేదు కాని, ప్రకరణసంగతికై, "ప్రజ్ఞానాత్మ యన్న దాత్మ - అంగి; వైశ్వానర తైజస ప్రాజ్ఞులు మూవురు - నంగములు. నాలుగు మొత్తముగా, నొక ప్రజ్ఞానబ్రహ్మ" అనుకొన్న జాలును.

వైశ్వానరుడీ బ్రహ్మకు బ్రథమ పాదము, తైజసుడు ద్వితీయ పాదము. ప్రాజ్ఞుడు తృతీయపాదము. ప్రజ్ఞాన మన్నది స్వయముగా చతుర్థ పాదము. ఆ శివజ్ఞానమే అద్వైతము, సాక్షాదక్షరము. దాని నుపాసింపవలయును. సరి, చివరి వరకు గేవలమీ యుపోద్ఘాతమునకు గ్రమముగా స్పష్టీకరణమే జరుగును. వైశ్వానర - తైజస - ప్రాజ్ఞ సమష్టిని భోక్తాత్మ యనుకొంటిమిగదా! ఇందు వైశ్వానరు డందరిలో స్థూలుడు. మొదటనే తన్నిరూపణ ముపనిషత్తు చేయుచున్నది.

"జాగరితస్థానః బహిఃప్రజ్ఞః సప్తాంగః ఏకోనవింశతి
ముఖః స్థూలభుక్ వైశ్వనరః ప్రథమః పాదః"

ఇట, వైశ్వానర - తైజస - ప్రాజ్ఞులకు వరుసగా, స్థూలభుక్ - ప్రవివిక్తభుక్, ఆనందభుక్ అని పేరులు, ప్రస్తుత మంత్రమందలి వైశ్వానరుడు స్థూలభుక్కు, బహిః ప్రజ్ఞుడు - జాగరితస్థానుడు, సప్తాంగుడు - ఏకోనవింశతి ముఖుడు; ఇక, తైజసుడు ప్రవివిక్తభుక్కు - అంతః ప్రజ్ఞుడు - స్వప్నస్థానుడు - సప్తాంగుడు - ఏకోనవింశతి ముఖుడు, ఇట్లే, ప్రాజ్ఞు డానందభుక్కు, సుషుప్తస్థానుడు, చేతోముఖుడు - ప్రజ్ఞానఘనుడు.

ఈ యుపనిషత్తునందు, వైశ్వానరుడు జాగ్రదవస్థకు, తైజసుడు స్వప్నావస్థకు, ప్రాజ్ఞుడు సుషుప్త్యవస్థకును, అధిష్టాతలు కాని, వస్తుతః యీ సిద్ధాంతమును - అవును అనియు, గాదనియు, గూడ ననవచ్చును. ఏమి? ఈ విరుద్ధ ధర్మము లిట నెట్లు సంభవములు? ఇందుకు, కఠోపనిషత్తు నందలి యవస్థాత్రయ స్వరూపముం దెలియవలయును. దాని ప్రకారము క్రింద జూపెదము.

మహత్తు - విజ్ఞానము - ప్రజ్ఞానము నను నీ మూటి జాగ్రదవస్థ పేరు జాగ్రదవస్థ. మహద్విజ్ఞానముల జాగ్రదవస్థయు, ప్రజ్ఞాన సుషుప్తియు నన్నది స్వప్నావస్థ. మహత్తు యొక్క జాగ్రతయు, విజ్ఞాన ప్రజ్ఞానముల సుషుప్తియు, నన్నది సుషుప్త్యవస్థ. మహత్తుకూడ సుషుప్తి నొందెనా, అది మృత్యువు.

ఇంద్రియములద్వారా, బాహ్య విషయములను, ప్రజ్ఞానమనస్సు చూచుచుండునది జాగ్రదవస్థ. బాహ్య విషయములు పరమింపగా ప్రజ్ఞాన మంతర్ముఖమై పోవును. కాని, ప్రత్యక్షముగా జూచిన విషయములకు జెందిన భావనా - వాసనా సంస్కారములు దానిపై నంటియుండును. వీనిని విజ్ఞానము చూచుచుండును. కాని మహత్తు నందలి (ప్రజ్ఞానము + విజ్ఞానముతో) లీనమయినపుడు, సుషుప్తి యగును. ఈవిధముగ, ప్రజ్ఞానమునకు మూడవస్థలు కలుగుచున్నవి.

కాగా, బహిరంగవిషయ సంసక్తమయిన ప్రజ్ఞానము జాగ్రదవస్థకును; బాహ్యవిషయ పరాఙ్ముఖమయి విజ్ఞానలీనమయిన ప్రజ్ఞానము స్వప్నావస్థకును; మహదక్ష రూపాత్మ యందు లీనమయిన ప్రజ్ఞానము (సవిజ్ఞానము) సుషుప్త్యవస్థ కును; అధిష్టాత యగును. ఈ సుషుప్త్యవస్థ గూర్చియే "యత్రసుప్తోన కంచన కామంకామయతే" "ఎందు నిద్రించినవాడే కామముంగోరడో" యని చెప్పబడినది. విజ్ఞాన మున్నను, అది తాను జూచు సంస్కారములను దనపై నారోపించుకొని ప్రజ్ఞానమందు మునిగియుండుటచే, విషయములను జూడదు.

ఈ మంత్రమందు మహత్తు - విజ్ఞానము నిత్య జాగ్రతలు. ప్రజ్ఞానము మాత్రము (మనః సర్వేంద్రియాత్మ) మూడవ స్థలనొందును. ప్రజ్ఞానము చాంద్రభాగము. దీనికి క్రింద, మొదట ప్రాజ్ఞుడు, పిదప తైజసుడు, చివర వైశ్వానరుడు, ఈ మూటి మొత్తమే దేవసత్యము - జీవాత్మ. ఇట ఋషి ఈ మూటినే అవస్థాత్రయ యుక్తములను సూచించుచున్నాడు. ఇందుకు గారణము :-

అవస్థాత్రయాధిష్టాతగ బైని జెప్పబడిన ప్రజ్ఞానాత్మ, యోని రూపముగ హృదయమందును, ప్రతిష్టా రూపముగ భ్రూసంధియందును, ఉండుచు, ఆశయరూపమున సర్వాంగ శరీరమందు వ్యాప్తమగుచున్నాడు. "ఆలోమభ్యః అనఖాగ్రేభ్యః " అన్నట్లు రోమ - నఖాగ్రభాగములు గాక, రక్తసంబంధమున్నంత వరకు నాతత్త్వవ్యాప్తి యుండును. కనుకనే, "యావానువైరసః తావానాత్మా," అను వచనము వెలసినది. ఇట్లు సర్వాంగశరీరమందును, ప్రజ్ఞానవ్యాప్తి యున్నది. అనగా రసమున్నంతవరకే; కనుకనే శుష్క స్థానమందును, శూన్యస్థానమందును, వేదనానుభవము లేకున్నది.

శరీరమునందు రసాసృఙ్మాంసమేదోఽస్థిమజ్జా శుక్రములను నేడు ధాతువులు వెలసియున్నవి. ఇవి పార్థివములు. అగ్ని చితివలన నేర్పడినవి. ఇవి యన్నియు. చిత్యగ్ని. ఇది పిండ పృథివీభాగము. ఈ యేడిటియందే గర్భి యున్నది. ఈ గర్భి, త్రివృత్ స్తోమ స్థానీయమగు వైశ్వానరాగ్ని. ఇది చితే నిధేయాగ్ని. సప్త ధాతువులును, అందుండు గర్భియు గలసి, యొక యగ్ని. రెండును తాదాత్మ్యాపన్నములు. ధాతువులు శక్తిమంతములు, గర్భియన్నది శక్తి, శక్తి శక్తిమంతుల కభేదము. కనుకనే, చిత్య చితేనిధేయాగ్నులు రెండును, వైశ్వానరుడని గ్రహింపవచ్చును. ఇది మొదటిదగు స్థూల విభాగము.

విజ్ఞాన పరిభాషయందిదే వాక్కు, భూత ప్రపంచము. అగ్ని రూపమగు నీ యర్థ ప్రపంచమునకు లేదా, వాక్ప్రపంచమునకు లోపల వాయు రూప ప్రాణతత్త్వమున్నది. శరీరము పృథివీపిండము, పృథివి మాత, ఇందంతటను ప్రాణభాగము వ్యాప్తమైయున్నది. కనుకనే ప్రాణరూప వాయువును 'మాతరిశ్వా' యందురు. శరీరావయవ సంచారము

దీనివలననే జరుగుచున్నది. తైజసమగు నీవాయు వేకరూపమయ్యు సప్త ధాతువుల క్రమముంబట్టి యేడు భాగములయినది. ప్రాణాగ్నింబట్టి యిది యైదు భాగములే యన్నను, భూత రూప సప్తావయవ వైశ్వానరుంబట్టి యిదియు సప్తావయవ మనదగును. దీనికి లోపల జ్ఞానశక్త్యధిష్ఠాత ప్రాజ్ఞుడను నింద్రుడున్నాడు. ఇతడు జ్ఞానైకరూపుడు.

ప్రాజ్ఞుడు జ్ఞానమయుడు, తైజసుడు క్రియామయుడు, వైశ్వానరు డర్థమయుడు. ప్రజ్ఞానవ్యాప్తి వైశ్వానరువరకు నుండును. మూవురందును ప్రజ్ఞానమునకు వ్యాప్తి తప్పదు. జ్ఞానగర్భితమగు నర్థము వైశ్వానరుడు. జ్ఞానగర్భిత క్రియ తైజసుడు. క్రియార్థ గర్భితజ్ఞానము ప్రాజ్ఞుడు. ఇక,

భోక్తృత్వమన్నది జ్ఞానమయుడగు ప్రాజ్ఞుని ధర్మమయినను, భోగమందు తైజస వైశ్వానరులు సహకారులు. స్థూల విషయ భోగమునకు, వైశ్వానరుడును, సంస్కార జగద్భోగమునకు తైజసుడును సాధకులు. ప్రాజ్ఞుడు శుద్ధభోక్త, ఇంద్రియముల ద్వారా ప్రజ్ఞానము బయటికిబోయి విషయములతో సంబంధపడునన్నదియే ప్రజ్ఞానము యొక్క స్థూలభోగము. అపుడు ప్రజ్ఞానము వైశ్వానరువరకు వ్యాప్తమై యుండును. వైశ్వానరు సహకారము గొనియే ప్రజ్ఞానము స్థూల పదార్థములను భోగింపగలదు. జాగ్రదవస్థయందు ప్రజ్ఞానము వైశ్వానరువరకు వ్యాప్తమై యుండును. కేవలము వైశ్వానరయుక్త ప్రజ్ఞానమునకే స్థూలభోగత్వము సిద్ధమగుచున్నది.

కాగా, నీ విజ్ఞానము నెదుట బెట్టుకొనియే ఋషి, వైశ్వానరుడు స్థూలభుక్కనియెను. స్థూలభుక్కు వైశ్వానరుడు కాదు, వైశ్వా నరావచ్ఛిన్న ప్రజ్ఞానము. బాహ్యమగు స్థూలజగత్తు నింద్రియముల ద్వారా భోగించు నాత్మ జాగ్రదవస్థాపన్న మందురు. ప్రజ్ఞాన గతాక్షరువంకకు గొంపోవుటయు, నతడు భోగసూన్యుడని సూచించుటయు ఋషికి గావలసినది. కనుక, నతని పేరెత్తక, నిట గేవలము వైశ్వానరుడు స్థూలభుక్కని వచించెను. కాని, యిచట ప్రజ్ఞానము తప్పక యున్నది. లేనిచో భోగమన్నది యసంభవము. ప్రజ్ఞానాంశము వైశ్వానరునందు లేదన్నచో, దాని (వైశ్వానరు) ని బ్రహ్మపాదమని చెప్పడు. 'ప్రథమః

పాదః' అనుటయే యీ విషయమును సిద్ధము సేయుచున్నది. వైశ్వానరునందొక యంశ ప్రజ్ఞానాత్మది యున్నది.

వైశ్వానరాత్మ సప్త చితిరూపము. సప్తధాతువులును సప్త చితులు. అవి యగ్ని రూపములు కనుక "సప్తచితికోఽగ్నిః" యని చెప్పబడినది. ప్రకారాంతరమున, నాలుగాత్మలు, రెండు పక్షములు, పుచ్ఛంప్రతిష్ఠాయని యేడవ యవములు. వీనింబట్టి వైశ్వానరుడు సప్తాంగుడనదగును.

వైశ్వానరావచ్ఛిన్న ప్రజ్ఞానము స్థూలయుక్తము, భోక్త, స్థూలజగమందలి ఘటపటాది పదార్థములు భోగ్యములు. ఇట్లు (5) జ్ఞానేంద్రియములు (5) కర్మేంద్రియములు (5) ప్రాణోదానాదులు మనస్సు - బుద్ధి - చిత్తము - అహంకారము, అను నంతఃకరణ చతుష్టయము మొత్తమీ (19) వస్తుభోగ సాధనములు. జ్ఞానేంద్రియములచే జరుగు స్థూల పదార్థ భోగమువలన, భావనాసంస్కారమును, కర్మేంద్రియములచే జరుగు భోగములవలన వాసనా సంస్కారమును నిల్చును. ఈ సంస్కారములవలననే స్వప్నావస్థ యేర్పడును. దీని వివరణమును ముందరయగలరు. కాని ఇంద్రియాదులు ప్రజ్ఞానమునకు ముఖములు గాని వైశ్వానరునకు గావు, కాని, జాగ్రత యందు వైశ్వానరు సహకారిగాగొని ప్రజ్ఞానమీ 19 టితో, భోగింపగలదు కనుక, నివి వైశ్వానర ముఖములుగ నెంచ బడినవి.

ప్రజ్ఞాభాగము వైశ్వానరయుక్తము కనుక, వైశ్వానరుడు బహిఃప్రజ్ఞుడు. ఏమి? స్థూలపదార్థ విషయమందు, ఇంద్రియద్వారమున, వైశ్వానరయుక్త ప్రజ్ఞ, బహిర్ముఖముగనే యుండును. ఇంతకును నిష్కర్షః- ప్రాజ్ఞాంశయుక్త, సప్త చితిశ ఏకోనవింశతి (19) ముఖబహిఃప్రజ్ఞ, స్థూలభుక్ - వైశ్వానరుడాచతుష్పాద్రహ్మకు బ్రథమపాదము, ఒక యంశ. ఇదే జాగరితస్థానము.

అవస్థ కధిష్ఠాత ప్రజ్ఞానమే. ఈ యవస్థయందు వైశ్వానరుడుండును. అతడు స్వయముగా నవస్థ కధిష్ఠాత కాడు. కనుక 'జాగరితస్థాన' మని చెప్పబడినది. అనగా

స్థానీయుడుగాని, అవస్థాధిష్ఠాత కాడని భావము మరొక విధముగా, వైశ్వానరావచ్ఛిన్న - సప్తాంగ - ఏకోనవింశతిముఖ - బహిఃప్రజ్ఞ - జాగరితస్థాన ప్రజ్ఞానమే, దానికొక పాదమనుకొనవచ్చును. కాని, ఋషి యట్లేల చెప్పడన్నచో, ప్రస్తుతము వచ్చునది ప్రజ్ఞానము నుండి వైశ్వానరువంకకు కాదు, పోవునది వైశ్వానరునుండి ప్రజ్ఞానము వంకకు; స్థూలమునుండి సూక్ష్మము వంకకు బోవుచు కారణము జేరుటకదా కార్యము? ఇది మూడవ మంత్ర వివరణము. ఇక,

వైశ్వానరరూప వాక్ప్రపంచమునకు లోపల ప్రాణరూప తైజసు డున్నాడుగదా! అతడును సప్తాంగుడేకోనవింశతిముఖుడును: ఇటనుండు ప్రజ్ఞానము స్థూల విషయములకు వేరైన, తదీయ సంస్కార మాత్రము. స్థూలవిషయములు తొలగగా, వానికంటె వేరైన సంస్కారపుంజమే 'ప్రవివిక్త' భాగము, ప్రజ్ఞానము బాహ్య విషయములను వీడుటతో, వైశ్వానర సహకారము నూడిపోవును. పోగా తైజసుంజేరును. అప్పటి ప్రజ్ఞాన మంతర్ముఖము, అట దైజస సహకారమున, నేకోనవింశతి ముఖమై, తైజసావచ్ఛిన్నమగునది, యా సంస్కార రూప ప్రవివిక్త భాగముం భోగించును.

తైజసుడు వాయువు; వాయువునందు గతి యున్నది. వాయవ్య భాగము ప్రవృద్ధమగుచో చిత్ర విచిత్ర స్వప్నములు వచ్చుచుండును. వాత ప్రకృతి గలవారికి స్వప్నము లెక్కువ. వాయు వ్యాపారము కనుక అవచ్ఛిన సంస్కారములందు, కఠోపనిషత్తునందు చెప్పియున్న విధముగా, అసంబద్ధత యుండును. ప్రజ్ఞానావచ్ఛిన్న తైజస ప్రాజ్ఞుని యంతర్ముఖతంబట్టి స్వయముగా నంతర్ముఖుడు. భోగసాధనములు 19యు నిటనుండును. అవి లేనిచో భోగమసంభవము కదా! ఈ తైజసుడు స్వప్నస్థానీయుడు. ఈ ప్రజ్ఞానము బ్రహ్మకు రెండవ పాదము. ఈ క్రింది నాల్గవమంత్రమున కిది వివరణము.

"స్వప్నస్థానోఽన్తః ప్రజ్ఞః సప్తాంగః ఏకోనవింశతి
ముఖః ప్రవివిక్తభుక్, తైజసః - ద్వితీయః పాదః"

తైజసునకు బైని ప్రాజ్ఞరూపు డింద్రుడున్నాడు. ఇతని కాశ్రితము ప్రజ్ఞానము. ప్రాజ్ఞుడు ప్రజ్ఞానమునకు దగ్గరివాడు. ప్రజ్ఞానము చిద్ఘనము. తదీయ ప్రథమ సంబంధము ప్రాజ్ఞుడగు నింద్రునితో కల్గును. కనుకనే, "సహీనేదిష్ఠం పస్పర్శ సహి ప్రథమం విదాంచాకార" యని కేనోపనిషత్తన్నది. ప్రజ్ఞాన చిదంశ మొదట ప్రాజ్ఞునందు వెలయును. తద్ద్వారా తైజసునందు, తద్ద్వారా వైశ్వానరునందు వెలయును. కేనోపనిషత్తు నందలి అగ్ని - వాయు - ఇంద్రులు వీరే. అచట :-

"అగ్ని - వాయువులా మహాయక్షము నెరుంగజాలవయ్యె, ఇంద్రు డరుగగనే యది యదృశ్యమయ్యె" నని చెప్పబడినది. అనగా, క్రియారూప తైజసుడు అర్థరూప వైశ్వానరుడు, జ్ఞానమునకు విజాతీయులు. జ్ఞాన ప్రధానమగు ప్రాజ్ఞ భాగము సజాతీయము. కాగా, నాయంశ జ్ఞాన మాజ్ఞాన ఘన మందు లీనమయిపోయెను. శుద్ధప్రజ్ఞ ప్రజ్ఞానమందు లీనమగును కనుక, ప్రాజ్ఞభాగము ప్రజ్ఞాన ఘనమయిపోవును, అని తాత్పర్యము.

తైజసునందు వ్యాపారమున్నది. అతడుండువరకు స్వప్న దర్శన రూప వ్యాపారముండును. అతనికంటె వేరై, ప్రజ్ఞానము శుద్ధ ప్రాజ్ఞయుక్తమగునపుడు, సర్వ వ్యాపారములు నుపరమించును. అట ప్రజ్ఞాన - ప్రాజ్ఞభేద మంతరించు చుండును. రెండును, ఆ మహదక్షరమందు లీనములగును. ఇదే సుషుప్త్యవస్థ. అపుడు సర్వేంద్రియ భాగములు నదృశ్యములగును, కేవలచిన్మాత్ర మవశిష్టముగ నుండును.

ప్రాజ్ఞావచ్ఛిన్న ప్రజ్ఞానము సంస్కారములనుండియు వేరైపోగా, కామన నివృత్తి నొందును. అది అంతః ప్రజ్ఞము కాదు. బహిఃప్రజ్ఞమును గాదు. కేవల ప్రజ్ఞానఘనము. ఆనందమయము. ఆనందయుక్తము.

అవ్యయునకు, ఆనంద - విజ్ఞాన - మనః - ప్రాణ - వాక్కులని పంచకోశములు. ఇందు 'మనస్సు' ప్రజ్ఞారూపమున వికసిల్లును. ఇదే భోక్త. ప్రజ్ఞానము ప్రాజ్ఞ - తైజస - వైశ్వానర రూపమున బరిణితమై క్రమముగ, వాక్ - ప్రాణ - ఆనందములను భోగించును. వాక్కు అన్నమయ కోశము, దీని వికాసమే స్థూలజగత్తు, తన వైశ్వానర భాగముచే ప్రజ్ఞానము

స్థూలమును భోగించును. అన్నములోపల బ్రాణముండును. సంస్కార జగత్తు ప్రాణరూపము. ఇది ప్రాణమయ కోశము యొక్క వికాసము. అన్నము కంటె వేరగుటచే నీ ప్రాణరూప సంస్కార జగత్తు ప్రవివిక్తము. ప్రజ్ఞానము తన తైజస భాగముతో దానిని భోగించును. ఇక మూడవది మనోమయ కోశము. స్వయంభోక్తయగు ప్రజ్ఞానమే దీని వికాసము. మనసునకు బిదప విజ్ఞానమయ కోశమున్నది. విజ్ఞానము భోగమునకు సాధనము. కాగా, మిగిలిన దానందము. చేతోముఖ ప్రాజ్ఞభాగమున నది దీనిం భోగించును. భోగత్రయముంబట్టి మూడవస్థలు కల్గును. ఇందలి మూడవ (ఆనంద) అవస్థను నిరూపించుచు ఋషి, ఈ <u>యైదవ మంత్రము</u> నెదుట బెట్టుచున్నాడు:-

"యతః సుప్తోన కంచన కామం కామయతే, నకంచన
స్వప్నంపశ్యతి, తత్ సుషుప్తమ్, సుషుప్తస్థానఏకీ
భూతః, ప్రజ్ఞానఘన ఏవానందమయో, ఆనందభుక్,
చేతోముఖః - ప్రాజ్ఞః - తృతీయః పాదః"

వైశ్వానర - తైజస - ప్రాజ్ఞులే అధిదైవతమందు, (ఈశ్వర శరీరమందు) వైశ్వానర - హిరణ్యగర్భ - సర్వజ్ఞులని పిలువబడుదురు. ఇందు ప్రధానుడు సర్వజ్ఞుడు = ఇంద్రుడు. విశ్వమూల మితడే, సర్వ భూతాధిపతి యితడే. ప్రభవ - ప్రతిష్ఠ - పరాయణుడితడే. "వాగింద్రః" అనుటచే వాక్కు పేరే యింద్రుడు. స్వయంభూ వాక్కు ఇంద్రవాక్కు. దాని నుండియే విశ్వము వెలసినది. కనుకనే "నేంద్రా దృతేపవతే ధామకించన" అని శ్రుతి చెప్పినది. దానిం బట్టియే, "అథోవాగే వేదం సర్వమ్" అను వచనము వెలసినది.

వాక్కన్నది యింద్రాక్షరము. బ్రహ్మకు క్షరపురుషునితోడను, విష్ణువునకవ్యయ పురుషునితోడను, సంబంధము. మధ్యవాడగు నింద్రాక్షరుడన్నచో, బ్రహ్మ విష్ణువులను, రెండక్షరులను గ్రహించినట్లై యగును. అక్షరత్రయ మొక యక్షరము. వాక్కన్నదొక యింద్రాక్షరము. అక్షరమన్నచో, బ్రహ్మ విష్ణు ఇంద్రులను మూడక్షరములు. ఈ విజ్ఞానముంగొనియే "వాగిత్యేక మక్షరమ్" "అక్షర మితిత్ర్యక్షరమ్" అని చెప్పబడినది.

పిండ నిర్మాణ మగ్నీషోములవలన నగును. హృదయమందుండి యా పిండ సంచాలన మొనర్చుట యక్షర కార్యము. కనుకనే యధర్వాక బంధుడు, "అంతస్తిష్ఠన్ నియమయతి సర్వాన్ " అను వ్యుత్పత్తింబట్టి ఈ యింద్ర ప్రధానాక్షరుని 'అంతర్యామి' అనియెను. ఈశ్వరునిదగు నీ <u>సర్వాంశమే</u> జీవజగత్తునం బ్రవిష్టమై ప్రాజ్ఞుడనిపించు కొనుచున్నది. అవిద్యాది దోషములచే నిది తన సర్వజ్ఞరూపమును మఱచినది; కాగా, ఋషి హెచ్చరించుచు, "నీవు సాధారణుడనుకొన్న ప్రాజ్ఞుడు సర్వజ్ఞాంశ భూతడగుటచే సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు - అంతర్యామి - సర్వమునకు ప్రభవ - ప్రతిష్టా - పరాయణము సుమీ! ఆ సమీపస్థుని గుర్తింపుము. నీకు గల్యాణమిదే, అధ్యాత్మముగ బ్రాజ్ఞుడే సర్వేశ్వరుడు. శరీర భూత ప్రపంచయోని యితడే. క్రియార్థములీ జ్ఞానశక్తిపై ప్రతిష్ఠితములై యున్నవి. వస్తుతః ఉన్నది ప్రజ్ఞానఘనమగు చిదాత్మపైనను, భూతాదితో తత్సంబంధము ప్రాజ్ఞుని ద్వారానే కల్గును. అతడే భూత సంపరిష్వక్తుడగును. కనుకనే, వీనికంటె నితడే 'సర్వేసర్వా' యందుము. ఈ విజ్ఞానమును గుఱిగా జేసుకొని, ఋషి యనుచున్నాడు:-

ఏష సర్వేశ్వరః - ఏషసర్వజ్ఞః - ఏషోఽన్తర్యామీ,
ఏషయోనిః సర్వస్య ప్రభవాప్యయౌహి భూతానాం" (6)

ఇక నేడవ మంత్రము వంకకు మరలుదము:-

"నాంతః ప్రజ్ఞంనబహిః ప్రజ్ఞంనోభయతః ప్రజ్ఞం ప్రజ్ఞానఘనం,
నప్రజ్ఞాంనాఽప్రజ్ఞం అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్యమలక్షణ
మచింత్య మవ్యపదేశ్య మేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం
శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే సఆత్మా సవిజ్ఞేయః॥

(1) అవ్యక్తము - (2) మహత్తు (3) విజ్ఞానము (4) ప్రజ్ఞానము అను నాల్గు నొక విభాగము. ప్రాజ్ఞ - వైశ్వానర - తైజస - శరీరములు నాల్గు నొక విభాగము. ఈ రెంటి మొత్తము విశ్వ - అధ్యాత్మ జగత్తు. ఇందమృతాత్మ ప్రవిష్టమగును.

అవ్యక్తము బ్రహ్మ; మహత్తు సుబ్రహ్మ; ఈ రెండు నవినాభూతములు. ఈ రెంటి మొత్తము శుక్రము. మహత్తన్నచో, నవ్యక్త + మహత్తులు రెంటికిని గ్రహణము. మొట్టమొదట నాత్మ ప్రతిబింబము, (అనగా, ఉపనిషత్పరి భాషలో మన 'మక్షర' మనునది) మహత్తుపై బడును; మహదక్షర మాత్మ. అటనుండి యక్షరము విజ్ఞానముపై బడును. విజ్ఞానము ద్వారా ప్రజ్ఞా సంపరిష్వక్త ప్రజ్ఞానముపై బడును. ప్రజ్ఞానము ద్వారా, ప్రాజ్ఞ - తైజస - వైశ్వానరులపై బడును. ఇది చిత్తము యొక్క క్రమావతరణము.

ఇచట ఋషి ప్రజ్ఞాన గతాక్షర తత్త్వ స్వరూప పరిచయముం గల్గించుచున్నాడు. ఇట బ్రహ్మ యనగా, ప్రజ్ఞాన గతాక్షర తత్త్వమని భావము. ఈ ప్రజ్ఞాన బ్రహ్మ స్వయముగా భోగ భావశూన్యము దీని, వైశ్వానర - తైజస - ప్రాజ్ఞులను మూడు కళలే భోగించుచున్నవి. ఇది సర్వథా నిష్కలము, నిరంజనము. మూడు భాగములందు నిదే యంశ రూపమున బ్రవేశించె గనుకనే యని దీనికి బాదములయ్యెను. నాల్గవది ఘనరూప మది తానే. దాని నిరూపణ పిదప జూతము.

ప్రస్తుతము వైశ్వానరావచ్ఛిన్నమగు ప్రజ్ఞానము స్థూలభుక్కు. తైజసావచ్ఛిన్నమగు నదే ప్రవివిక్తభుక్కు. ప్రాజ్ఞావచ్ఛిన్న సర్వజ్ఞభాగ మానందభుక్కు. కాగా, నా ఘనమన్నది మూటికంటె వేరుగనున్నది. శుద్ధము, అక్షరరూపము - అదే మూలవస్తువు. దాని మహిమవలననే వైశ్వానర తైజస ప్రాజ్ఞులు మూవురు నంతటను తమ సామ్రాజ్యముల నేర్పరచుకొన్నారు.

ప్రాజ్ఞునకు బైనున్న ప్రజ్ఞాన బ్రహ్మయే తురీయము. దాని నిరూపించు ఋషి "అది యంతఃప్రజ్ఞము కాదు. బహిః ప్రజ్ఞము కాదు. ఉభయతః ప్రజ్ఞము గాదు, ప్రజ్ఞానఘనము గాదు, ప్రజ్ఞయు గాదు, అప్రజ్ఞయు గాదు. అదృష్టము - అవ్యవహార్యము - అగ్రాహ్యము - అలక్షణము - అచింత్యము - అవ్యపదేశ్యము - ఏకాత్మ ప్రత్యయ సారము - ప్రపంచోపశమము - శాంతము, అని విద్వాంసులు తురీయపదము నెఱుంగుదు రాయాత్మయే విజ్ఞేయ" మనియెను.

వైశ్వానరాది త్రయము జాగ్రదాది త్రయమున కధిష్ఠాతలుగారు స్థానీయులు మాత్రమే. అవస్థాత్రయాధిష్ఠాత ప్రజ్ఞానమే. దానికి స్థూలజగత్తు - వైశ్వానరుడు గూడగా జాగ్రదవస్థ. ఆ రెండును లేకున్న నాయవస్థయే లేదు, బాహ్య పదార్థములు వైశ్వానర రూపములు. సజాతీయత వలన, వీని సంబంధము మొదట వైశ్వానరునితో కలుగును, తద్ద్వారా ప్రజ్ఞానము వానిని భోగింపగలదు. అన్ని విషయములను వీడి యది యంతర్ముఖమగుచో బాహ్య స్థూల జగత్సంబంధము వీడగా, ప్రవివిక్తమగును, కాగా, దానికి గలిగిన సంస్కార ప్రపంచమును ప్రవివిక్తమగును. అప్పుడు స్థూల వైశ్వానరాపేక్ష యుండదు. ఏమి? స్థూలభోగము లక్కర లేదుగదా!

ప్రవివిక్త విషయములు సూక్ష్మముల, ప్రాణ రూపములు. అటు తైజసుడును ప్రాణరూపుడు. సజాతీయతం బట్టి ప్రవివిక్త సంబంధము తైజసునిచే నగును. అపుడా భోగములను ప్రజ్ఞాన మనుభవింపగలదు. ఇక, నటనుండి కూడ దొలగి, యది మహదక్షరముం జేరెనా, తైజసునితో బనియు లేదు. అపుడు జ్ఞానమయ ప్రాజ్ఞభాగము మాత్రము సజాతీయతవలన, ప్రజ్ఞానమందుండును. అయవస్థయందు ప్రాజ్ఞ ప్రజ్ఞానద్వేషము పోవును.

ప్రజ్ఞానమందు మునిగిన, ప్రాజ్ఞుడు ప్రజ్ఞానఘనుడే; కాని, ఎప్పుడు ? ప్రజ్ఞానము మహదక్షర మగ్నమై సుషుప్త్యవస్థంబడినపుడు. అది లేనంత వరకు తైజస వైశ్వానర సంయోగమే. కాగా, నా యవస్థలందు జ్ఞానమునకు విజాతీయములగు క్రియార్థముల మధ్య పతితుడగుటచే నతని ప్రజ్ఞానముతో నేకీభావము కుదరజాలదు. ఆ రెంటిని విడచి వేర్పడెనా, అతడు స్వస్వరూప శుద్ధుడే. అపుడు, “యథోదకం శుద్దే శుద్ధ మాసిక్తంతాదృగేవభవతి” యన్నట్లు శుద్ధ జ్ఞానరూపుడగు నా ప్రాజ్ఞుడు, శుద్ధ ప్రజ్ఞానమందేకీ భావము నొంది; తాను ప్రజ్ఞాన ఘనుడగును. ఈ స్థితి సుషుప్తియందు మాత్రమే. కనుకనే, ప్రజ్ఞానఘనైకీ భూత ప్రాజ్ఞుంగూర్చి సుషుప్తి స్థానము చెప్పబడినది. అపుడు జ్ఞానమగు చిత్తునకు, విజాతీయాన్యవస్తు సంపర్క ముండదు కనుక అప్పటి ప్రజ్ఞాన ప్రాజ్ఞుడు ‘చేతోముఖుడు’ అని వాకొనబడినది.

వైశ్వానరాదిత్రయము భోక్తాత్మ. ప్రజ్ఞానమన్నది బ్రహ్మ సత్యము యొక్క యవయవము; ప్రజ్ఞాన మనస్సు - ఇంద్రియములు లేనిచో భోగ మసంభవము. కనుక మనస్సు, ఇంద్రియములును భోక్తాత్మరూప దేవసత్యము నందంతార్భావములుగ జేసికొనబడును. ఈ యభిప్రాయము తోడనే ''ఆత్మేంద్రియ మనోయుక్త భోక్తేత్యాహుర్మణీషిణః'' అని చెప్పబడినది.

ప్రజ్ఞానము స్వతంత్రము, మాటవరుసకు - ''ప్రజ్ఞానమే అవస్థాత్రయమందు పరిణతమై వరుసగ బహిః ప్రజ్ఞ - అంతః ప్రజ్ఞ - ప్రజ్ఞానఘనమై; స్థూల - ప్రవివిక్త - ఆనంద - భుక్క గునందుము. కాని, వస్తుతః - సర్వ ధర్మములును భోక్తాత్మ రూప దేవసత్యమునకు జెందినవి. (1) ప్రాజ్ఞ తైజస గర్భితార్థ ప్రధాన వైశ్వానర భాగము స్థూలభుక్కు (2) వైశ్వానర ప్రాజ్ఞ గర్భిత క్రియాప్రధాన తైజసభాగము ప్రవివిక్త భుక్కు (3) వైశ్వానర తైజస గర్భిత జ్ఞాన ప్రధాన ప్రజ్ఞానఘన ప్రాజ్ఞభాగ మానందభుక్కు. ఈ మూడు నా ప్రజ్ఞాన బ్రహ్మకు మూడు పాదములు. నాల్గవది స్వయముగా బ్రజ్ఞాన బ్రహ్మ. అది యుపద్రష్ట; విజ్ఞానమును ద్రష్ట యందురు. ప్రజ్ఞాన ముపద్రష్ట - అనుమంత - భర్త - మహేశ్వరుడును. ప్రజ్ఞాన విజ్ఞానము లవినాభూతములు. ఈ రెండును మహదక్షరావినాభూతములు. కాగా, నీ స్థితిలో, విజ్ఞాన సంపరిష్వక్త మహదక్షరయుక్త ప్రజ్ఞానమునే 'తురీయ' మందుము. ఈ యేడవమంత్ర మక్షరుని లక్ష్యముగా గొని - ఈ తురీయ ప్రజ్ఞానము నక్షరుగా నిరూపించుచున్నది. వర్ణన సేయుట ప్రజ్ఞానమును, లక్ష్య మక్షరుని గుఱించి.

ప్రాజ్ఞుడు వైశ్వానరావచ్ఛిన్నుడగుచో బహిఃప్రజ్ఞుడు, తైజసావచ్ఛిన్నుడగుచో, నంతః ప్రజ్ఞుడు గదా! ఈ స్థితిలో ఉభయధావచ్ఛిన్నుడగుచు, నుభయప్రజ్ఞుడనదగును. అతడే, శుద్ధ రూపమునొంది ప్రజ్ఞానమగ్నుడై ప్రజ్ఞానఘనుడై పోవును. ఈవిధముగ నతడు, అంతః ప్రజ్ఞుడు - బహిః ప్రజ్ఞుడు - ఉభయ ప్రజ్ఞుడు - ప్రజ్ఞానఘనుడు నగును.

ఇంతకు వేరుగ ప్రజ్ఞానాత్మ యున్నది. దానికి భోగముతో నేమియు సంబంధము లేదు. అది యేభుక్కును కాదు. వైశ్వానరునకు వేరు కనుక బహిఃప్రజ్ఞము కాదు, తైజసభిన్నము కనుక నంతః ప్రజ్ఞము కాదు. రెంటికి భిన్నము కనుక నుభయ ప్రజ్ఞము కాదు. స్వయం ప్రజ్ఞాన రూపము. ప్రజ్ఞానమందు ప్రజ్ఞానముండదు (తద్భావే తదభావః) కనుక అప్రజ్ఞము. ప్రజ్ఞానము స్వయముగ ప్రజ్ఞాన ఘనముగదా దానియందది యెట్లు? కనుక నది ప్రజ్ఞానఘనముంగాదు.

ప్రాజ్ఞుడన్నది యంశ; అదియెా ప్రాజ్ఞున కతిరిక్తము కనుక దానిం బ్రాజ్ఞుడనజాలము. కాని, ప్రజ్ఞానగత చైతన్యమే ప్రాజ్ఞుని ప్రాజ్ఞుం జేసినది. ప్రాజ్ఞునందలి 'జ్ఞ' తొలగుచో, నతని ప్రాజ్ఞతయే యుండదు. ఈ స్థితిలో దాని ప్రాజ్ఞతిరిక్తమనియు ననజాలము. ఆహో! శ్రుతి శబ్దముల చమత్కారము! 'ప్రాజ్ఞమ్' అనక 'నఅప్రజ్ఞమ్' అన్నది. వాస్తవముగ, నది ప్రాజ్ఞాతిరిక్తము. కనుక, 'ప్రజ్ఞమ్' అనరాదు. ఇక ప్రాజ్ఞు ప్రాజ్ఞత్వమన్ననో అదే ఈ భావము ప్రకటించు శబ్దమేది? 'నాప్రజ్ఞమ్' ఇంతకు మించిన వాక్య ముండగలదా?

నాంతఃప్రజ్ఞం మొదలుగ నా ప్రజ్ఞం వరకు గల మంత్ర పూర్వార్ధ భాగము ప్రజ్ఞానమును నిరూపించు చున్నది. ప్రజ్ఞానమందు ప్రజ్ఞానము - అక్షరము నను రెండు వస్తువులున్నవి. కనుక ఋషి. ఈ యేడవ మంత్రమును రెండుగా భాగించి, మొదటి చిన్న వాక్యముచే అక్షరు నపేక్షించి లఘు ప్రజ్ఞానమును నిరూపించుచు; 'అదృష్ట' మన్నది మొదలుగ దరువాతి మహావాక్యముచే మహదక్షరమును నిరూపణ సేయుచున్నాడు.

ప్రజ్ఞానమునకు బిదప గ్రమముగ, విజ్ఞానము - మహత్తు - అవ్యక్తము - ఆత్మక్షరము - అక్షరము - అవ్యయము అను నిన్ని భాగములున్నవి. ఇన్నిటిలో విజ్ఞానమునకు, "సోయం విజ్ఞానాత్మా ప్రాజ్ఞే నాత్మనా సంపరిష్వక్తః" అన్నట్లు ప్రజ్ఞానమందే అంతర్భావము. కాగా, విజ్ఞానమునకు:- అమృతము - మర్త్యము నని రెండు భాగములు. ప్రజ్ఞానమందు మర్త్యవిజ్ఞానమునకును, మహత్తు నందు అమృత విజ్ఞానమునకును అంతర్భావములు. కాగా నీ విధముగ:-

అవ్యయాక్షరాత్మక్షరావ్యక్తములును, విజ్ఞానగర్భితమును, (కనుకనే) త్రిగుణ భావాపన్నమునగు మహత్తును మిగులును. అక్షరుని వ్యాప్తి మహత్తు వరకును, కనుక, 'మహద్బ్రహ్మైక మక్షరమ్' 'బహు బ్రహ్మైక మక్షరమ్' అని చెప్పబడినది. ఇదే కరుని 'పరార్ధ్య' భాగము. క్రిందిదపరార్ధ్య భాగము. ఇందు మొదటిదక్షర ప్రధానమగుటచే నమృతము. రెండవది క్షర ప్రధానము కనుక మర్త్యము. పూర్వ మంత్రము అవరార్ధ్యమును, 'అదృష్ట' మిత్యాది గాగల యుత్తర మంత్రము పరార్ధ్యమును, (అక్షర ప్రధానతో) నిరూపించుచున్నది.

పరాపరబ్రహ్మ చిత్రగతనిరూపణ మిటనరయదగును:-

అవ్యయ - అవ్యయ
అక్షర - అక్షర
ఆత్మక్షర - ఆత్మక్షర
} అమృతమ్

అవ్యక్త - స్వయంభూ
మహత్ - పరమేష్ఠి
అమృతవిజ్ఞానము - అమృతసూర్య
మర్త్యవిజ్ఞానము - మర్త్యసూర్య
ప్రజ్ఞానము - చంద్రుడు
ప్రాజ్ఞ - సర్వజ్ఞ
తైజస - హిరణ్యగర్భ
వైశ్వానర - వైశ్వానర
} బ్రహ్మసత్యమ్ దేవసత్యమ్

శరీరము - పృధివీ - ప్రతిష్ఠా
అధ్యాత్మము - అధిదైవతము

అవరార్ధ్యము - అవరబ్రహ్మ - పరార్ధ్యము - పరబ్రహ్మ

ఏతద్వై సత్యకామః పరంచాపరంచ బ్రహ్మ యదోంకారః

అదృష్టం - అవ్యవహార్యం - అగ్రాహ్యం - అలక్షణం - అచింత్యం - అవ్యపదేశ్యం - అను విశేషణములు, పరబ్రహ్మకు జెందిన అక్షరభాగమును, 'ఏకాత్మ ప్రత్యయసార' మన్నది అవ్యయుని, 'ప్రపంచోపశమ' మన్నది ఆత్మ క్షరమును, 'శాంత' మన్నది అవ్యయాత్మను, 'శివ' మన్నది మహత్తును, 'అద్వైతమ్' అన్నది ఏక దృష్టితో నభేదమును, నిరూపించుచున్నవి.

ఆ యక్షరుడు చూడనైతిగాని వాడు, కంటి కగ్రాహ్యమగునదే అదృష్టము, ముండకమిట 'అద్రేశ్య' మనియెను; వాక్ప్రాణ చక్షుశ్రోత్ర మనస్సులను బాహ్య కరణములకు చక్షువుపలక్షణము. ఆయక్షరుడు బాహ్యకరణ శూన్యుడు. జ్ఞాన - కర్మలకు జెందిన మన బహిరింద్రియములు అచటికి బోజాలవు. ఇంద్రియగమనము స్వప్నావస్థవరకే. స్వప్నమునకు బరమున సుషుప్తి, దానికి పరముగ బ్రజ్ఞానము, అందు బ్రతిష్ఠితమైయున్న తురీయమగు నక్షరము నింద్రియములు చేరగలవా? అగ్రాహ్యమది. అనగా, మనోబుద్ధి చిత్తాహంకారములను నాలు గంతఃకరణములును లేనిది. మనస్సు ప్రజ్ఞానము, బుద్ధి విజ్ఞానము, చిత్తము సత్యము, అహంకారము మహత్తు. అక్షరము వీని కన్నిటికి బాహ్యుడు. అగోత్రమ్ = నిశ్శబ్దము, అనిర్వచనీయము, స్వయముగా అలక్షణము. అనగా స్వయముగా జ్ఞానకర్మేంద్రియ వికలము. అట క్రిందియములు పోవు. దానికింద్రియములు లేవు. ముండక మందలి 'అగోత్రము' అనుదానికిట 'అవ్యవహార్య' మని ప్రయోగము.

అవ్యయము నిత్యము, విభువు, సర్వగతము, సుసూక్ష్మము, కనుక నచింత్యము. అవ్యపదేశ్యమును, అసీమ భావ మట్టిదే యగుగదా! 'అవిభక్తం విభక్తేషు' అన్నట్లు మహదాది సర్వ ఖండాత్మలందు నది యేక రూపమున వ్యాపించినది.

స్వయంభువు - పరమేష్ఠి - సూర్యుడు - చంద్రుడు - పృధివి. అను నీ మొత్తమే ప్రపంచము. దీని కుపాదాన మాత్మక్షరము. ఇందే అయిదు నుత్పత్తి లయము లొందును. కనుక నాత్మ క్షరమును 'ప్రపంచోపశమ' మందుము. ముండకమిట 'భూతయోనిమ్' అన్నది.

అవ్యక్త = స్వయంభువు శాంతము. కనుకనే, "యచ్ఛేద్వాఙ్మనసీ" యనుచో "తద్యచ్ఛేచ్ఛాంత ఆత్మని" అని చెప్పబడినది. స్వయంభువు సత్యము. ఆరు రజస్సుల = లోకములకంటె వేరైనది. ఆ యారు లోకములును చలములు నచలనములును. వాని కధిష్ఠాత యగు నీ సత్య స్వయంభువు శాంతము.

మహత్తు శివము. రోదసీ ప్రాణ మాగ్నేయమగుటచే రుద్రమనబడునట్లు, పారమేష్ఠ్య ప్రాణము సోమమయ మగుట వలన, 'సాంబసదాశివ' నాబరగును. పారమేష్ఠ్య భాగమే మహత్తు. కనుక దీనిని శివమందుము. ఈ మహద్భావముంగొనియే, శివరూప మహదాత్మను 'మహాదేవు' డందురు. ఈ మహత్తునకు, విజ్ఞానమందును, ప్రజ్ఞానమందును వ్యాప్తి గలదు. ప్రజ్ఞాన గతాక్షరునకును బ్రతిష్ఠ యీ మహత్సోమమే, విజ్ఞాన గతాక్షరునకు బ్రతిష్ఠ యీ మహత్సోమమే ఏమియన:- మహత్తు లేనిచో చిత్తము ప్రతిష్ఠితము కాజాలదు. సరియే, కాని,

ఆ యీ యవ్యయాక్షర క్షరావ్యక్త మహదిత్యాది భేదములం జూచి. యెవరేని యివి యనేకాత్మలనుకొందు రేమోయని, 'అద్వైతమ్' అని చెప్పబడినది. వీనియందెల్ల నున్న దమృతరూపమున నొక తత్త్వమే. దాని భావమనేకము గాని సత్త యొకటే కనుక 'ఏకాత్మ ప్రత్యయసారము' కాగా, అద్వైత స్వరూపమున కేమియు బాధ లేదు.

అవ్యయాక్షరాత్మ క్షరశాంత శివములన్నియు గలసి యొక యాత్మ. ఇది తురీయము. శ్రుతియందలి 'తురీయ' శబ్దమందు నెంతో రహస్యమున్నది. వైశ్వానరాదిత్రయము ప్రజ్ఞాన బ్రహ్మయొక్క మూడు పాదములు. నాల్గవది స్వయముగా బ్రజ్ఞానాక్షరము. ప్రధాన లక్ష్యము దానియందే, కనుకను తురీయమనియెను. ఇట్లే

సృష్టి ధారాక్రమమునందు, అవ్యయాక్షరాత్మక్షర శాంత గర్భిత మహత్తు అను నీక్రమమునకు మహత్తు నాల్గవదగును. కాగా, మహదక్షరము తురీయమగును గదా; మరియును,

వైశ్వానరుడు పృధివీవస్తువు, తైజసు డంతరీక్ష్య వస్తువు, ప్రాజ్ఞుడు ద్యులోకవస్తువు "అస్థివై చతుర్థో దేవలోక ఆపః" అనుటచే, నాల్గవది పారమేష్ఠ్య లోకము. ఇదే మహత్తు ఈ లోకవ్యవస్థంబట్టియు, మహదక్షరము తురీయమగుచున్నది. ఇంకను :-

జాగ్రదాది యవస్థాత్రయముకంటె నా యక్షరావస్థ నాల్గవది కనుక నీ వ్యవస్థంబట్టియు, మహదక్షరము తురీయమగుచున్నది. వెండియు,

మర్త్యభాగము మూడవయవములు గలది, అమృతాక్షర మొకటి యగుటవలన నీయమృత మర్త్యాపేక్షం బట్టియు నమృతాక్షరము తురీయమే. కాగా, శ్రుతియందలి తురీయ శబ్ద మేవిధముగనైనను సార్థకమే యగుచున్నది. ఆ యీ విషయములన్నియు నీ క్రింది తాళికవలన సుస్పష్టములు కాగలవు. ముండకానుసార విశేషణములును, మాండూక్యమందలి "అదృష్టమ్" అను దానియసారము నరయదగు.

(1) అద్రేశ్యం = కంటికి (వాక్ప్రాణ చక్షుశ్శోత్ర మనస్సుల కతీతము, బాహ్య కరణ శూన్యము)

(2) అగోత్రం = అవ్యవహార్యము, అనిర్వచనీయమ్, భూత మాత్రా శూన్యము.

(3) అగ్రాహ్యం = అగ్రాహ్యం = అంతఃకరణ చతుష్టయ శూన్యం

(4) అచక్షుః శ్రోత్ర మపాణిపాదం = అలక్షణం (నిర్ధర్మకం, జ్ఞానకర్మేంద్రియ వికలమ్ ప్రజ్ఞా ప్రాణ మాత్రాశూన్యం)

(5) సూక్ష్మం - నిత్యం = అచింత్యం నిత్యత్వ - విభుత్వ - సర్వగతత్వ సుసూక్ష్మత్వాదిమత్వమున నవిజ్ఞేయము, మనసాతీతము.

(6) విభుం = అన్యపదేశ్యం = అనిర్వచనీయం

(7) సర్వగతం = ఏకాత్మ ప్రత్యయసారమ్, విభుధర్మముచే ఖండాత్మ ప్రపంచమందవిభక్త రూపముచే వ్యాప్తుడు.

(8) భూతయోనిం = ప్రపంచోపశమం = స్వయంభ్వాది పంచక ప్రభవ ప్రతిష్ఠా పరాయణం

(9) శాంతం = భూరాదిలోక షట్కాతీత మగుటవలన శాంతము

(10) శివమ్ = పరామేష్ఠ్య సోమ సంబంధముచే శివరూపము.

<u>ఆత్మలను బట్టి వర్గీకరణము</u>

(1) అదృష్టం } ఇంద్రియాతీతము

(2) అగ్రాహ్యం

(3) అవ్యవహార్యం = అనిర్వచనీయం

(4) అలక్షణం = ఇంద్రియరహితము - నిర్ధర్మకము

(1) 'ఏతాదృశ మక్షరమ్

(1) అక్షరాత్మా

(5) అచింత్యం = అవిజ్ఞేయము

(6) అవ్యపదేశ్యం = అనిర్వచనీయం

(7) ఏకాత్మ ప్రత్యయసారము = వ్యాపకము

(2) ఏదాదృశ మవ్యయం

(2) అవ్యయాత్మా

(8) ప్రపంచోపశమం = విశ్వ ప్రభవ ప్రతిష్ఠాపరాయణం

(3) ఏతాదృశ మాత్మక్షరం

(3) క్షరాత్మా

(9) శాంతం = సత్య ధర్మముచే క్షోభరహితము

(4) ఏతాదృశమవ్యక్తం

(4) శాంతాత్మా

(10) శివం = సోమ సంబంధముచే జీవనమూలము

(5) ఏతా దృశమహదక్షరం

(5) మహదాత్మా

పై వివరణ మందవ్యయాక్షర క్రమమందు వ్యత్యాసమగపడుచున్నది. అవ్యయ - అక్షర - క్షర - శాంత - శివ యన్నది క్రమము. కాని, యిట ఋషి అక్షర - అవ్యయ - క్షర - శాంత - శివ యను క్రమ మేర్పరచెను. కారణము ?

ఈ వివరణమున కంతకు మూలకారణ మక్షరుడే అతడు లేనిచో, జ్ఞానమయుడగుట నవికుర్వాణుడగు నవ్యయు వలన నేమగును? అర్థమయుడగు వికుర్వాణ క్షరునివలన మాత్ర మేమగును? మఱియు, ఉపనిషత్తు జీవుని నిరూపించును. జీవునకు పరాప్రకృతి రూపాక్షరునితో సంబంధము. కనుక, నిట యక్షరుడే మొదట నుల్లేఖింపబడెను. ఈ యుపనిషత్ప్రధానము ప్రజ్ఞాన బ్రహ్మయని ప్రకరణారంభమందె యనుకొంటిమి. అందలి యక్షరుడే దీని తురీయభాగము. కనుకనే, పారమేష్ఠ్య భాగముంగూర్చి మహత్తనక, 'శివ' నామము వాడెను. మహత్తన్నచో దాని మహత్తే యగును. కాని యిచట గావలసినది మహదక్షరము. అది విజ్ఞానము ద్వారా ప్రజ్ఞానమందు బ్రతిష్ఠితమగును. శివశబ్దము వలన దానిం గ్రహింపవచ్చును. మహత్తును శివమే - ప్రజ్ఞానమును శివమే - విజ్ఞానమును శివమే; మహత్తు యొక్క శివమునకు మహత్తనియే ప్రసిద్ధి. విజ్ఞాన శివము విజ్ఞానమే. ప్రజ్ఞానశివము శివమని ప్రసిద్ధి. అగ్నితత్త్వము పేరు రుద్రుడు. ఆయగ్ని చిన్మయ సోమయుక్తమై శివమగును. అగ్ని - సోమములు దానికి రెండు శరీరములు. ఆయక్షర తత్త్వమే, అగ్ని ప్రధానతచే రుద్రుడు, సోమ సంబంధముచే శివము నగుచున్నది.

పరమేష్ఠియందు సోమమున్నది కనుకనే, అచటి యంగిరా ప్రాణము, అక్షరయుక్తమై శివమగుచున్నది. మున్ను క్షరుని ప్రపంచోపశమ మనుకొంటిమి. అవ్యక్తమును శాంత మనుకొంటిమి. మహత్తును శివ మనుకొంటిమి. ఇపుడీ మూటిని గ్రమముగ మహత్తు - విజ్ఞానము - ప్రజ్ఞానము ననుకొనుడు. మహదక్షరముతో సృష్టిక్రమము సమాప్తము.

మైథునీసృష్టికి ప్రభవ ప్రతిష్ఠాపరాయణము మహదక్షరము. కనుక సృష్టింబట్టి దీనిని బ్రపంచోపశమ మందుము. పారమేష్ఠ్యమగు నంగిరా ప్రాణ మాగ్నేయము, ఈ యగ్ని సోమయుక్తమగుటచే శివము. కాని, ఎట్టి శివము? ప్రపంచోపశమ శివము. ప్రపంచమంతయు నీశివునందు శాంతి నొందును. మహత్తునకు గ్రింద విజ్ఞానమున్నది. అది సూర్యుడు - ఆదిత్యుడు - అగ్ని. ఇందును సోమాహుతి నిరంతరముగ నగుచుండును. కనుకనే "సూర్యోహవా అగ్నిహోత్రమ్" అని శ్రుతి యన్నది.

ఇట్లు సోమ సంబంధముచే నాదిత్య రూప విజ్ఞానమును శివమే. ప్రపంచోపశమము కంటె భేదము సేయుటకే ఋషి దీనిని శాంతమనియెను. మైథునీ సృష్టి మహదక్షరమునందు శమించును, గాని రోదసీ బ్రహ్మాండమునకు బ్రథమ ప్రతిష్ఠ సూర్యుడే, మనకందరకు మృత్యు వతడే, జీవనము నతడే, సంవత్సరాది కాలరూప పరిణతుడు యితడే రూపము నుత్పాదించును. సర్వ మిచటనే శాంతించును. ఈ కాల పురుషుం గూర్చి "కాలః సృజతి భూతాని కాలః సంహరతే ప్రజాః" అని చెప్పబడినది.

ఇక మూడవదగు ప్రజ్ఞాన శివము. దీనింగూర్చి ఋషి 'శివ' నామమే వాడెను. విజ్ఞానశివు డపరాముక్తికి, మహదక్షరశివుడు పరాముక్తికి నధిష్ఠాతలు, కాగా, ప్రజ్ఞానశివుడు ముక్తికి సాధకుడయ్యును, జీవన రక్షకుడు. ప్రజ్ఞాన మున్నంత వరకు వైశ్వానరాది త్రయరూప భోక్త్రాత్మ యుండును. అంతవరకు జీవనము. జీవనదశయందు ప్రజ్ఞానశివు నారాదించుటెంతయు హితకరము. ఏమన:- విజ్ఞాన, మహత్తుల కంటె నిది (ప్రజ్ఞానము) మిగుల దగ్గరది, జీవన కారణమును, గదా! కనుకనే ఋషి యిట దానిని శివమని చెప్పెను.

అయీ శివమునకు బిదప శాంతవిజ్ఞానము, దానికి బిమ్మట బ్రపంచోపశమమగు మహదక్షరము. మాటమట్టుకివి మూడు, వస్తుతః ఒకేతత్త్వము సుడీ! భేదబుద్ధితోడి యుపాసన బంధకారణము. కనుకనే ఋషి ముందుకుబోయి 'అద్వైతం' అనవలసి వచ్చెను. అని జ్ఞప్తి యుంచుకొనవలయును. ప్రజ్ఞానోంకారారాధన ప్రధానముగ నెంచి యావైజ్ఞానికుడీ శివ (ప్రజ్ఞానాక్షర) మునే నాల్గవది = తురీయమని యెంచెను. ఏమన:- వైశ్వానరాది త్రయమున కీయదితురీయమే గదా? కనుక 'శివ' శబ్దముతో నుపసంహారము గావించెను.

ఈ ప్రజ్ఞానశివుడు లలాటప్రదేశముందుండును. శివవిశ్వపతి యావాసభూమియగు నిది యుపనిషత్తులందు వారణాసి (కాశీ) యని ప్రసిద్ధమయినది. మస్తకము సహస్రదళకమలము ఏతన్మధ్యమందు శక్తియుక్తుడై శివుడు విరాజిల్లుచుండును. ప్రజ్ఞాన మింద్రరూపము. అగ్ని - సోమ సంబంధమును బట్టి యిదే త్రినేత్రుడనబరగును. సోమము

చంద్రుడు ఇదే ప్రాజ్ఞుడు అగ్ని పార్థివ భాగము, ఇదే వైశ్వానరము. సప్తాంగ - ఏకోనవింశతిముఖ తైజసునకీ సప్తాంగ - ఏకోనవింశముఖ వైశ్వానరునందె యంతర్భావము. ఆదిత్య భాగము స్వయముగా బ్రజ్ఞానము. వైశ్వానర ప్రాజ్ఞాదిత్యులు మూవురు క్రమముగ అగ్ని - చంద్ర - సూర్యులు. ఈ మూడు నేత్రములచే నాశివుడధ్యాత్మాధి దైవతముల కుపద్రష్ట యగుచున్నాడు.

సోమభాగము సౌరతేజసంబంధముచే హేమవర్ణమగును కాగా, నదే హైమవతీ - ఉమా. ఏతద్వర్ణన కేనోపనిషత్తు నందరయవచ్చును. హైమవతి - యుమచిత్‌శక్తి అదే ఆది మాయ. పురుషుడగు శివునందదినిత్య ప్రతిష్ఠిత శివుడు వలయుచో శక్తి సాయము తప్పనిసరి. శక్తిలేనిచో శివప్రాప్తి యసంభవము, మా యీ, (తల్లి) లేకున్న మహేశ్వరారాధన సర్వధా నిష్ఫలము.

(1) మహద్విజ్ఞాన గర్భిత ప్రజ్ఞానాంశంబ్రహ్మ = తురీయము
(2) ప్రాజ్ఞుడు = చేతోముఖుడు - ఆనందభుక్ = తృతీయపాదము
(3) తైజసుడు = ఏకోనవింశతిముఖః, సప్తాంగః ప్రవివిక్తభుక్ ద్వితీయపాదము
(4) వైశ్వానరుడు = ఏకోనవింశతిముఖః, స్థూలభుక్, ప్రథమ పాదము

నఆత్మా - సవిజ్ఞేయః

అయమాత్మా బ్రహ్మ
సోఽయమాత్మాచతుష్పాత్

ఇక మిగిలిన యుపనిషత్తునందలి మంత్రములన్నియు నొక్కమారుగ జూతము:-

“సోయమాత్మాఽధ్యక్షర మోంకారోఽధిమాత్రం పాదామాత్రోమాత్రాశ్చపాదా, అకార, ఉకార, మకారఇతి (8) జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమా మాత్రాప్తే రాదిమత్వాద్వా అప్నోతిహ వైసర్వాణ్ కామానాదిశ్చ భవతియ ఏవంవేద (9) స్వప్నస్థానః తైజసః ఉకారోద్వితీయా మాత్రోత్కర్షాదు భయత్వా ద్వోత్కర్షతిహ వైజ్ఞానసంతతిం సమానశ్చ

భవతి నాస్యా బ్రహ్మవిత్కులే భవతి య ఏవంవేద (10) సుషుప్తస్థానః ప్రాజ్ఞోమకారస్తృతీయా మాత్రామితే రపీతే ర్వామినోతిహవా, ఇదంసర్వ మపీతిశ్చ భవతియఏవంవేద (11) అమాత్రశ్చతుర్థోఽ వ్యవహార్యః ప్రపంచోపశమః శివోఽ ద్వైతం ఏవమోంకారఆత్మైవ సంవిశత్యాత్మ. నాత్మానం యఏవంవేద యఏవం వేద (12)

ప్రజ్ఞాన విశిష్టాక్షరము దేవతారూపము, అదియుపాశ్యము, ఏమన, ఉపాసన యన్నది విశిష్టమునకే కాగలదు. ప్రజ్ఞానోపహిత శుద్ధాక్షరము మూలతత్త్వము. అది కేవలము ధ్యానయోగమున, జ్ఞేయము మాత్రము. ఇది ప్రజ్ఞానము ద్వారా పరబ్రహ్మ నిరూపణము.

ఇక నీ సగుణ బ్రహ్మక్షరోపాసన యెట్లు? అనుదానికి ప్రత్యుత్తరమీ వక్ష్యమాణ ప్రకరణము. "శాబ్దే బ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి" అనునట్లు శబ్ద బ్రహ్మోపాసన యేపరబ్రహ్మ నెఱుంగుట కుపాయము. పరబ్రహ్మ - శబ్ద బ్రహ్మల స్థితులు సమానములు. శబ్దబ్రహ్మ ఓంకారము. దీనిని సాధనముగా గొనుము - పరబ్రహ్మను లక్ష్యముగా గొనుము. అన్యత్ర విశదముగ - విపులముగ విమృష్టమయిన యీ యుపాసనం గూర్చి యిట సంక్షిప్తముగ దెలిసికొందము.

శబ్ద బ్రహ్మయు - పరబ్రహ్మయు నాత్మయే. ఒక బ్రహ్మకి రెండు వివర్తములు. ఈ రెంటి స్వరూపజ్ఞానమునకై ఋషి రెండు వేర్వేరు పేరులు పెట్టెను. రెండును నాల్గుపాదములవే. పరమార్థతః రెండు నొకవస్తువే. అభేదమనుకొన్నచో నుపాసన సాగదు. ఉపాసన, హేతుభావ సంబంధము గలది. అద్వైతమందుపాసన యుండదు అచట గేవల జ్ఞానమాత్రమే. కనుకనే వెనుక, శబ్ద - పర - భేదశూన్యము నేక వస్తువునగు బ్రహ్మంగూర్చి "శివ మద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా సవిజ్ఞేయః" అని చెప్పబడినది. కాని,

ఉపాసన పైకి లక్ష్య మరుగుచో, పూర్వోక్త చతుష్ప దాత్మ బ్రహ్మకు, పర - శబ్దములను రెండు భేదము లంగీకరింపవలసి వచ్చును. కనుక, ఇటనుండి యుపాసన ప్రధానముగ

నీ రెంటి నిరూపణ సేయబడును. తద్ద్వారా, ఉపాసనాప్రకారమును, తత్ఫలమును ఆదేశింపబడును.

8వ మంత్రము:- ఉపాస్యకోటింజేరునపుడాయాత్మయే 'అధ్యక్షర' మనబడును. అక్షర లక్ష్యముగా నుపాస్యమగున దధ్యక్షరము. "అక్షర మధికృత్య వర్ణ్యమానః ఉపాస్యాత్మా అధ్యక్షరం" ఉపాసనా సాధనభూత శబ్ద ప్రధానమగు నాయాత్మయే ఓంకార మనబరగును. మాత్రను లక్ష్యముగా గొని ప్రవృత్తమగుంగాన అధిమాత్రము. ఈవిధముగ అధ్యక్షర మనియు ఓంకార అధిమాత్రమనియు నుపాసనా కాండయందొక దానికే రెండు భేదములగును. అధ్యక్షరముపాస్యము, అధిమాత్రమగు నోంకారము సాధనము. ఉపనిషత్తులందు (1) పరాత్మ అక్షరమనియు, దాని వర్ణన మద్రేశ్యమనియు, అదియనుపాస్యము - కేవలము జ్ఞేయమాత్రము అనియు, సూచింపబడును. (2) ఇక శబ్దాత్మ, ఓమ్మనియు, దానివర్ణనమున, 'ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానమ్' అనియు సూచింపబడును. ఇదియుపాసనా సాథకమనును.

అక్షరాత్మ వాచ్యము. ఓం తద్వాచకము. "తస్యవాచకః ప్రణవః" వాచకము, శబ్దము - అదే ఓంకారము - అదే శబ్ద బ్రహ్మ, వ్యాచ్యమర్థము - అదే అక్షరము - పరబ్రహ్మ. దీని నాల్గు భాగములును పాదములు, దాని నాల్గు భాగములు మాత్రలు నాబడును. రెండునొకటే - అభిన్నములు, పాదములే మాత్రలు - మాత్రలే పాదములు. వ్యవహారమునకే అక్షరము - ఓం; - పాదములు - మాత్రలు. కనుకనే,

"సోఽయమాత్మా (పూర్వోక్తః అధ్వయఃశబ్ద - పరభేదా దభిన్నః ఆత్మా) అధ్యక్షరమ్ - ఓంకారోఽధిమాత్రమ్ - పాదాః - మాత్రాః" అని వాకొనెను.

ఇందు అక్షర పాదము నాల్గును మున్నెజెప్పబడినవి గదా! ఇక మిగిలిన 'అధిమాత్ర'మగు ఓంకారము. దీని మూడు మాత్రలు మూడు పాదములు. అ - ఉ - మ అనునవి. మాత్రాశ్చ - పాదాః అనుట అభేద సూచనార్థము ఇవి విజాతీయములు కాదు.

అక్షరుని మూడు పాదములే యివి. పరబ్రహ్మయే శబ్దబ్రహ్మ యైనది. "మాత్రాశ్చపాదాః అకార ఉకార మకార ఇతి".

(9) వ మంత్రము :- మూడు మాత్రలను అక్షరుని మూడు పాదములగు వైశ్వానరాది త్రయముతో వరుసగబోల్చి చూడుడు (1) జాగరితస్థాన - సప్తాంగ - ఏకోనవింశతిముఖ - బహిఃప్రజ్ఞ - వైశ్వానరుడు 'అ' యను మొదటి మాత్ర. వర్ణ సృష్టికి మూలమకారము. 'అకారోవైసర్వావాక్' సైషాస్పర్శోష్మభిర్వ్యజ్యమానా బహ్వీనానారూపాభవతి" అన్నట్లొక యకారమే, సమస్త వాక్ప్రపంచమును, అదే తాలుస్థానములను జేరి, 'ఇ' గను, ఓష్ఠస్థానముంజేరి 'ఉ' గను దంతమూర్ధ స్థానములను జేరి, ఋ - ఌగను నగుచున్నది. స్పర్శను బట్టి (స్థాన - కరణ సంయోగముచే, 'అ' 'క' యగును, ఇ - య అగును. ఉ - వ యగును. మహాప్రాణముచే క - ఖ యగును. ఇది నిదర్శన మాత్రము.

కేవలము స్పర్శోష్మల తారతమ్యముంబట్టి అకారము సమస్త వాక్కు నగును. 'అ' యన్నదక్షర రూపము, మొదటి మాత్ర, కనుకనే "అక్షరాణామకారోఽస్మి" యని భగవంతుడనెను. సర్వ వాక్ప్రపంచ మూలమకారము. 'అక్షర' మందు 'ర' యే వస్తువుంగాదు అ - క్ష యన్నవి మూలములు. కనుకనే మాలనక్ష శబ్దముతో బిల్తురు. అ నుండి క్ష వరకు వర్ణమాల 'ర' యన్నది తన్మధ్య పతితము. అక్ష్ అ క్రమమున నుపక్రమోప సంహారములందు స్వరమున్నది. మధ్య వ్యంజనమున్నది. భగవాన్ పాణిని 'అ- అ' యన్న సూత్ర మీ విద్యనే ప్రతి పాదించుచున్నది. సర్వ వాక్ప్రపంచమున కుపక్రమము అ. నిధనము అ. అ యన్నదే వాక్కు అనగా, వాక్కున నొక 'అ' యను నక్షరమే. కనుకనే "వాగిత్యేక మక్షరమ్" అను వచనము నెలసినది.

వాక్కు అగ్ని. ఆదియందు నంతమందు నిదే. వైశ్వానరాగ్ని నుండియే యీ శబ్దాగ్ని రూపవాక్కు దుబ్దమైనది. శారీరాగ్ని వైశ్వానరము "అగ్నిర్వాగ్భూత్వాముఖం ప్రావిశత్" అన్నట్లు ఆ యగ్నియే వాయువు త్రోపున నురః - కంఠ - మూర్ధములను జేరి ముఖమునకు వచ్చి క-చ-ట-త-పాది రూప పరిణతి నొందుచున్నది. చూడుడీ శిక్షాశ్లోకములను

"ఆత్మాబుద్ధ్యా సమేత్యర్థాన్ మనోయుజ్తే వివక్షయా,
మనఃకాయాగ్ని మాహత్య స(ప్రేరయతి మారుతమ్"

మారుతస్తూరసి చరన్ ......... ......... ...... .... ఇత్యాదులు.

ఆవశ్యకతను మించి మాట్లాడునపుడలసట నొందుదుము. శరీర మంతయు వేడియెక్కును. అగ్నియే శరీరబలము. మాట్లాడునపుడది యవసరమును మించి ఖర్చగును. కనుకనే అలసట కల్గుచున్నది ఇట్లు 'అ' యను నుపక్రమ వాక్ప్రపంచమునకును, వైశ్వానరాగ్నికిని యభేదత చక్కగా సిద్ధమగుచున్నది.

వైశ్వానరాగ్ని యుపక్రమమందున్నది. అదే వాగగ్ని బ్రహ్మాగ్ని రూపమున నుపసంహారమందు నున్నదని మున్నటి తాళికలవలన స్పష్టమే. ఇటు 'అ' తో వాక్కారంభమై ఇటనే సమాప్తమగుచున్నది. ఈ స్థితిలో 'అ' ను వైశ్వానరుని యొకటిగ నెంచదగును గదా! సరియే, అ = వైశ్వానరుడు, జాగరిత స్థానుడు అనగా - వైశ్వానరాంశ మాత్రము నందు సమానుడు, సప్తాంగత, ఏకోనవింశతి ముఖత, బహిప్ప్రజ్ఞత - అన్నవానికి వాక్ప్రపంచమందు ప్రత్యక్ష రూపత యుండునా? కనుకనే ఋషి వీనిని విడచివైచెను. 'అ' యన్న వైశ్వానరుడు శబ్ద ప్రథమ వర్ణము, ఆది, 'ఆప్లృ' = వ్యాప్తౌ ధాతువునకు మొదలిది, కనుక 'ఆదిమ' మనవచ్చును. దానిం గుర్తించిన, వాక్ప్రపంచమంతయు గుర్తించును కనుక, ఋషి 'ఆప్తి' కి జెందిన ఆకారమనియెను. దానిని సాధనముగాగొని యుపాసించువాడు వైశ్వానరోపాసకుడగును. పార్థివకామనలన్నిటిం బొందువాడగును, సర్వ ప్రాణి సమాజమందాదిముడు - అగ్రణి యగును. ఇంతకును "అ" ద్వారా వైశ్వానరోపాసన సేయుమని నిష్కర్ష పార్థివ బ్రహ్మాండమంతయు నగ్నిరూపము. తత్ప్రథమ భాగము వైశ్వానరుడు. ఆప్తికి మొదటి యక్షరము అ. ఈ శబ్దార్థా భిన్నతను లక్ష్యముగా గొనియే ఋషి వైశ్వానరుడకారమనెను.

## (10) వ మంత్రము

స్వప్నస్థాన తైజస ఉకారము, ద్వితీయమాత్ర. వైశ్వానరుడపానరూపము, ప్రాజ్ఞుడు ప్రాణరూపము, మధ్యనున్న వాయవ్య తైజసుడు వ్యాన రూపము. అర్థప్రధానుడగుటవలన వైశ్వానరుడు క్రియాశూన్యుడు. ప్రాజ్ఞుడును జ్ఞానప్రధానుడగుటచే క్రియాశూన్యుడే. మధ్యనున్న; సదాగతిధర్ముడు. వ్యాన రూపుడు, తైజసుడే క్రియాశక్తి కధిష్ఠాత. అర్థమునకుత్కర్షయు గ్రియాధీనమే. వాయుసంచారము లేకున్నచో, ధాతురూప వైశ్వానరుడు స్వస్వరూపమున నెన్నడు బుష్టి నొందజాలడు. క్రియలేకున్న నన్న పరిపాకమును సంభవింపదు. మనస్సు నిర్బలమగును. అందుచే, జ్ఞానబలహైన్యము వాటిల్లును. కాగా, జ్ఞానోత్కర్షయు తైజసువలననే యనదగును. కనుకనే :-

"నప్రాణేన నపానేన మర్త్యో జీవతి కశ్చన
ఇతరేణతు జీవన్తి యస్మిన్నేతా వుపాశ్రితౌ
ఊర్ధ్వం ప్రాణమున్నయతి అపానం ప్రత్యగస్యతి
మధ్యే వామన మాసీనం సర్వేదేవా ఉపాసతే"

అని శ్రుతి మధ్యనున్న తైజసరూప వ్యానమునే ప్రాణాపానరూప వైశ్వానరుని యుత్కర్షకు గారణముగ జెప్పినది. తైజసు డుత్కర్ష కధిష్టాత కనుకనే వృక్షములు పెరుగుచున్నవి. బాలకు డెదుగుచున్నాడు. గతి - క్రియారూప తైజసుడు లేకున్న నేమియులేదు. వైశ్వానరప్రాజ్ఞులు స్వతంత్రులు, మధ్య వాడగు నేమియు లేదు. వైశ్వానరప్రాజ్ఞులు స్వతంత్రులు, మధ్య వాడగు తైజసుడు భయస్థాన సంబంధము గల్గి యిరువురను సంచాలన సేయువాడు కనుక ఉత్కర్ష (రూపి) ఉభయ (రూపి) యనవచ్చును. ఈ రెంటికి గుర్తుగా తైజసునకు 'ఉ' కారము. అతడుత్కర్షశాలి, ఉభయానుగ్రాహకుడును గదా!

ఇట్లు 'ఉ' ను సాధనముగా గొని యుపాసించువాడు, జ్ఞానోత్కర్ష నొందును. తైజసవ్యానము వైశ్వానర ప్రాజ్ఞోభయాను గ్రాహకము కనుక నుభయత్ర సమానమయినట్లే తదుపాసకుడును శత్రు మిత్ర సమానుడగును. వైశ్వానరుడర్థము - ప్రాజ్ఞుడు జ్ఞానము ప్రధానములుగా గలవారు. అర్థ మావరణ రూపమగుటచే తమస్సు. జ్ఞానము ప్రకాశము అవి రెండును పరస్పర మత్యంత విరుద్ధములు, ఘోర శత్రువులు. అయిన నా రెండును తైజసు నాశ్రయముగా గొను నట్లే ఏతదుపాసకుని శత్రు మిత్రులు సమానముగ నాశ్రయింతురు. అతడందరకు సమానుడగును. జగమంతయు నితనికి మిత్రమే ఇదే యుత్కర్ష. ఇట్లెరింగిన వాని వంశమందెవ్వడు నెన్నడు మూర్ఖుడు కలుగడు. ఏలయన:-

తైజసాత్మమయ (తత్ప్రధాన) శుక్రసంబంధము గల సంతాన సూత్రమే తద్వాసనాయుక్తముగ నుండును కనుక నేడుతరములవరకు నాబ్రహ్మోపాసన, అవిద్యా ప్రతిబంధముగనగును. సంతాన సూత్రము 84 పితరుల యవతార క్రమముంబట్టి యేడవతరమునందు సమాప్తమగును. ఇంతకును, ఉకారమును లక్ష్యము గాగొని యక్షరుని తైజస పాదము నుపాసింపవలయునని యాదేశము.

## (11) వ మంత్రము

సుషుప్తస్థాన ప్రాజ్ఞ మకారము. ఇది మూడవ మాత్ర. అర్థ క్రియా ప్రధానులగు వైశ్వానర ప్రాజ్ఞులు పరిచ్ఛిన్నులు. కాని, ప్రజ్ఞాన సంపరిష్వక్త - ప్రజ్ఞానఘన - జ్ఞానమూర్తి ప్రాజ్ఞుడపరిచ్ఛిన్నుడు. క్రియార్థము లెల్ల జ్ఞాన సముద్రమందు లీనములు. జ్ఞానమేనుగంత పెద్దది - చీమంత చిన్నది - మరల విశ్వమంత పెద్దది నూకంత చిన్నది. ఇట్లు అణువు కంటె నణువు. మహత్తు కంటె మహత్తునగు జ్ఞానము ప్రజ్ఞాన ఘనుడగు ప్రాజ్ఞుని లోనికి వచ్చి తదాకారాకారితమయి పోవుచున్నది.

జ్ఞానములోనికి వచ్చిన పదార్థమెల్ల సీమితమయి పోవును. జ్ఞానము సీమితము గావించి వేయని పదార్థమేదేని విశ్వమందున్నదా? అదియెంతేని పెద్దది కానిండు, జ్ఞానములోనికి రాగానే సీమితమయిపోవును. కనుక, విషయరూప వైశ్వానరునకును,

క్రియారూప తైజసునకును, ఈ ప్రాజ్ఞుని 'మితి' యందుము. జ్ఞానమయియా ప్రజ్ఞ యన్నిటికినిమితి, మాపకయంత్రము, మితి భావపన్నమగుట వలననే దీనిని 'మ' యనవచ్చును. అ-ఉ-మ్ అనువానిలో 'మ్' హల్లు. ఓంకారమందు గావలసినది హల్లే కనుకనే మాదిశబ్దమేదియు నుంచక, అర్థానుకూలముగ 'మితి' శబ్దము నుంచెను. 'మితి' నుండి 'మ్' ను వేరుసేయుట సుకరము. ప్రాజ్ఞుడు మకారమనగా, మితిధర్మము గలవాడనియు అన్నిటిని 'మితి' సేయువాడనియు నర్థము.

లేక వ్రాసినపిదప జివర 'మితి' సేయబడును. 'మితి' సమాప్తిసూచకము. భోక్తాత్మయొక్క మితి - (సమాప్తి) ప్రజ్ఞ. కనుక ప్రాజ్ఞుడు 'మితి' వాడుక యందలి మితి శబ్దమూలమీ వైదిక మితిశబ్దము. అథవా అపితి (అప్యయము - లయము) సంబంధమును బట్టియు దీని 'మ్' యనదగును. 'ఓమ్' వైశ్వానరునకు తైజసునందు లయము. తైజసునకు ప్రాజ్ఞునందు లయము. ఇక శబ్ద బ్రహ్మమందు :- 'అ' వైశ్వానరునకును, 'ఉ' తైజసునకును అప్యయము 'మ్' యందు ఓమ్ ఉచ్చరించిన పిదప. అ - ఉ - లు 'మ్' యందపీతములగుట కనిపెట్టగలము పరబ్రహ్మయందును, వైశ్వానర తైజసులకు ప్రాజ్ఞునంద పీతిగదా! ఈ సామాన్య భావము వలనను, అపీతిరూప 'మ్' దీనికి నామమగుచున్నది.

ప్రాజ్ఞునిదగు, నీమితి - అపీతి విజ్ఞానముల నెఱింగి మకారమును సాధనముగా గొని యా ప్రాజ్ఞబ్రహ్మ నుపాసించువాడు, విశ్వవైభవ మంతటిని తన ప్రజ్ఞానముచే గొల్చు కొనును. సర్వమందపీతి కాగలడు. సర్వవైభవముపై నధికారము నెఱపగలడు. 'మ్' ఎదుట బెట్టుకొని ప్రాజ్ఞునుపాసింపుము. ఇదే నిష్కర్ష.

## (12) వ మంత్రము

ఇక మిగిలిన దక్షరయుక్త ప్రజ్ఞానము. ఇది పై జెప్పబడిన మూడు మాత్రలకును, అఖండము - అమాత్రమునగు నాధారము. దానిం దురీయమనియెను. మాత్ర యనలేదు. అది 'యవ్యవహార్యము' ప్రపంచోపశమము, శివము. అద్వైతము. అదే ఓంకారము. ఈ

శబ్దబ్రహ్మ రూపమయిన ఓంకారము, ఆయా పరబ్రహ్మ రూపాత్మ తత్త్వమునకు భిన్నము కాదు. ఓమ్ అక్షరాత్మ ఏకవస్తువు. ఈ యాత్మ విజ్ఞానము నెఱుంగువాడు. అద్వైతమును బూర్ణముగ నెఱుంగును. తన వైశ్వానర తైజస ప్రాజ్ఞరూప భోక్తాత్మతో నా యర్ధమాత్రా రూపమగు నాత్మయందు బ్రవిష్టుడగును. ద్వంద్వాతీతుడై 'నస పునరావర్తతే - నస పునరావర్తతే' యనుట కధికారి యగును.

ఓమ్ తత్సత్

ఓమ్ భద్రంకర్ణేభిరితి శాంతిః

బ్రహ్మశ్రీ చల్లా సుబ్బాంబా సుబ్బారాయ

తనూజన్మనః, అను శ్రుత వైజ్ఞానికస్య,

కృష్ణ మూర్తి శర్మణః కృతిషు బ్రహ్మవిజ్ఞాన పరిచయే సర్వం

సమాప్తమ్

## గ్రంథకర్త యితర గ్రంథములు

### ముద్రితములు

1. శ్రీమద్భగవద్గీత విజ్ఞానము
2. ఆత్మ - బ్రహ్మ - కర్మ విజ్ఞానము
3. కర్మయోగ విజ్ఞానము
4. వర్ణాశ్రమ సంస్కార విజ్ఞానము
5. శ్రీమద్భగవద్గీతచార్య విజ్ఞానము

### అముద్రితములు

1. వేదవిజ్ఞానము
2. ఈశోపనిషద్విజ్ఞానము
3. బ్రహ్మ విజ్ఞానము
4. దేవ - దేవతాసుర - యక్ష - రాక్షస విజ్ఞానము
5. పురాణసమీక్ష

వలయు వారు

# చల్లా కృష్ణమూర్తి శాస్త్రి

విజ్ఞాన భవనము

మట్లపాలెము

దొడ్డిపట్ల పోష్టు

(వయా పాలకొల్లు) ప॥గో॥జి